ఇందులో . . .

ఆర్యనాగార్జుని

విగ్రహవ్యావర్తిని

జేగంటలు :

1. ప్లేటో

2. కాంట్ పరతత్త్వవాదం

ఇతర తాత్త్విక వ్యాసాలు

1. మార్క్సిజమ్ తత్త్వ పరిశీలన

2. నిర్వాణ పరీక్ష

3. వర్గ సంబంధాలు

(సూతాశ్రమ గ్రంథమాల ప్రచురణ 1944 - లభ్యంకాలేదు)

## జి.వి. కృష్ణరావు రచనలు

| | | |
|---|---|---|
| ఒకటో సంపుటం | : | సాహిత్య విమర్శ (కావ్యజగత్తు, ఇతర వ్యాసాలు) |
| రెండో సంపుటం | : | **Studies in Kalapurnodayam** |
| మూడో సంపుటం | : | నవలలు : పాపికొండలు |
| నాలుగో సంపుటం | : | నవలలు : కీలుబొమ్మలు, జఘనసుందరి, రాగరేఖలు |
| ఐదో సంపుటం | : | నాటికలు – నాటకాలు (ఆదర్శ శిఖరాలు, ప్రతిమ, బొమ్మ ఏడ్చింది ) |
| ఆరో సంపుటం | : | పద్యాలు, కధలు, ఇతరాలు |
| ఏడో సంపుటం | : | తాత్త్వికం – విగ్రహ వ్యావర్తని, ప్లేటో, కాంట్ ఇతర తాత్త్విక వ్యాసాలు |

# ఆర్యనాగార్జునుని
# విగ్రహవ్యావర్తని

జి. వి. కృష్ణరావు

సంపాదకుడు
అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

A GIFT FROM A DAUGHTER
IN MEMORY OF HER FATHER, THE WRITER

ప్రభాస పబ్లికేషన్స్
బోస్‌రోడ్ - తెనాలి

విగ్రహవ్యావర్తని
(ఇతర తాత్త్విక వ్యాసాలు)


ప్రభాస పబ్లికేషన్స్
బోస్‌రోడ్ - తెనాలి

ప్రథమ ముద్రణ : నవంబర్, 1958
ద్వితీయ ముద్రణ : జనవరి, 1999

వెల : రూ 150/-

ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్
దుర్గయ్య వీధి, గవర్నరుపేట,
విజయవాడ - 520 002

గ్రాఫిక్స్ & ప్రింటర్స్ : కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్.
ఆర్. టి. సి. క్రాస్‌రోడ్స్, ముషీరాబాద్
హైదరాబాద్ - 500 020

# సంపాదకుని మాట

ఒక రచయిత తన రచనల ద్వారానే ఎల్లకాలం సజీవంగా జనాళిలో ఉండగలడు అదెప్పుడు? ఆయన రచనలో గ్రంథరూపంలోనో, మరో రూపంలోనో అందుబాటులో ఉన్నప్పుడే కాని దురదృష్టవశాత్తు కృష్ణరావుగారి రచనలు చాలా కాలంగా లభ్యంకావడం లేదు ఆయన సాహిత్యం మీద పరిశోధనలు చేసే వారంతా, నేను ఆయనకు సన్నిహిత మిత్రుణ్ణి కావడంతో, నన్ను కలిసి, ఆయనను గురించి, వారి గ్రంథాలు లభ్యమయ్యే విధం గురించి అడుగుతూ ఉంటారు గ్రంథాలు లేక పోవడంతో నేనూ వారికి ఏమి చేయలేని వాడినయ్యాను

కృష్ణరావుగారి కొమారితలిద్దరూ – ఉమాదేవి, శోభాదేవి – ఎప్పుడు అమెరికానుంచి తెనాలి వచ్చినా, వారిదగ్గర వారి తండ్రిగారి గ్రంథాల ప్రచురణ గురించి ఈ అవసరంతో ప్రస్తావిస్తూ ఉండేవాణ్ణి వారు ఎప్పుడూ సుముఖతనే వ్యక్తం చేశారు కాని అది కార్యం రూపం ఆమధ్య జనవరి 1998న వారు తెనాలి వచ్చినప్పుడు, దాల్చింది ప్రచురణ బాధ్యతలు నేను స్వీకరిస్తానంటే వారు 'సరే' అన్నారు. నేను దానికి, కృష్ణరావుగారిమీద నాకున్న ఎనలేని గౌరవాభిమానాలను పురస్కరించుకొని, వెంటనే అంగీకరించాను.

ఈ కార్యంలో నేను చాలా మందికి కృతజ్ఞతలు చెప్పుకోవలసి ఉంది

తొలుదొల్తగా, తమ అమూల్యమైన సలహాలిచ్చి, జి వి కె ని స్థూలంగా పరిచయంచేసే వ్యాసాన్ని వ్రాసి ఇచ్చిన హితశ్రీ గారికి, కృష్ణరావుగారి గ్రంథాలనూ, వ్యాసాలనూ, అందించిన విజయవాడ సిద్ధార్థ సైన్స్ అండ్ ఆర్ట్స్ కాలేజి సిద్ధార్థ కళాపీఠం సంచాలకులు నాగళ్ళ గురుప్రసాద రావుగారికి, అలాగే డి టి పి ప్రింటింగ్, ప్రూఫ్ రీడింగ్ విషయాలలో అడుగడుగునా నాకు కుడిభుజమై నిలిచిన సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్న ప్రముఖ సాహితీ విమర్శకులు బి తిరుపతిరావుగారికి, జి వి కృష్ణరావుపై పరిశోధన చేసి పిహెచ్ డి పొందిన, తెలుగు అకాడమీ లో పనిచేస్తున్న, మాణిక్య లక్ష్మిగారు కృష్ణరావు గారి వివిధ రచనల కాలాలను తెలియ జేశారు – వారికి, గ్రంథాకృతిని గురించి సలహాలు ఇచ్చిన డా పి వి రమణ గారికి, గ్రంథ సేకరణలో అత్యంతంగా సహాయసహకారాలందించిన డా వెలగా వెంకటప్పయ్య గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్ హైదరాబాద్ వారికి నేను హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను

– సంపాదకుడు

# ప్రకాశకుల మాట

మా నాన్నగారు జీవించి ఉన్నప్పుడే ఆయన రచనలకు మలికూర్పు రాక పోవడం వల్ల అవి దొరకడం దుర్లభంగా ఉండేది ఆయనమీద పరిశోధనలు సాగించేవారు గ్రంథాలు దొరకక వాలా ఇబ్బందులకు గురయ్యారు ఏ హితశ్రీగారో, రెడ్డిగారో తమ వద్ద ఉన్న మానాన్నగారి రచనలను వారికి ఇచ్చి వారి అవసరాలు తీర్చేవారు ఆవిధంగా వారి దగ్గర కూడా గ్రంథాలు లేకుండా పోయాయి

తరువాత మానాన్నగారు గతించి నప్పటినుంచి, ఆయన రచనలన్నీ ఒకసారి అచ్చొత్తించాలని రెడ్డిగారు మాకు సూచిస్తూనే ఉన్నారు. మాకూ అదే తలంపు ఉంది చూస్తుండగానే చాలకాలం గడిచింది

**1998** జనవరిలో మేము భారతదేశానికి వచ్చినప్పుడు శ్రీ అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి గారు మళ్ళీ ఆప్రస్తావన తీసుకొచ్చారు మేము 'సరే' అన్నాం రెడ్డిగారిని అచ్చుపని చూడవలసిందిగా అభ్యర్థించాం వారికి మానాన్నగారితో ఉన్న స్నేహ సంబంధాలను పురస్కరించుకొని, సంతోషంతో 'సరే' అన్నారు ఎంతో శ్రమించి, ఎక్కడెక్కడో వెతికి, దొరకని రచనలను దొరికించుకొని, ఏడు సంపుటాలలో ముద్రణా నిర్వహణను విజయవంతంగా నిర్వహించినందుకు వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు

అలాగే ఈ గ్రంథాలు వెలికి రావడంలో చేయూతనిచ్చిన వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం

జి ఉమాదేవి

జి శోభాదేవి

# జీవితం, రచనలు

– హితశ్రీ

ఒక రచయితను అంచనా వేయడానికి, అతడు నిశ్వసించింది ఉచ్ఛ్వసించింది ఏమిటో తెలియాలి అతడు నిశ్వసించింది – అతడు చదివిన చదువు, పొందిన శిక్షణ అతడు ఉచ్ఛ్వసించింది అతడు కావించిన సృష్టి, రాసిన రాతలు

ఆయన ఎంతో చదివారు చదవక రాయడం కుదిరేదనికాదు ప్రాక్పశ్చిమ రససిద్ధాంతాలను, సాహిత్యాన్ని, దర్శనాలను లోతుగా చదివారు

ప్రాక్పశ్చిమ రస సిద్ధాంతాలను ఆస్వాదించారు అంటే అటు అరిస్టటిల్ కావ్యాను శాసనం, ప్లేటో రామణీయకతనుంచి కాంట్ పరతత్వవాదం వరకు, ఇటు భరతుని నాట్య శాస్త్రంతో మొదలెట్టి భామహ, ఉద్భట, భట్టనాయక, భట్టలొల్లట, ఆనందవర్ధన, ఇందు రాజ, అభినవగుప్త, క్షేమేంద్ర, మహిమభట్ట, మమ్మటుల దాకా భారతీయ రస సిద్ధాంతాలను ఔపోశన పట్టారు

అర్థరాహిత్య రంగస్థలిని (Theatre of the Absurd) అర్థం చేసుకొన్నారు ''సప్తభంగుల అస్పష్టత'' (Seven Types of Ambignity) లోని స్పష్టతను ఎరిగారు పాశ్చాత్య దర్శనాలను మదించారు ఆర్య నాగార్జును నిసాపేక్ష వాదంలో జెనో "Flying arrow is at rest" (ఎగురుతున్న బాణం నిశ్చల స్థితిలో ఉంది) ను చూశారు

మార్క్సు గతి తర్కం గతిని పరిశీలించి యన్ యమ్ రాయ్ మానవత్వాన్ని (Human-ness) గుర్తించారు

మార్క్సు, హెగెల్‌ల వ్యవస్థలలో (దర్శనాలలో) వ్యక్తిలుప్తమైనాడని, సార్త్ర్ అస్తిత్వంలోని మనిషి అస్తిత్వ వేదనను పట్టుకొన్నారు ఫ్రాయిడ్ స్వప్న శిల్పాన్ని భారతీయ ధ్వని సిద్ధాంతంతో ముడిపెట్టారు ప్రవర్తన వాదాన్ని, గెస్టాల్ట్ సిద్ధాంతాన్ని సాహిత్యానికి అన్వయించారు

ఇదీ క్లుప్తంగా ఆయన విస్తృత కాన్వాస్ దీని మీద ఆయన ఉలితో ఉల్లేఖించారు

సాహితీ మేరుపు డాక్టర్ జీ వి కృష్ణరావు పూర్తిపేరు గవిని వెంకటకృష్ణరావు వారి స్వస్థలం తెనాలి తాలూకా కూచిపూడి గ్రామం నివాసస్థలం తెనాలి వారు కూచిపూడిలో 1914లో జన్మించారు వ్యవసాయ కుటుంబం తురుమెళ్ళ, కొల్లూరు హైస్కూళ్ళలో పాఠశాల విద్య అభ్యసించారు యస్ యస్ ఎల్ సి నాటికే ఒక చిన్న నవల, ఒక శతకం రచించారు గుంటూరు ఏ సి కాలేజిలో బి ఏ వరకు చదివారు కాలేజిలో చదివేరోజుల్లోనే ''వరూధిని''

ఖండకావ్యం రచించారు 1937లో బి ఏ డిగ్రీ పొందారు గుంటూరులో పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారి దగ్గర సంస్కృతం చదువుకొన్నారు

తెనాలి ఆ రోజుల్లో ఒకసాహితీకేంద్రం చక్రపాణి, కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని గోపీచంద్ మొదలైన రచయితలెందరో తెనాలిలో ఉండేవారు వారితో కృష్ణరావుకి పరిచయం ఏర్పడింది సాహిత్యచర్చలు జరుగుతుండేవి గోపీచంద్ సాంగత్యం వల్ల కృష్ణరావుకి పాశ్చాత్య సాహిత్యాబిలాష, ఎం ఎన్ రాయ్ రచనలపట్ల ఆకర్షణ, మార్క్సిస్ట్ దృక్పదం అలవడ్డాయి కొన్నికదలు, నాటికలు రాశారు

డిగ్రీ అందిన తరువాత కృష్ణరావుకి నిరుద్యోగం ఎదురైంది నిరాశా నిస్పృహల అనుబవాలతో ''బిక్షాపాత్ర'' నాటిక రాశారు ఇతివృత్తం కాశీనుంచి వ్యాస నిష్కాసనం మార్క్సిస్టు దృక్పదంతో రాసిన ఈ నాటిక పదహారు భారతీయ బాషల్లోకి అనువదింపబడి ఆకాశవాణి నుంచి ప్రసారితమైంది నిరుద్యోగంతో విసుగెత్తి కృష్ణరావు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఎం ఏ ఇంగ్లీషు లిటరేచర్‌లో చేరారు ఆంగ్ల సాహిత్యాద్యయనంలో మునిగి తేలారు ఎం ఏ చదువుతున్న రోజుల్లోనే ''కావ్య జగత్తు'' సాహిత్య విమర్శనా గ్రందం రచించారు దేశ కాల పరిస్థితుల్ని అనుసరించి కావ్యాల్లో వస్తువు రూపం ఎలా మార్పు చెందుతుందో ఇందులో మార్క్సిస్టు దృక్పధంతో వివరించారు ఇది చాలా ప్రసిద్ధమై విశ్వవిద్యాలయాల్లో పాఠ్యపుస్తకమైంది పరిస్థితులు అనుకూలించక కృష్ణరావు ఎం ఏ పరీక్షలు రాయకుండానే 1941లో తిరిగి వచ్చారు

కాశీ నుంచి తిరిగి వచ్చింతరువాత కృష్ణరావు జర్నలిజంలోకి అడుగు పెట్టారు కొంతకాలం మిత్రులతో కలిసి ఓ ప్రెస్, ఓ ఫర్నీచర్ షాపు నడిపారు అవేవీ విజయవంతం కాలేదు ఇంతలో ''ఆంధ్రప్రభ''లో సబ్ ఎడిటర్ పదవి లభించింది నార్ల, శ్రీశ్రీలతో పాటు '' ఆంధ్ర ప్రబ'' సంపాదక వర్గంలో పనిచేశారు ఆ కాలంలో ''జఘనసుందరి'' నవల రాశారు ఇది ఫ్రాయిడ్ సిద్ధాంతాల్ని తార్కికంగా బేరీజు వేసే ప్రసిద్ధ నవల ఆ తరవాత సంపాదకవర్గ నిర్ణయానుసారం కృష్ణరావు ''ఆంధ్రప్రభ'' నుండి వైదొలగారు దేశాబిమాని, విజయప్రభ పత్రికల్లో కొంత కాలం పని చేసి విరమించుకొన్నారు

పత్రికారంగానికి ఉద్వాసన పలికి కృష్ణరావు పిహెచ్ డి డిగ్రీ కోసం మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధనకు పూనుకొన్నారు పింగళి సూరన ''కళాపూర్ణోదయం'' వారి దృష్టిని ఆకట్టుకొంది "Studies in Kalapoornodayam" అనే ఆంగ్ల గ్రందాన్ని డాక్టరేట్ కోసం రాయాలని సంకల్పించి ఆ పరిశోధనలో నిమగ్నులయ్యారు ఈలోగా వారికి వ్యక్తి స్వాతంత్ర్యం మీద జిజ్ఞాస కలిగి తత్వ శాస్త్ర గ్రందాల్ని తిరిగేశారు జేగంటలు-కాంట్ పరతత్వవాదం, ప్లేటో-ప్రచురించారు తాత్విక చింతన స్వంతంత్ర విచారానికి దారి తీసింది

తత్ఫలితమే 1951లో ''కీలుబొమ్మలు'' నవలా రచన ఇది కృష్ణరావుకి ఎంతో పేరు తెచ్చిపెట్టిన విఖ్యాత నవల ఇటీవల ఇది ఆంగ్లంలోకి అనువదించబడి మాక్మిలన్ కంపెనీచె ప్రచురింపబడింది వ్యక్తిలో కర్తవ్య జిజ్ఞాసని రెకెత్తించటమే ఈ నవల లక్ష్యం

అప్పుడప్పుడు రాసిన నాటికల్ని గుదిగుచ్చి ''ఆదర్శ శిఖరాలు '' నాటికల సంపుటి ప్రచురించారు ఇది విలువల కాణాచి

మద్రాసు విశ్వవిద్యాలయం "Studies in Kalapurnodayam" ఆంగ్ల వ్యాసానికి కృష్ణరావుకి 1955లో పిహెచ్ డి డిగ్రీ ప్రదానం చేసింది ''కళాపూర్ణోదయం 'లో కళ ఎలా పూర్ణోదయం చెందిందో ఈ గ్రందంలో కృష్ణరావు పింగళి సూరనని ప్రపంచ కవుల సరసన నిలబెట్టారు 1952లో కృష్ణరావు తెనాలిలో వి యస్ ఆర్ కాలేజిలో అధ్యాపకునిగా చేరారు ఈ రోజుల్లో మాధ్యమిక వాదంలో కుతూహలం కలిగి ఆర్యనాగార్జునుని గ్రందాలను కొన్నిటిని పద్యాలుగా అనువదించారు అవి పోయాయి ''విగ్రహవ్యావర్తని'' నిమాత్రం తిరిగి అనువదించి విపుల భూమికతో ప్రచురించారు కేంద్ర సాహిత్య అకాడమీ తరుపున ప్లేటో 'రిపబ్లిక్' గ్రందాన్ని ''ఆదర్శరాజ్యం'' పేరుతో తెలుగు చేశారు ''రాగరేఖలు'' నవలరాశారు

1962లొ పరిస్థితులతో రాజీపడలేక కాలెజి ఉద్యోగానికి తిలోదకమిచ్చారు మళ్ళీ నిరుద్యోగం ఈ సమయంలో ''పాపికొండలు'' నవల ప్రారంబించారు అది దిన పత్రికలో సీరియల్‌గా వచ్చింది అదికారం మనుషుల్ని ఎలా మత్తుల్ని చేస్తుందో వివరించటం ఈ నవల ఇతివృత్తం ఇందులో కృష్ణరావు తన ఆలోచనా రీతులను వ్యంగ్య వైభవంతో నిక్షేపించారు ఇది ఒక రసగంగ స్వల్ప కాలం పొన్నూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేసి, కృష్ణరావు 1963లో ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్‌గా పదవి నదిష్టించారు ఈసారి మాత్రం 1973లో పదవీ విరమణచేసేవరకు ఉద్యోగంలో కొనసాగారు రేడియో ఉద్యోగంలో ఉన్ననాడే భాస మహాకవి సంస్కృత నాటకం ప్రతిమ నాటకాన్ని తెలుగు చేశారు కొన్ని కవితలు, కదలు, సాహిత్య వ్యాసాలు చేర్చి ''ఉద బిందువులు'' సంపుటి ప్రచురించారు

రేడియో ఉద్యోగంతో కుంటుపడిన ''పాపికొండలు'' రచన కృష్ణరావు అనారోగ్య కారణాలవల్ల అర్ధంతరంగా ఆగిపోయింది ఇది తెలుగువారి దురదృష్టం 1979లో ''బొమ్మ ఏడ్చింది'' నాటకం వెలువడింది ఇది ఆర్యనాగార్జునునికీ, అప్పటి పాలకుడు గౌతమీ పుత్ర శాతకర్ణి, అతని తల్లి గౌతమీ బాలశ్రీకి సంబందించిన ఇతివృత్తంతో రాసిన నాటకం రాజ్యపాలకులు మత నిరపేక్షంగా రాజ్యం చేయాలని ఇందులో సందేశం

తెనాలిలోని శ్రీ అరవింద సాహిత్య సేవా సమితి ఆద్వర్యంలో డాక్టర్ జి వి కృష్ణరావుకి తెనాలిలొ మార్చి 30, 1979 తెదిన అప్పటి ఆంద్రప్రదేశ్ సాహిత్య అకాడమి అద్యక్షులు శ్రీ బెజవాడ గొపాలరెడ్డి గారి అద్యక్షతన ఘన సన్మానం కన్నుల పండువగా జరిగింది తరవాత వారు ఎక్కువ కాలం జివించలెదు కృష్ణరావు ఆగష్టు 23, 1979 తెదిన తుది శ్వాస విడిచారు

## రచనల వైశిష్ట్యం

కృష్ణరావు సంస్కృతాంద్ర ఆంగ్ల బాషల్లో విద్వాంసులు ఆయా బాషా సాహిత్యాల్లో నిష్ణాతులు వ్యాకరణ సూత్రాల్ని, అలంకార శాస్త్రాన్ని లోతుగా తరచి ఆకళింపు చెసుకొన్నవారు ప్రాచ్య పాశ్చాత్య తత్వ శాస్త్రాల్ని మదించిన వారు సామాజిక, రాజకీయనైతిక, మనొవైజ్ఞానిక శాస్త్రాల్ని అవలొడించిన వారు ప్రాక్ పశ్చిమ దేశాల విభిన్న సంస్కృతుల్ని అవగాహన చెసుకొన్నవారు అనన్య ప్రతిబావ్యుత్పత్తులతో, బహుముఖ పరిజ్ఞానంతో, సునిశిత ఆలోచనలతో కృష్ణరావు ఉత్తమ కవితల్ని, నాటక నాటికల్నీ, కదల్నీ, నవలల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్నీ రచించి తమ సాహితీ చైత్ర రదాన్ని 1963 శోబాయమానం చెశారు ఆ పూదొట సర్వాంగ సుందరం, పరిమళబరితం

కృష్ణరావు జీవితాన్ని, రచనల్ని పరిశీలిస్తే వారి జీవితంలో, రచనల్లొ అంతర్వాహినిగా బారతీయత ప్రవహించటం గోచరిస్తుంది ఎర్రగా, సన్నగా, పొడుగ్గా, గరుడనాసికతో, తీక్షణమయిన కనుదోయితో ఎప్పుడూ తెల్లని లాల్చీ, గ్లాస్కో దొవతి దరించి అచ్చం బారతీయుడుగా, ఆంద్రుడుగా కృష్ణరావు కనపడేవారు వివిద సంస్కృతుల్ని పరిశీలించి వారు చివరకి బారతీయ సంస్కృతి వైపే మొగ్గు చూపారు ఆంగ్లంతో పాటు సంస్కృతాంద్రాలను చక్కగా చదువుకొన్నారు ప్రాచీన సంస్కృతాంద్ర కవుల రచనల్ని సమీకరించారు మన సామాన్య ప్రజానీకం విలువలన్ని రామాయణ బారతాల నుంచి వారసత్వంగా వచ్చినవేనని అభిబాషించారు అలంకార శాస్త్రంలో భారతీయ ధ్వని సిద్ధాంతమే పరమ శిరోదార్యంగా బావించారు వారినాటికల్లో అనేకం బారతీయ సాంస్కృతిక ఇతివృత్తంలో కలవే నాగార్జున మాద్యమిక వాదాన్ని అబిమానించారు బాస ప్రతిమ నాటకాన్ని అనువదించారు కళాపూర్ణోదయం మీద దీసిస్ రాశారు సృజనాత్మకరచన సద్యః పరనిర్వృతి నివ్వాలని బారతీయ లాక్షణికులతో ఏకీబవించారు అయితే బారతీయమంతా ఆమోదయోగ్యమని కృష్ణరావు బావించేవాడు ఏ విషయాన్నయినా కార్యకారణాలతో తర్కించి నిగ్గు తేల్చే హేతువాది కృష్ణరావు తన పరీక్షకి నిలబడిన వాటినే స్వీకరించారు మొదట మార్క్సిస్టు ప్రబావానికి లోనయ్యారు త్వరలోనే ఆ ప్రబావంనుంచి బయట పడ్డారు ''డమడమాలబండి'' నాటిక వారి కనువిప్పుకి రూపకల్పన వ్యష్టిలో సమిష్టినీ, సమిష్టిలో వ్యష్టిని గుర్తించినప్పుడే ఏ రాజకీయ

వ్యవస్థ అయినా అభ్యుదయం సాధిస్తుందని కృష్ణరావు భావించారు లేకపోతే అది వట్టి నినాదాల ఢమఢమాలబండే అలాగే ''కార్యజగత్తు'' లోని మార్క్సిస్టు దృష్టిమారి వారి సాహిత్య విమర్శనా ప్రతిభ కళాపూర్ణోదయ సిద్ధాంత గ్రంథంలో వెల్లి విరుస్తుంది

కృష్ణరావు ఆదర్శం ధర్మం ఆశయం వ్యక్తి స్వాతంత్ర్యం ''ధర్మం'' ధర్మం కోసమే, ఆదర్శమే మానవ జీవితం అంటారు కృష్ణరావు 'కీలుబొమ్మలు'' నవలలో ధర్మానుష్ఠానంలోనే ఆనందం ఉన్నాదనుకొని చేసినప్పుడే వ్యక్తికీ, తద్వారా సమాజానికీ అభ్యుదయం సిద్ధిస్తుందని కృష్ణరావు విశ్వాసం వ్యక్తులకి స్వతంత్ర విచారం ఉండాలి వ్యక్తికి అంతఃకరణం ఉంటుంది అది వివేక చోదితం పరిస్థితులు చుట్టు ముట్టినప్పుడు ప్రతి వ్యక్తీ స్వతంత్రాలోచనతో తన అంత కరణం సాక్షిగా ప్రవర్తించి తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలి లేనినాడు అధర్మం ప్రవర్తిల్లి సమాజం సంక్షోభం చెందుతుంది ఇదె ''కీలుబొమ్మలు'' నవల సందేశం అంతేకాని వ్యక్తులు పరిస్థితుల కీలుబొమ్మలని కాదు వ్యక్తి ధర్మం లుప్తమైతేనే దేశం శప్తమవుతుంది వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఉద్దీప్తం చెయటం రచయిత బాధ్యత అని కృష్ణరావు తలచారు ఈ వ్యక్తి స్వాతంత్ర్య చేతనె ' పాపికొండలు'' నవలలో మరింత స్పష్టమవుతుంది ఇందులోని కొన్ని పాత్రలు పరిస్థితులకు ఎదురునిలచి తాము నమ్మిన ధర్మాన్ని అనుసరించి తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొంటాయి ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో ఆర్య నాగర్జునల పాత్ర అలాంటిదే

కృష్ణరావు దృష్టిలో జీవితం, కళా వెరువేరు కావు అవి రెండూ ఒకటే జీవిత ప్రవాహానికి ఆద్యంతాలు లెవు అది అనంతం దాన్ని అర్థం చేసుకొటానికి ఉపకరించే ఆద్యంత సహిత జీవిత శకలమే కళ - అంటారు వారు

కళాత్మకమైన రచన జీవితపు విలువల్ని నిర్దేశించి వెలుగునివ్వాలని కృష్ణరావు తాత్పర్యం విలువ అంటె ఏ వస్తువులో నయినా మన మెప్పుకి పాత్రమైన గుణం జీవితపు విలువలనేకం వాటిని ఆర్థిక, నైతిక, సామాజిక, తాత్విక విలువలుగా వర్గీకరించవచ్చు విలువలకి ఆధిక్యతా క్రమం ఉంటుంది తాత్విక విలువలు పై విలువలైతే ఆర్థిక విలువలు కిందివి సామాజిక నైతిక విలువలది మధ్యస్థానం భారతీయ సంస్కృతి తాత్విక విలువల్ని జీవిత ధ్యేయాలుగా ఆదరించి జీవితావశ్యకాలైన ఆర్థిక విలువల్ని విస్మరించింది ఇది దారిద్ర్యానికి దారితీసిందనే అభియోగం ఉంది ఇది కృష్ణరావుని కలవరం పెట్టింది డిగ్రీ పుచ్చుకొన్నతరువాత నిరుద్యోగం కర్కశ నిజమై చీకాకు పరచింది వ్యాసుడు గుండెల్లోంచి పైకి వచ్చి శాపజలం అందుకొన్న దృశ్యం [illegible] ''భిక్షాపాత్ర'' నాటిక ఆవిర్భవించింది అది ఆకలి పోలికేక మార్క్సిస్టు దృక్పథంతొ ఆర్థిక విలువల్ని హైలైట్ చేసిన రచన కృష్ణరావు నిజ జీవితంలో విలువల్ని అపారంగా గౌరవించారు నమ్మిన విలువల కొసం ఉద్యోగాల్ని తృణప్రాయంగా చూశారు కృష్ణరావు

దృష్టిలో విలువలన్నీ సమాదరణీయాలే వారి ''ఆదర్శ శిఖరాలు'' నాటికల సంపుటిలో నాటికలన్నీ విలువల దీప్తి రేఖలే ఈ సంపుటిలో మొదటిది ''భిక్షాపాత్ర'' చివరిది తాత్విక విలువల్ని ప్రతిపాదించే ''ఆదర్శ శిఖరాలు'' ఇది మహాశిల్పి జక్కణచార్యుల కద మద్యలో వన్ని ఇతర విలువల్ని ప్రతిపాదించేవి ఇవన్నీ వ్యక్తి ధర్మాన్ని ప్రబోదించే విలువల వెలుగులు ఆర్థిక, నైతిక, సామాజిక, తాత్విక విలువల సమాహారాన్ని అనుభూతిలోకి తెచ్చుకొని మానవ వ్యక్తి సంపూర్ణ సమగ్ర చరితార్ధత సంతరించుకోవాలని కృష్ణరావు ద్వని

''బొమ్మ ఏడ్చింది'' నాటకం మతానికి విలవలకి సంబందించిన కొన్ని మౌలిక దార్శనిః విషయాలను స్పృశిస్తుంది మతం అంతిమ విలువ అది కొంత వైయక్తికం, కొంత నైతికం నైతిక విలువలూ ఒక విదంగా సామాజికాలే అందువల్ల సామాజిక స్పర్శ ఉన్న మేరకు ప్రభుత్వం మతంతో ప్రమేయం కల్పించుకోవచ్చు ఆ పరిదిని దాటి రాజ్యం వాటి విలువలతో సంబందం పెట్టుకోరాదు ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో రాజు గౌతమీ పుత్రశాతకర్ణి హిందూ మతాను యాయి బౌద్ధుల్ని బాధిస్తాడు ఆర్య నాగార్జునల ఉపదేశం పెడచెవిని పెడతాడు నాగార్జునులకు దేశ బహిష్కరణ శిక్ష విదిస్తాడు ఈ అదర్మానికి బొమ్మ ఏడుస్తుంది ఈ బొమ్మ బౌద్ధుల ఆరాద్య దేవత షట్పారమితాదేవి ఓ పాత్ర ద్వారా ''ఆ బొమ్మ మానవుల మనస్సుల్లో మెదిలిన నాడె లోకకళ్యాణం'' అంటారు కృష్ణరావు ఇది ప్రస్తుత సమాజానికి అన్యాప దేశమైన కర్తవ్య బోద

కృష్ణరావు కొన్ని సాహిత్య వ్యాసాల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్ని, తాత్విక వ్యాసాల్నీ రచించారు వాటిలో వారి నిశిత మేదాశక్తి, సహేతుకత, అంతర్ దృష్టి అంతర్లీనంగా ద్యోతకమవుతుంది కృష్ణరావు శైలి తెలుగు నుడికారపు ఇంపుసొంపులకి పట్టు కొమ్మ

జీవితం నిరంతర స్రవంతి సమాజం నిత్య పరిణామ శీలం గలది వ్యక్తి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కలవాడు బావజీవి సంస్కృతి పరంపరా గతమైంది సాహిత్యం సౌందర్య సంబంది సౌందర్యం వస్తుగతం, హృదయ గతం కూడా ఇవన్నీ పరస్పర ఆశ్రితాలు కృ ష్ణరావు సాహిత్యం మానవసంబందాల్ని పరామర్శించి వాటిలోని అంతరార్దాన్ని వెలుగులోకి తెస్తూ, పాఠకుడిలో సహృద్యవస్థ కల్పిస్తుంది ఆనందమిస్తుంది ఆలోచన రేకెత్తిస్తుంది లోకకల్యాణ మార్గం సూచిస్తుండి ఇది సహృదయ హృదయైక పెద్యం

# నివేదనము

తత్త్వ శాస్త్రము చదువ దొరకొన్న క్రొత్తలలోనే నాగార్జునుని దర్శనముతో నాకుఁ బరిచయ మేర్పడినది, నాఁడా దర్శన మంతగా న న్నాకర్షింప లేదు, కాని యే డెనిమి దేండ్ల క్రిందట రష్యన్ విద్వాంసుఁడు షర్బట్స్కీ వ్రాసిన "ది కన్సెప్షన్ ఆఫ్ బుద్ధిస్ట్ నిర్వాణ" యను గ్రంథము గాకతాళీయముగాఁ జదువుట సంభవించెను. నాఁడాదిగా వివిధ గ్రంథాలయములకుఁ బోయి ప్రసన్న పదా సహితముగా మూల మాధ్యమక కారికలు, భవసంక్రాంతి సూత్రవృత్తి, మాధ్యమక వింశతి, చతుఃస్తవము, ప్రతీత్యసముత్పాదహృదయము, రత్నావళి, విగ్రహవ్యావర్తని వ్రాసికొని వచ్చి వాని నన్నిటిని ననువదించితిని. ఈ చేసిన శ్రమ మంతయుఁ జేయ నల్లే యయ్యెను. అనువాదము లన్నియు నపహృతము లయ్యెను. దీనితో నాగార్జునుని యజాతవాదము మఱియొక సారి యనుభవమునకు వచ్చినది.

ఈ సంఘటనమునకు మున్ను పత్రికలు మాధ్యమకవింశతిని, విగ్రహవ్యావర్తనీ పద్యములను బ్రకటించి యుండుటచే నివి రెండును మిగిలినవి. తిరిగి మూలకారుని వ్యాఖ్య ననువదించి విగ్రహవ్యావర్తనికి నా లఘుటీకను జోడించితిని, షర్బట్స్కీ కృతిని జదువకున్న చోఁ బ్రకృత గ్రంథము వెలువడి యుండెడిది గాదు కావున నీ ప్రాచార్యునకు సర్వధా కృతజ్ఞుఁడను.

విగ్రహవ్యావర్తని కారికాకృతి. కారికా రచనమునకు శ్రీకారము పెట్టినవాఁడు నాగార్జునుఁడు. అనువాదకుఁ డీవిషయము విస్మరింప నవకాశము లేదు, మూల మార్యలలో నున్నది. ఆర్యకుఁ దెనుఁగున సన్నిహితమగు పద్యము కందము. కాని దీనికి నియమములు మెండు. ఇందు శాస్త్రార్థ నిబంధన మంత సుకరము గాదు. కావున ననువాదము గీతము నాశ్రయించినది. రెండు మూఁడు చోట్ల నీ నియమము పరిత్యక్త మయ్యెను. ఇద్దానికి హేతువు పరిశీలకులకు సుబోధమే కాఁగలదు.

ఇంక ననువాదము వీ లైనంత వఱకు మూలమునందలి పదముల విడనాడ కుండుటయే లక్ష్యము. దీనిని బురస్కరించుకొని యయ్యై పట్టుల లఘుటీక వ్రాయవలసి వచ్చినది.

విగ్రహవ్యావర్తని ప్రాకరణిక గ్రంథము, మాధ్యమక దర్శనము, దానిపై వెలువడిన విమర్శనములు నెఱుంగని వారి కీ గ్రంథ మర్థ రహిత మగును. అట్లగుటచే మాధ్యమక వాద సంగ్రహము, ఆర్ష దార్శనిక విమర్శనములు ప్రస్తావితము లైనవి.

ఈ విధముగాఁ బ్రకృత గ్రంథ మవతరించినది. ఇద్దాని రచనమునకుఁ దోడ్పడిన గ్రంథము లాయా పట్టుల నుదాహృతములు. ఇంక నిందలి గుణావగుణములకు నిర్లిప్తు లగు పండితులు ప్రమాణము.

విగ్రహవ్యావర్తనికిఁ బ్రరోచన యనుగ్రహించిన శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారికిని, ముద్రిత రూపము నిచ్చిన శ్రీ కొసరాజు మాధవయ్య గారికిని, పాఠక దర్శన భాగ్యము గల్పించిన శ్రీ యం. చలపతిరావు గారికిని గృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

తెనాలి
24-11-58

జి. వి. కృష్ణరావు.

# ప్రరోచన

శ్రీ జి.వి. కృష్ణరావుగారు, తెనాలి.
మీ విగ్రహవ్యావర్తని చదివితిని - ఓహో!

ఎన్నో యేండ్లనుండి ఎన్నో లక్షలమంది నాగార్జున కొండ త్రవ్వుచునే యున్నారు; ఏహో తీయుచునే యున్నారు, మీరు నాగార్జున శైలము నొకచేతనే యెత్తి లోపలి విజ్ఞానమును పైకి తీసినారు.

పిదప, - గ్రంథమొక యెత్తు; అంకితమొక యెత్తు.

చిరివాడ,
5-11-58

వేలూరి శివరామ శాస్త్రి.

# అంకితము

## పండిత గోపదేవ్‌గారికి

మును పాక నాఁడు కొండొకవిబోధము విత్తితి నీ హృదంతర
మ్మున; నది కాలంకధర సముద్ధతి గర్జిలినన్ విషేగ్ర వ
ర్షణ మొనరించిన న్నిలిచి చల్లఁగ సారము సంగ్రహించి యీ
దినమున కిట్లు పొల్చినది దృష్టి మరల్చుము బోధివృక్షమై.

''అంతేవాసి మదీయుఁ డిప్పటికి నింతైనాఁడుగా!'' యంచు నీ
స్వాంతంబందునఁ బొంగిపోయెదవో? ''ఛీ! చార్వాక హేవాకినీ
సంతా నాంతర చారణుం డితఁడు సంశాసింప దుర్దాంత వే
దాంతుం డైనను నెవ్వఁ డోపఁ'' డని చింతా క్రాంతిఁ దాపింతువో?

తెలియును గొంచె మేని గురు దేవుల చిత్తము; చిత్త శుద్ధితోఁ
దెలిపెద నొక్క మాట: నలుదిక్కులు నింపి తలంపుఁ గాగడా
వెలుఁగులు, గానిపించిన నవీన శివార్థము, భద్ర ముద్రణా
కలిత, మిదంత నార్ధన విఘాతము దెచ్చితిఁ గాన్క వెట్టఁగన్.

''ఏరా, కారులు ప్రేలే దేమిటికి? మున్నీ వాద మేనాఁడో తూ
ర్పారం బట్టరొ యక్షపాద మునులున్, వాత్స్యాయనుల్, వార్తిక
ప్రారంభుల్, మఱి బాదరాయణులు, భాష్యార్థ ప్రణేతల్, త్రయీ
సారగ్రాహులు జైమినీయులు, మహా శైవాగము స్థాపకుల్.

‘‘ప్రాప్త ఘనాఘ వృష్టిని ఘోర వాదము నాస్తిక సిద్ధి చెప్పె నం
తప్తము భూత ధాత్రికి ఘనాఘన మియ్యది యందువే? మహా
గోప్తవు వస్తువున్, సుజన కోటి తపః ఫల సంభవుండ, వెం
కాప్తులు వేఱుగాఁ గలరె? యాగమముల్ మతి వ్యర్థ బోధముల్!’’

అనుచుం జివ్వున మీర లవ్వలి మొగంబై నిల్చి రూపంపు భా
వనలోనం గనుఁగొందు; తిచ్చ వడి లిప్త ల్గాన్పి మెల్లో గమిం
తు; నహో స్వప్న జగ ద్విలోకిత మహా దుష్టార్థ సంజాత కం
పన మాత్రం బని నాకు నేనుగ సమాశ్వాసంబు ప్రాపించెదన్

వాద శంఖము నొత్తి వాత్స్యాయనుఁడు శూన్య
వాదమ్ము నేరీతి మూఁదివైచె?
యుక్తి వాగుర లొడ్డి యుద్యోతకారుండ
జాత వాదము నెట్లు జజ్జరించె?
చండ వాగ్దండంబు జళిపించి భట్టార
కుం డెట్లు శూన్యమ్ము కొమ్ము డులిచె?
గిరిలోన దుముక శంకించి శంకరుఁ డెట్లు
మాధ్యమకమ్ము సంభ్రాంతపఱిచె?

ప్రాప్త సర్వ సమగ్ర శాస్త్రార్థ రాశి
తాను గ్రహియింపఁ డేమి సత్యము వింత?
విశ్వ కల్యాణ విరచనా విహిత బుద్ధి
మూఢ వాద లోభమునఁ దా మునుఁగు నేమి?

ఏవం విధ సంభావన
గావింపఁగనైన హృదయకర్ణిక శాంతి
శ్రీ వాసించును; గ్రమ్మఱ
వ్యావర్తన మందు వార్త కాఁగన పోలెన్.

తాదృక్కల్ప వికల్పనా కలిత సంత్రా సోద్ధు రోషంబులన్
యోధారంభుల మూదలించి, విపు లోద్యోగంబుతో శాంతికిం
బాదు ల్వెట్టి, యధీత శాస్త్ర విధి, కామ్నా యోక్తి సంచారికిన్,
వేధో మూర్తికి విన్న వింతు నతి నై వృత్త్య న్ని జార్థుండ నై.

వ్యాసుల పేరు సెప్పి గురుపాదులుగా వినుతించి యున్న స
న్న్యాసులు భాష్య కారులు యథామతి తత్త్వముఁ జిత్ర చిత్ర వి
న్యాసము సేయరేమి? మహితాత్ములు వారికి శిష్యతా విని
ష్కాసన మాచరించె నొకొ సాత్యవ తేయుఁడు సన్మహాత్ముఁడై?

ఇది రమ్య, మిది యరమ్యం,
బిది ధర్మ్యం, బిది యధర్మ్య మిది యుచ్చం, బీ
యది నీచం బను తలఁపునఁ
బదరక గ్రహియించు లోక బాంధవుఁ దర్శిన్.

అది యటు లుండనిండు, భవ జార్తి విధూనన జీవ రోదన
ప్రదర విబోధితుల్ వర కృపాపరతంత్రులు నిత్య సత్య స
త్ప్రద హిత బుద్ధులై బుధులు వ్రాసిరి చూపిరి శాస్త్ర మర్మమున్;
సదయత వాని నెల్ల వెదఁజల్లిరి లోకములం గృతార్థులై.

తాదృశ శేముషీ ఘనుల ధన్యతముండు గలండు శూన్యతా
వాదన బోధ పుష్కలుఁడు, భ్రాంత జగ జ్జన జాల జీవన
శ్రీదుఁడు, తత్త్వ వి త్తరుణ శీత మయూఖుఁడు, భేద వాద ని
ర్భేదన భద్ర కుంజరుఁడు విస్మయ కారణ కార్య ధుర్యుఁడై.

మధ్యమ దర్శన గ్రథన ధూర్వహుఁడై ప్రథితుండు వాఁడు నా
గార్జున నామధేయుఁడు. ప్రకంపిత రూఢ విమూఢ శాస్త్ర చిం
తార్ణవుఁ, డాంధ్ర దేశ సుకృతార్జిత నిర్జర నిర్ఝరమ్ముః త
త్త్వజ్ఞ భర్జనల్ మెఱుఁగు పెట్టిపించ క్షుణ్ణి నాఁ డహామునిన్.

చెదరెన్ మూఢ విపక్ష పక్షములు, విచ్చెం జాత్యహంకార దు
ర్మద మోహమ్ములు, ప్రస్ఫెఁ బ్రాక్తన విచార ప్రక్రియా సేతువుల్,
ప్రిదిలెన్ శాశ్వత వాద బోధన మరాళీ స్వైర సంచార స
మ్మదముల్, భేదిలెఁ బూర్వ దర్శన సమామ్నాతార్థ హృత్ప్రోడముల్.

సత్యము మాపి చెప్పి భవ జాతము ప్రోవఁగఁ గొన్న వైదికా
దిత్యులు శోచ్యులై యుపవదించిరి గర్వపుఁ బిల్కలొత్తు పాం
డిత్యముతోడ నాస్తికపు డిండిమ భట్టని వాని; నాత్మ సా
హిత్యము అంత కోరి హరియించిరి తత్కృతి కర్మ భూమిలోన్.

తీవ్ర కిరణమౌఁ గాక యాదిత్య తేజ
మడరి హరియించు నేమి నీహార గిరుల?
పూజ్య తన్నాగ భాగమ్ము భోట భూమి;
అందు నిల్చె నాగార్జు నాహ్వాయుని కృతులు

అట్లధిగమించి నాకు సంప్రాప్త మైన
నానిలో నొక్క కృతి నాంధ్ర భాష వ్రాసి
నాఁడ నా బుద్ధి కెక్కు చందంబు నెఱపి
విశ్వ కల్యాణ పథము రూపించుకొఱకు.

ఈ విధమైన సచ్చరిత మీ కృతి; దీనిని స్వీకరింపఁగా
నీవె మహార్హణుండ; వది యెట్లన దర్శన షట్క మాంధ్ర భా
షా వినివృత్త మయ్యె విలసద్భవదీయ విరాగి శేముషీ
ప్రావృష లక్ష్మి; దేవ, కవి బాంధవ, దీనిఁ బరిగ్రహింపవే!

# ప్రస్తావన

అనిరోధం బయి, యప్రభావ మయి, యప్రాప్త ప్రణా శాసనా
తనమై, నైక బహుత్వ మై, యగమ మై, త్య క్తాగమం బై, యపే
క్షణ సంజాతము నై, ప దోషము మై జానొందు భద్రమ్ము జా
పిన సంబుద్ధునకున్ బ్రువాణ పతి కర్పింతున్ నమోవాకముల్.

–మూలమాధ్యమక కారికలు

వాఙ్మయమున కారమున కున్న స్థానమే భారత చరిత్రయం దాంధ్రులకున్నట్లు వేదు వెలువడుచున్న చరిత్ర గ్రంథములను బట్టి యనుమానింప వలసి వచ్చుచున్నది. కాని ప్రపంచ సంస్కృతికి, భారత తత్త్వశాస్త్రమునకు నాంధ్రులు చేసిన సేవ, యిచ్చిన దోహదము అనల్పము, అవిస్మరణీయము. ప్రపంచ సాహిత్య వనవాటిలో బృహత్కథా గాథాసప్తశతులు దివ్య పారిజాతములు. తత్త్వ క్షేత్రమున ఆర్య నాగార్జునుడు, ఆర్యదేవుడు, భావ వివేకుడు, దిఙ్నాగుడు, ధర్మకీర్తి విత్తి పెంచి ప్రోది సేసిన బోధి వృక్షముల యంట్లే ప్రవృద్ధము లైటిబెట్టు, మంగోలియా, చైనా, జపాను దేశములయందలి జిజ్ఞాసువులకు జ్ఞానమూలిక లను బ్రసాదించినవి. ఆర్ష దర్శనాభినివిష్టులకు వాత్స్యాయన భాష్యము, కుమారిలుని వార్తికములు సంసేవ్యములు. ఇట్లే సంస్కృతికి, విచార ధారకు దోడ్పడిన మహామహుల పేర్ల నెన్నేని గ్రుక్క ద్రిప్పుకొనకుండ జెప్పవచ్చును. కాని తమ జాతి కీర్తి ప్రతిష్ఠలను నిల బెట్టిన మహాపురుషుల పుస్తకముల నామముల నేని, సిద్ధాంతముల నేని, ప్రపంచ చరిత్రలో వాని కున్న స్థానము నేని యాంధ్రు లైనను గ్రహింపక పోవుట శోచనీయము.

ఆర్య నాగార్జునుని దర్శనమే యిందులకు దార్ష్టాంతము. ఆంధ్ర ప్రజానీకమునకు నాగార్జునుని కొండ యెక్కడ నున్నదో, అచట దొరకుచున్న శిధిలావశేషము లెట్టివో దెలియును. కాని యా ప్రాంతమునకు బ్రఖ్యాతి చేకూర్చిన మహాత్ముని చరిత్రము గాని, కృతులు గాని, యతని భావముల విలువకాని, త త్సిద్ధాంత ప్రబుద్ధ దేశ నామములు గాని, తత్సిద్ధాంత ప్రతిపాదిత నవ్య ప్రపంచ సమస్యా పరిష్కార హేవాక మార్గములు గాని యాంధ్రు లెఱుంగరు. ఎఱింగి యున్న చో నిప్పుడు నాగార్జున సాగరము పేరితో నిర్మింపబడుచున్న 'ప్రాజెక్టు' నకు నందికొండ ప్రాజెక్టను పేరు పెట్టవలయునను నూహ మేని వారికి బ్రారంభ దశలో గలిగియుండెడిది గాదు.

సంఖ్యకు భారత దేశమున దర్శనములు పెక్కులు వెలువడినను, యుక్తి సహము లగు నవి మూడు మాత్రమే. మొదటిది మాధ్యమక వాదము, రెండవది విజ్ఞాన వాదము, మూడవది యద్వైతము. మొదటి దర్శనమునకు ఆర్య నాగార్జునుడు నాందీ కారుడు కాకపోయినను ఆయనయే దానికి శాస్త్రీయ రూపము నిబంధించెను. ఆర్య దేవుడు, బుద్ధపాలితుడు, చంద్రకీర్తి, శాంతిదేవుడు దానిని విశదీకరించిరి. ఐరోపా ఖండమున కాంటు పరతత్త్వవాద మావిర్భవించి జర్మనీ దేశమును విచార ధారతో స్నిగ్ధము గావించి, వివిధ తాత్త్విక వాదముల మోసులెత్తించెను. దానివలనే మాధ్యమక

జి. వి. కృష్ణరావు

వాదమును భారతమున జిజ్ఞాసను రేకెత్తించి యనేక వాదములకు జీవము పోసినది స్వతంత్ర మాధ్యమక వాదము, విజ్ఞాన వాదము, మాధ్యమక యోగాచారము, సౌత్రాంతిక యోగాచారము, వద్వైతము మున్నుగా గల వాదము లన్నియు ప్రత్యక్షముగా మాధ్యమక వాదము నుండి యుత్పన్నములు గాకపోవచ్చును గాని దాని ప్రభావము లవ లేశ మేని వానిపై బడలే దని నిరాకరింప నవకాశము లేదు.

అంతే కాదు, నాగార్జునాచార్యుడు తన ప్రతిభా విశేషముతో సాపేక్షతా వాదమును క్రీ శ 1-వ శతాబ్దమందే తొలకరింప చేసి యిరువదవ శతాబ్దమందలి ఐన్‌స్టీన్ మహాశయుని వాదమును ముందుగానే యూహింపగలిగెను. ప్రపంచ మొక భావమని (Idea) ప్రతిపాదించిన హెగెల్ సిద్ధాంతమును సూక్ష్మముగా గాకున్నను స్థూలముగానైన నీ యాచార్యవరు డూహించి ఖండించెను.

రెండవ దగు విజ్ఞాన వాదమునకు దిఙ్నాగ ధర్మకీర్తులు సుస్థిర రూపము సమకూర్చిరి వీరి తర్క ధాటికి ప్రాచీన న్యాయము బీటలు వాఱి నవ్య రూపము సంతరించె నన్న, వీరి ప్రతిభా సంపద యెట్టిదో యూహించికొన వచ్చును.

ఈ రెండు దర్శనములను నెలకొల్పిన వారు మొత్తము మీద నాంధ్రులే. కాని వారి నీ వాడు సగర్వముగా సంస్మరించు నాంధ్రు లెందఱున్నారు ? నిక్కముగా వారి వాదములు తెలిసిన వారు గూడ సంఖ్యావిధేయులే. ఇట్టి దుఃస్థితి యెట్లు దాపరించినది ? భాష్యమునకు వివరణమో, భావానువాదమో వ్రాసిన ఆ యా వ్యక్తులు మా యాంధ్రులని సగర్వముగా జెప్పికొనుచున్నాము గాని, స్వతంత్ర సిద్ధాంతములలో ప్రపంచమునకు వెలుగు బాటలు చూపి జాతి వర్ణ భేదములతో నిమిత్తము లేని సామాజిక వ్యవస్థకై పాటుపడిన మహామహుల నామముల నైన స్మరింపలేక పోవుచున్నాము.

ఈ స్థితి యత్యంత శోచనీయము, ఏ జాతి యైన, ఏ దేశమైన తన ప్రాచీన చరిత్రను, సంస్కృతి వికాసము నెఱుంగక వర్తమానము నర్థము చేసికొనజాలదు కావున నాంధ్ర దేశ చరిత్రలో, భారత సంస్కృతీతి వృత్తములో, మానవతత్త్వాన్వేషణములో విస్మృతమైన యొక ఘట్టమిచట దిఙ్మాత్రముగా ప్రదర్శింపబడనున్నది. అది నాగార్జునుని మాధ్యమక వాదము. ఈ వాద గుణావగుణములు, సార తాసారతలు, ప్రాము ఖ్యాప్రాముఖ్యములు సింహావలోక నానంతరమే నిర్ణయింపదగినవి కాని, మున్నుగా జెప్పదగినవి కావు. మాధ్యమక వాద స్థాప నాచార్యుడు ఆర్య నాగార్జునుడు. ఈ యన జీవిత చరిత్రము తొలుదొలుత బరిశీలింప వలయును.

## జీవిత చరిత్ర

భారత దేశ చరిత్రలో మహాపురుషుల కృతులు దెలియ వచ్చినంత నిశ్చితముగా వారి జీవిత విశేషములు దెలియవు ఇందులకు గొలది యపవాదము లుండిన నుండవచ్చును. అంత మాత్రమున దీనిని బూర్తిగ ద్రోసిరా జనరాదు. మహాకవి కాళిదాసుని కృతులు సుపరిచితములు. కాని యతని జీవిత విశేషము లిప్పటి వఱకు దెలియవు. కాకున్న జరిత్ర కగ్రాహ్యములగు కట్టుకథలు, నభూత కల్పనలు ననేకము లుండ వచ్చును

---

2 నాగార్జునుని విగ్రహవ్యావర్తని

ఆర్య నాగార్జునుని చరిత్రము సిద్ధిదె కాని యీ చరిత్ర కథనము మఱి యొక మెట్టు పైకి బోయినది ''వాస్తవముగా నాగార్జున డను వ్యక్తి పుట్టలేదు. అది కేవల మొక కల్పిత నామ,'' మని వ్రాసిన వారున్నారు. కాని నాగార్జునుని కొండ యొద్ద బయల్పడిన పురా వస్తు సామగ్రిని బట్టి యతడు కల్పిత వ్యక్తి కాడని తేలిపోయినది.

ఇక నాగార్జునుడను వ్యక్తి యొక రా యనేకులా అను ప్రశ్న పొడమినది. కొంద ఱతడొకడే యనిరి. మఱి కొందఱు ఇద్ద ఱనిరి. వేఱొక కొందఱు ముగ్గురనిరి. ఇంక గొందఱు బుద్ధిమంతులు నాగార్జునుల సంఖ్య నైదింటి వఱకు బెంచిరి. మొత్తము మీద జెప్ప వలయు నన్న ఆచార్య నాగార్జునుడొక వ్యక్తి, సిద్ధ నాగార్జునుడు వేఱొక వ్యక్తి. వీరిరువురు గాక యీ పేరితోనే తాంత్రికాచార్యులు మఱొక రున్నారని చరిత్రజ్ఞులు చెప్పుచున్నారు ఇచ్చట జిజ్ఞాసితవ్యుడు మాధ్యమిక దర్శన ప్రవర్తకు డైన యార్య నాగార్జునుడే. ఇత డెప్పటి వాడో తేల్చికొనవలయును, కుమార జీవుడను నాతడు క్రీ.శ.405 ప్రాంతమున నాగార్జున చరిత్రమును చైనా భాషయందు బరివర్తించెను. కావున నీ యాచార్యు డు క్రీ.శ.405 నకు ముందే జీవించియుండ వలయును.

కుమార జీవుడు రచించిన జీవిత చరిత్రమునుబట్టి యీ క్రింది విశేషములు దెలియవచ్చుచున్నవి :-

3

నాగార్జునుడు పుట్టుకచే బ్రాహ్మణుడు. దాక్షిణాత్యుడు. అతడనతి కాలములోనే నాలుగు వేదములు సకల శాస్త్రములు క్షుణ్ణముగా నెఱింగెను అణిమా ద్యష్ట సిద్ధులు సాధించెనట. వాని ప్రభావమున నతడదృశ్యుడై సంచరించెడివాడట ఆ సిద్ధుల మహిమచే నతడు ముగ్గురు మిత్రులతో గలిసి యంతర్ధానము బొంది రా జాంతఃపురమునకు రాక పోకలు సాగించు చుండెనట. ఇట్లుండ రాజ భటులొక నాడాతనిని మిత్ర సహితముగా పట్టుకొనిరట. ఈ గండము గడచి పిండము బయట బడిన బౌద్ధ భిక్షువు నయ్యెద నని యాతడు మ్రొక్కుకొనియెనట. రా జే కారణము వలననో యతని మిత్రుల ముగ్గుర మరితీయించి నాగార్జునుని మాత్రము వదలెనట.

తాను మ్రొక్కుకొనిన ట్లే యతడు బౌద్ధ భిక్షుత్వము స్వీకరించి తొంబది దినములలో త్రిపిటకములు చదివి వానితో దనివి సనక సూత్ర గ్రంథముల కొఱకన్వేషణమును సాగించెనట. తుదకు హిమాల యావాసి యగు నొక భిక్షువువలన మహాయానసూత్రములు, సర్పరా జగు నాగరాజ నామకునివలన వాని భాష్యము సంపాదించెనట. కృతదీక్షతో నతడు దక్షిణదేశమున బౌద్ధమత ప్రచారము సాగించుచు మూడు వందల సంవత్సరములు జీవించినట్లు కుమారజీవుడు వ్రాసియున్నాడు.

''అట్లుకాదు, అయ్యాచార్యులు 600 సంవత్సరములు జీవించిర'' ని భోట దేశస్థులు చెప్పుచున్నారు. సిద్ధవిద్యయందే కాక నాగార్జునునకు రసవిద్య, వైద్యశాస్త్రము, ఖగోళశాస్త్రము, రత్నశాస్త్రము మున్నైనవానిలో గూడ విశేష నైపుణ్యమున్నట్లు కుమారజీవుని రచనము దెల్పుచున్నది.

జి. వి. కృష్ణరావు

౨. పేర్కొనబడిన విషయములనుండి పుక్కిటిపురాణములను దిగవిడచినచో మిగులు విషయములు మిక్కిలి తక్కువ. నాగార్జునుడు దాక్షిణాత్యుడు. వివిధ శాస్త్ర పారంగతుడని మాత్రము తెలియవచ్చుచున్నది. వింటర్‌నిట్జ్ మొదలైనవా రతడు విదర్భవాసి యనియు, క్రీ.శ.2వ శతాబ్దపు యుత్తరార్ధమున నుండెననియు నంగీకరించుచున్నారు. శ్రీ పర్వతమునందీ యాచార్యుడు వసించెననియు, నాగార్జునకొండయొద్ద బౌద్ధ విశ్వవిద్యాలయమును, అమరావతి జీర్ణప్రాకారోద్ధారమును నిర్వహించెననియు, నాటి శాతవాహన చక్రవర్తి యతనికి మిత్రుడనియు, సుహృల్లేఖ నీ చక్రవర్తికే వ్రాసెననియు చరిత్రజ్ఞులు చెప్పుచున్నారు. సుహృల్లేఖ నా కాలమున నాబాలగోపాలము పరమ పవిత్రగ్రంథముగా పారాయణము చేయుచుండెడిదని చైనా యాత్రికుని వ్రాతవలన దెలియుచున్నది. ఈ పుస్తకమునకు మూలము మాత్రము లభించుట లేదు. టిబెట్టు చైనా భాషలయందలి యనువాదములు నేటికి నిలిచియున్నవి. ఈ యనువాదముల కాంగ్లానువాదములు ఇండియన్ యాంటిక్వెరీ 16వ సంపుటిలోను, పాళిటెక్స్టు సొసైటీ జర్నల్ (1886) లోను ప్రకటితము లయ్యెను.

నాగార్జునుడు దక్షిణాపథ మందలి వేదలివాసి యను విషయమును

దక్షిణాపథ వేదల్యాం భిక్షుః శ్రీమాన్ మహా యశాః
నాగాహ్వయః స నామ్నా తు సదస త్పక్ష దారకః

4

(పే. 280, శ్లో.165)

లన్న శ్లోకమున లంకావతారము స్పష్టముగా పేర్కొనుచున్నది. అతడు విదర్భవాసియే యగుచో నా విషయమీ శ్లోకము పేర్కొని యుండవలయును. అట్లు పేర్కొనుటకు ఛందమడ్డు పడదు. ఇంక నీ వేదలి యెక్కడ నున్నదో పరిశీలింప వలయును. చరిత్రజ్ఞులు తలచుచున్న ట్లిది విదర్భ ప్రాంతమునందలిదే యగుచో నాగార్జున కృతమైన రత్నావలియందలి వక్ష్యమాణ విషయములకు చారిత్రకులు సమాధానము చెప్పవలసియున్నది.

నాగార్జునుని కాలమున మహాయానము తీవ్ర నిందకు బాల్పడుచుండెను.*

నాటి పరిపాలకుడును మహాయాన ప్రతికూలుడుగా గోచరించుచున్నాడు. **

ఇట్టి సందర్భమున విదర్భ దేశమునుండి వచ్చిన వ్యక్తికి తెలుగు నడిగడ్డలో బౌద్ధ విశ్వవిద్యాలయమును స్థాపించుటకు, అమరావతికి ప్రాకారాదులు తిరిగి నిర్మించుటకు నెట్లు సాధ్యపడును ? ఎచటినుండియో వచ్చిన వ్యక్తి యంత పలుకుబడి, ప్రజా సహకారము సేకరించుట దుష్కరము గాదా? తత్త్వ శాస్త్ర నైపుణ్యమే యా మాత్రపు పలుకుబడిని సంపాదించె ననుట కవకాశము లేదు. విశేషించి మహాయాన మానాడు నలు మూలలనుండి నిందింపబడుచుండెను.

* అత్యౌదార్యాతిగాంభీర్యా ద్విషణ్ణై రకృతాత్మభిః
నింద్యతేఽద్య మహాయానం మోహాత్ స్వపర వైరిభిః (4-79)

** ధర్మాధికారా యే చాన్యే పూర్వ రాజ ప్రవర్తితాః
దేవ ద్రోణ్యాదయ స్తేఽపి ప్రవర్త్యంతాం యథాస్థితాః ॥ (4-18)

నాగార్జునుని విగ్రహవ్యావర్తని

కావున నాగార్జునుడు గుంటూరు కృష్ణా గోదావరి ప్రాంతముల వాడనుట కవకాశము గన్పించుచున్నది గాని, విదర్భవాసి యనుట కవకాశము గానిపించ కున్నది

శాస్త్ర రంగమున నాడు నాగార్జునునకు ప్రాతికూల్య ముండెను రాజు నాతనికి విముఖుడే కాని సుముఖుడు గాడు. మరి యతడెట్లు ప్రజానురాగము సంపాదింప గలిగెను ? ఏదో యొక తీరున నాతడు ప్రజలకు మిక్కిలిగా దోడ్పడి యుండవలయును. ఆ తోడ్పా టెట్టిది ? తత్త్వ నిరూపణము, ధర్మపన్నములు ప్రజల నంతగా నాకర్షించి యుండు నన వీలులేదు. కావున కుమారజీవుడు పేర్కొనిన నాగార్జునుల వైద్య శాస్త్ర పారంగతత్వము యధార్థము గావచ్చును. ఆ నైపుణ్యముతో నతడు ప్రజలకు సేవచేసి వారి యనురాగము బొంది బౌద్ధ విశ్వవిద్యాల యాదికము నిర్మించి యుండవచ్చును.

ఇంక నాగార్జునుని కాలము నిర్ణయింపవలసి యున్నది. సుహృల్లేఖ, రత్నావళి యనెడి కృతులు రెండును శాతవాహనరాజు నుద్దేశించియే వ్రాయబడిన వని చరిత్రకారులందఱు నంగీకరింతురు కాని యవి యే శాతవాహనరాజు నుద్దేశించి వ్రాయబడెనా యను ప్రశ్నమునకు సమాధాన మన్వేషింప వలసి యున్నది నాగార్జునుడు క్రీ.శ. 2–వ శతాబ్దమందుండెనని చెప్పువారు ఆ గ్రంథములు గౌతమీ పుత్రయజ్ఞశ్రీ నుద్దేశించి వ్రాయబడిన వందురు. కాని రత్నావలినిబట్టి నాటి రాజు మహాయానమునకు బ్రతికూలుడుగా గోచరించు చున్నాడు విశేషించి యా మతమం దాతనికి ద్వేషము గూడ గానిపించుచున్నది. కావుననే యతడు దేవద్రోణ్యా ద్యుత్సవముల నిషేధించెను. నాగార్జునులు రాజునకు హితము గఱపుచు "బుద్ధుల వచనము నెఱుగ సుఖము గాదు. కావున నుపేక్షనే నేకయాన త్రియా నోక్తమునుండి యాత్మను రక్షించుకొనునది. ఉపేక్ష పాపము గాదు. ద్వేషము వలన బాపము దక్క శుభము గలుగజాలదు. కావున నాత్మకాములు మహాయానమును ద్వేషింపజనదు," అని స్పష్టముగా జెప్పెను.★

యజ్ఞశ్రీకి మహాయానమందుద్వేష మున్నట్లు చరిత్ర చెప్పుట లేదు. దీనికి దోడు నాగార్జునుడు సూచనప్రాయముగా నిరసించిన కీర్తి కాముకత్వము గూడ నితనిలో నంతగా గనిపించుటలేదు. నాగార్జునుడు పేర్కొ –

–నిన లక్షణము లన్నియు గౌతమీపుత్ర శాతకర్ణియందే గోచరించు చున్నవి. అత "ఏక బ్రాహ్మణుడు," "ఏకాంకుశుడు," "ఏకశూరుడు," "త్రిసముద్ర తోయపీత వాహనుడు,"

---

★ "తథాగ తాభిసంధ్యోక్తా న్యసుఖం జ్ఞాతు మిత్యతః।
ఏకయాన త్రియానోక్తా దాత్మా రక్ష్య ఉపేక్షయా॥
ఉపేక్షయా హి నాపుణ్యం ద్వేషా త్పాపం కుతః శుభమ్।
మహాయానే యతో ద్వేషో నాత్య కామైః కృతోఽర్హతి॥" (4,88,89)

జి. వి. కృష్ణరావు

"విపరీత చాతుర్వర్ణ్య సంకరుడు" అని శాసనము పేర్కొనుచున్నది. ఇది యిట్లుండ నీ కాలము సమర్థించు విషయము మఱియొకటి యున్నది. 'దశ సాహస్రికా ప్రజ్ఞాపారమిత' క్రీ శ 148లో చైనా భాషయం దనువదింప బడినట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు. పారమితలకు ప్రాముఖ్యము, ప్రాచుర్యము నాగార్జునుని కృతులవలన నేర్పడినదే కాని యంతకుమున్నే యేర్పడెనని యూహింప నవకాశము లేదు. ప్రయాణ సౌకర్యములు నికృష్టముగా నున్న యా కాలమున నొక భారతమున ప్రసిద్ధినొంది యది చైనాకు ప్రాకి యా పుస్తకము పుస్తక మచట బరివర్తితము గావలయు నన్న నేబది యఱువది సంవత్సరము లేని పట్టును. కావున క్రీ.శ. 1 వ శతాబ్దిలో నాగార్జును డున్న మండవచ్చు ననుట నిరాధారము గాజాలదు. ఇదియే నిజమగుచో నప్పటి శాతవాహన చక్రవర్తి గౌతమీపుత్ర శాతకర్ణియే కాని యజ్ఞశ్రీ కాజాలడు.

ఈ పేర్కొనిన దానికంటె నిర్దిష్టముగా నాగార్జునుడీ సంవత్సరమున నుదయించి యీ సంవత్సరమున నస్తమించెనని యుపలభ్యమాన సామగ్రినిబట్టి తెలుప శక్యము గాదు.

ఇక నతని జీవిత విశేషములుగూడ నితః పూర్వోక్తములకంటె విశేషముగా జరిత్రవలన దెలియవచ్చుటలేదు, రత్నావళిని జాగరూకతతో బరిశీలించి నపుడు మాత్ర మీ క్రింది విషయము లూహింప వచ్చును. మహాయానము నాగార్జునునకు ముందే యున్నది గాని, యతడు క్రొత్తగ బ్రతిపాదించి ప్రచారించినది గాదు. ఏల యన, "నింద్యతే ఉద్య మహాయానం మోహాత్స్వపర వైరిభిః" యని యతడు స్పష్టముగా జెప్పుచున్నాడు. మహాయానము క్రొత్తగా వెలువడి నిందింపబడు చున్నచో నాత డంతగా బాధ పడవక్కఱ లేదు. క్రొత్తగా నుద్భవించిన దానిని -అందున నతిగంభీరముగా నున్నపుడు-- అపార్థము చేసికొనుట యస్వాభావికము గాజాలదు. అట్లు కాక యది ప్రాక్తనమై యపోఢ మయ్యెనేని నాగార్జునుని కటకటదపాటున కర్థమేర్పడగలదు. కావున నాయునకు బూర్వమే మహాయానము వెలసి యుండవలయును.

6

నాగార్జునుడు మహాయాన వాది. మహాయాన మా నాడు తీవ్ర విమర్శనమునకు బాల్పడుచుండెను. కావున బ్రతివాది ఖండనములనుండి తన వాదమును గాచుకొన వలసిన యావశ్యకత యాతని కేర్పడెను. దానివలన నతడు దన మేధా సంపత్తిని బ్రదర్శించి గ్రంథములు నిర్మింపవలసి వచ్చెను. అంతియ కాని యుబుసుపోకకై, జిజ్ఞాసా సమారాధనార్థమై యతడు గ్రంథకర్త కాలేదు. తన ప్రదర్శించిన యుక్తులతో సంతృప్తి నొందక మహాయానము పై దొట్రుముట్టి విమర్శనములు ప్రతిపక్షులు సాగింపగా విసివిన నాగార్జునుడు భీష్ముడై మాధ్యమిక దర్శనము "తీర్థిక పశుభయంకర ము" ని విదలించి వైచెను.

ధర్మమునకు దక్క మఱొక లౌకిక శక్తికిఁదల యొగ్గు స్వభావము నాగార్జునునకు లే దని రత్నావళి చాటు చున్నది. అం దీ యాచార్యు డిట్లు వ్రాయుచున్నాడు .- "రాజా ! సామాన్యన కే యప్రియ మగు హితము చెప్పి వినిపించుట కష్టము. మఱి రాజులకు జెప్పి వినిపించుట యెంత దుష్కరము ? అందునను నీ వతిథాముడవు. నేను కేవలము సద్భిక్షువును. అట్లయ్యు నేనొక్కఁడనే

---

నాగార్జునుని విగ్రహవ్యావర్తని

నీకు మిక్కిలి యప్రియ మైనను బథ్యము చెప్పెదను. నీ యందలి స్నేహము లోకమునందలి యనుకంపయు దీనికి గారణములు.'' ఇంతే కాదు; మఱి యొక యడుగు ముందునకు వైచి, ''మద్య సేవనము పరిత్యజింపుము. దానివలన లోకమునందు బరాభవము, కార్యహాని, ధన క్షయము సంభవించును. అది యకార్య కారణము నగు'' నని రాజ దోషము నొత్తి యతడు చికిత్స జేయ నుంకించెను.

నాగార్జునుడు విచార శీలుడే కాక పరైకాంత హితబుద్ధి యని రత్నావళి వ్యక్తము సేయుచున్నది. ''సత్యమన నవిసంవాదకము గాదు; సత్త్వ గుణోద్భూతమును గాదు పరైకాంత హితమే సత్య,'' మని యాయన ముక్తకంఠముతో నుద్ఘోషించెను. ఆ బుద్ధిని బురస్కరించుకొనియే వాడాతడు కారాగార సంస్కరణములను సూచించెను.

''దుష్టులను సత్పథములకు మరల్చుటయే రాజునకభిలషితవ్యము, అతడు ప్రతీకార బుద్ధితో, నధికార ప్రదర్శనాహంకారముతో శిక్ష విధింపరాదు. ''న్యాయ పురస్సరముగా దండ ప్రహా రాదులు దోషులకు విధింపబడినను నీవు కృపాళుడవై శిక్షింప వలయును. నిక్కముగా మహాత్ముల కృప కాస్పదు లైన వారు తీవ్రపాపులు, హింస్రులు గాకున్న మఱెవ్వరు? కారాబద్ధులలో శుష్కించువారిని బ్రత్యహముగాని పంచ రాత్రము గాని విడిపింపుచుండుము. కారాగార బద్ధులై యున్నంత కాలము వారి స్నానాన్న పానీయములకు, మందు ప్రసాదములకు, వస్త్రములకు, క్షురకర్మమునకు నలయు నదుపాయములు గల్పింపు,'' మని యతడు రాజునకు బోధించి తన కృపాళుత్వమును 
జరిత్ర ప్రసిద్ధము గావించుకొనియెను.

ప్రపంచ చరిత్రలో మొట్టమొదటిసారిగా శిక్షాస్మృతి నుండి మరణదండనమును బరిహరింపవలసినదని యార్య నాగార్జునుడు ప్రచారము గావించెను. మను స్మృతి పురాణేతిహాసములందిట్టి సూచన లేకపోలేదు. కాని యది బ్రాహ్మణులకు మాత్రమే పరిమితము గావింపబడవలయుననియవి చెప్పుచున్నవి. నాగార్జునుడట్లుకాక మరణదండన పరిహారణ ముత్సర్గము గావలయునని బోధించెను. ''లెస్సగాబరామర్శించి లోతుగా దెలిసికొని ప్రదుష్టులు, ఘటకులునైనను నరులను జంపక, పీడింపక రాజ్యమునుండి వెడలనడుపు,'' మని శాతవాహన చక్రవర్తి కీతడు ధర్మము వివరించెను.* ఆనాడతడు చాటిన సంస్కరణములను నేటికి నాచరింపలేకపోవుచున్నాము.

''అంధులు, వ్యాధిపీడితులు, వికలాంగులు, అనాథులు, బిచ్చగాండ్రు ననిఘృణితులై యపరిభూతులై సమముగా నన్నపానములు పొందునట్లు చేయవలయునని యతడు రాజ ధర్మమును ఘంటాపథముగా జాటెను. అర్థింపకున్నను, నన్యరాజ్యసంస్థులై యున్నను గోవిదులగు సత్పురుషుల కనురూప సత్కారములు నెఱపవలయునని యాతడు సూచించెను.**

---

★ నిర్ఘృణత్వ సముత్సృజ్య ప్రదుష్టాన్ ఘటకానపి।
అహత్వాఽపీడయిత్వా చ కురు నిర్విషయాన్ నరాన్ ॥ (రత్నా 4-37)

★★ అప్రార్థినా మపి సతాం ధార్మికాణామనుగ్రహాత్।
అన్యస్య రాష్ట్ర సంస్థానా మనురూపాన్ ప్రవర్తయ ॥ (రత్నా 4-21)

జి.వి.కృష్ణరావు

దీనినిబట్టి నేటి సోవెట్ ప్రజాస్వామికులవంటివారి నేర్పులుమలయునని యూనిష్ట యుండుహాంచెనని చెప్పవచ్చును.

మత విషయమున నిమ్మహాసీయుడు సాగించిన ప్రబోధ మాధునిక యుగమునకు శిరోధార్యము. "మత విషయమున సత్యము గ్రహించుట దుష్కరము గావున నుపేక్షవహించుట మేలు. ఉపేక్ష పాపముగాదు. ద్వేషము పాపము. ఈ ద్వేషమువలన శుభ ముత్పన్నము గాదు ఆత్మకాములైనవా రుపేక్షవేదవ యాత్మను రక్షించుకొనవలయు," నని నాగార్జునుడు శాతవాహనున కుపదేశించెను. దీనినిబట్టి చూడ మత ప్రసక్తి లేని పరిపాలనము నాడే యతడూహించి ప్రచారము చేసెనని నిర్ధరింపవచ్చును

నాగార్జునుని విశిష్టతను జాటు విశేషమువుతియొకటి యున్నది. నాగార్జునుని కాలమునుండి ఇనేటి వఱకును మాధ్యమకులను నాస్తికు లని గర్హించుట యాచారముగానున్నది ఇటీవల నొక యద్వైత పండితుడు ప్రాసంగికముగా మాధ్యమక వాదమును గూర్చి ముచ్చటించుచు, " మీరు నాస్తికుల రని మాధ్యమకులను దెగడినప్పుడు నాగార్జునుడు గాని చంద్రకీర్తిగాని దానిని నిరాకరింపలే," దని వ్రాసియున్నాడు. ఇది కేవలము సాహస మనక తప్పదు ఏలయన నాగార్జునుడు రత్నావలిలో నిట్లు ఖండితముగా వ్రాసియున్నాడు :-



లోభ వ్యాపాద నాస్తిక్య దృష్టీనాం పరివర్జనమ్।

ఏతే కర్మపధా శుక్లాః .. . ... .. ...॥ (1-9)

నాస్తికో దుర్గతిం యాతి, సుగతిం యాతి చాస్తికః।

యధా భూత పరిజ్ఞానా న్మోక్ష మద్వయ నిశ్రితః॥ (1-57)

వినాశయతి దుర్జ్ఞాతో ధర్మోఽయ మవిపశ్చితమ్।

నాస్తితా దృష్టి సమలే యస్మా దస్మి న్నిమజ్జతి॥ (2-19)

ఇట్లు నాస్తికతను బూర్ణముగా నిరసించుటయే కాక నాగార్జునుండీ సమస్య నామూలాగ్రము పరిశీలించి హేతువాదుల కెల్లరకు నంగీకార్య మగు నుత్త మోత్తమ పరిష్కారము సూచించెను. ఆ దేమన గర్మమునకు ఫలము గలుగదను వాడు నాస్తికుడు. ఫలము గలుగు నను వాడు ఆస్తికుడు

సమాసా న్నాస్తితా దృష్టిః ఫలం నా స్తీతి కర్మణః॥

అపు ణ్యాపాయికా చైషా మిధ్యా దృష్టి రితి స్మృతా॥

సమాసా దస్తితా దృష్టిః ఫలం చాస్తీతి కర్మణామ్॥

పుణ్యా సుగతి నిష్యందా సమ్య గ్దృష్టి రితిస్మృతా॥ (1-43,44)

వివిధ మతములకు సమన్వయము గుదిర్చి ద్వేషమును బరిహరింపవలయు నన్న నింత కంటె మేలైన మార్గ మేమున్నది? ఈ నిర్వచనము ప్రకారము చెప్పవలసి వచ్చిన నేటి కమ్యూనిస్టులు గూడ దాము నాస్తికుల మని చెప్పుకొనగలరా ?

---

నాగార్జునుని విగ్రహవ్యావర్తని

నాగార్జునుడు జ్ఞాన రూపుడు మాత్రమే కాక కార్యకారుడు శుష్క తర్కములు, క్రియా హీనోపదేశములు, మెట్ట వేదాంతములు, కుహనా తపః క్రియలు వారికి గిట్టవు కావుననే యు ష్మహనీయు డిట్లుద్ఘోషించి యున్నాడు - "కేవల శరీర తాపనమువలన ధర్మము గలుగదు. పరద్రోహ విరతియు పొడమదు. పరుల కనుగ్రహమును వాటిల్లదు. దాన శీల క్షమా స్పష్ట మగు సద్ధర్మ పథ మంగీకరింపక కాయక్లేశమంగీకరించి దండ కోత్పథములబట్టి పోవువాడు క్లేశ వ్యాలావ లీఢాంగు డగుచు ననంత జనిపాదపము ఘోరము నగు సంసా రాటవిని సుదీర్ఘము పొందుచున్నాడు "

శరీర తాపనా ద్ధర్మః కేవలా న్నాస్తి తేన హి॥
న పర ద్రోహ విరతి ర్న పరేషా మనుగ్రహః॥

దాన శీల క్షమా స్పష్ట యః స ధర్మ మహో పథం
అనాదృత్య వ్రజే త్కాయ క్లేశ గో దండ కోత్పథైః॥॥
స సంసా రాటవీం ఘోరా మనంత జని పాదపామ్
క్లేశ వ్యాలావలీఢాంగః సుదీర్ఘం ప్రతిపద్యతే॥॥

(రత. 1-11,12,13)

నాగార్జునునకు దత్త్వ శాస్త్రమునందు, సాంఘికోద్యమమునందు మాత్రమే కాక సంస్కృత వాఙ్మయమునందును విశిష్ట స్థాన మేర్పడుచున్నది. అతనికి పూర్వము శాస్త్ర గ్రంథములు సూత్రబద్ధములై ధారణ యోగ్యములుగా నుండెడివి. అర్థగ్రహణమునకు వాని భాష్యములు తోడ్పడు చుండెడివి కాని సూత్ర రచనలో శబ్దలాఘవ మున్నను, సుబోధకత్వము మృగ్యము, భాష్యములలో నర్థసుబోధకత్వమున్నను, ధారణా సౌలభ్యము లేదు. సూత్ర పద్ధతి యందలి శబ్ద లాఘవము ధారణా సౌలభ్యము, భాష్య పద్ధతియందలి యర్థ సుబోధకత్వము విపృతి నేకత్రితము గావించుటకు నాగార్జునుడు నూతన మార్గ మవలంబించి కారికా రచనమును దొలుదొల్త సంస్కృతమున ప్రవేశపెట్టెను. అతని తరువాతనే యందు కారికా రచనము బహుళ ప్రచారము పొందెను. సాంఖ్య కారికలు, గౌడపాదకారికలు మున్నగునవి నాగార్జునుని రచనములకు బిమ్మటనే వెలువడినవి. కావున కారికా రచనమందగ్రతాంబూలము నాగార్జునలదే. ఇంతే కాక కావ్య భేదములలో నొకటిగా ధ్వన్యాలో కాదులచే పేర్కొనబడిన పరికథకు గూడ శ్రీకారము చుట్టినవాడు నాగార్జును డేమో!

ఇట్లు వివిధ రంగములం దనల్ప కృషి గావించిన నాగార్జునుని కీర్తి దేశదేశముల ఆోళ్ళను రోకండ్లను బలికినది. స్వతంత్ర విచారశక్తి యున్న ప్రతిమేధావియు నాగార్జునుని కృతులను భూషించుటయో, దూషించుటయో కావించెనే కాని యౌదాసీన్యము వహింపలేదు. ఉపలభ్యమానములగు గ్రంథములనుబట్టి చూచిన నతని వాదమును భూషించిన వారికంటె దూషించినవారి సంఖ్య మెండు. ఒక విధముగానతడు వివిధ దేశములందు ప్రామాణికత్వము సంపాదించెను. ఇది మఱియొక విధముగా నతని కీర్తి కవరోధమే యయ్యెను. ఏల యన దమ కృతులకు ప్రామాణికత్వము సంపాదింపనెంచి పెక్కురు వాని కర్తృత్వము నాగార్జునున కాపాదించిరి.

జి. వి. కృష్ణరావు

రాసిరిన నాగార్జున కృతులను ఒరిసంవాదముగా నిర్ణయించుట కష్టము. చైనా త్రిపిటకములో నాగార్జున కృతములుగా నిరువది నాలుగు రచనలు పేర్కొనబడినవి

## నాగార్జునుని కృతులు

నాగార్జునుని ప్రధాన కృతు లాఅని బూస్టను పేర్కొని యున్నాడు (1) మూలమాధ్యమక కారికలు, (2) శూన్యతాసప్తతి, (3) యుక్తిషష్టిక, (4) విగ్రహవ్యావర్తని, (5) వైదల్య సూత్రము --- ప్రకరణము, (6) వ్యవహారసిద్ధి.

**మూలమాధ్యమక కారికలు :–** అద్వైతులకు బ్రహ్మ సూత్రము లెట్లో మాధ్యమకుల కీ కారిక లట్టివి. సంఖ్యలో 448గా నున్న యీ కారికలు 27 అధ్యాయములుగా విభజింపబడినవి ప్రతి అధ్యాయ మేదో యొకపదార్థమునో, వాదమునో పరీక్షించును. ఈ కారికా కృతికి నాగార్జునుడు, బుద్ధపాలితుడు, భావవివేకు డు, గుణమతి, స్థిరమతి, చంద్రకీర్తి, గుణశ్రీ యున్నగువారు సంస్కృతమున నెనిమిది వ్యాఖ్యానములు రచించిరి. నాగార్జున కృతమగు వ్యాఖ్య అకుతోభయ యనియు, భావవివేకుని వ్యాఖ్య ప్రజ్ఞాప్రదీప యనియు, చంద్రకీర్తి వ్యాఖ్య ప్రసన్న పదయనియు, దేవశర్మ వ్యాఖ్య శితాభ్యుదయ మనియు నభిఖ్యాతములు. చంద్రకీర్తి కృతమగు ప్రసన్నపద దక్క తక్కిన వ్యాఖ్యలు సంస్కృతభాషా రచితములు నష్టములుగా గానవచ్చుచున్నవి. వీనియొక్క భోట భాషాను వాదములు మాత్రము లభ్యములు. అకుతోభయ వ్యాఖ్య నాగార్జున కృత మగునాయని భోట దేశస్థులును శంకించుచున్నారు.

చంద్రకీర్తి కృత ప్రసన్నపదా సహితముగ మూల మాధ్యమక కారికల మొదటి ప్రకరణమును, నిరువది యైదవ ప్రకరణమును షర్బట్స్కీ యను రష్యను పండితుడు ఆంగ్లభాషయం దనువదించి యున్నాడు. అయిదవ ప్రకరణము నుండి పదునాలవ ప్రకరణము వఱకు షాయిర్ దీనిని జర్మను భాషయందు బరివర్తించెను.

రెండవదగు శూన్యతాసప్తతి డెబ్బదియా అనుష్టుప్పులతో గూడిన గ్రంధము. దీనికి నాగార్జునుడు చంద్రకీర్తి, పరహితుడు వ్యాఖ్యలు రచించిరి. భోటభాషానువాదములు దక్క మూలగ్రంధముగాని, మూలవ్యాఖ్యలు గాని నేడు లభింపకున్నవి. శూన్యతాసప్తతిలోని శ్లోకమొకటి ప్రసన్న పదలో నుదాహరింపబడినది.

యుక్తిషష్టిక యను మూడవ గ్రంధమున నఱువది యనుష్టుప్పు లున్నవి దీని మూలము నేడు లభించుట లేదు టిబెట్టు చైనా భాషలయందు గావింపబడిన యిద్దాని యనువాదములు మాత్రము నిలిచియున్నవి

నాలుగవది విగ్రహవ్యావర్తని నాగార్జునుడు దీనికి స్వయముగా వ్యాఖ్యానము రచించియున్నాడు. నష్టముగా ఎంచబడిన యీ గ్రంధమును సంపాదించి శ్రీయుతులు కె పి.జయస్వాల్, ఆర్.సాంకృత్యాయనులు బీహారు రీసెర్చి సొసైటీ జర్నలు 22వ సంపుటిలో

---

నాగార్జునుని విగ్రహవ్యావర్తని

ప్రకటించిరి. ఈ ప్రకటనమునకు మున్నె ప్రొఫెసరు టుచ్చి టిబెట్టు చైనా భాషలయందలి యనువాదముల నాధారము చేసికొని విగ్రహ వ్యావర్తనిని ఆంగ్లభాషయం దనువదించి ప్రాగ్దిజ్నాగ బౌద్ధతర్కగ్రంథ సంపుటియందు ప్రకటించియున్నాడు. మూలమాధ్యమక కారికా రచనానంతరమే నాగార్జునుడీ కృతిని వ్రాసెనని విగ్రహవ్యావర్తనీ వ్యాఖ్యయం దుటంకింపబడిన మాధ్యమక కారిక సూచించుచున్నది.

అయిదవ గ్రంథము వైదల్యసూత్రము--- ప్రకరణము. దీని భోట భాషానువాదముమాత్రమే నేడు లభించుచున్నది ఈ కృతియందు రచయిత తాను తర్కమును దిరస్కరించుచున్నాడను నీలాపనిందను బటాపంచలు గావించె నని తజ్ఞులు చెప్పుదురు.

నాగార్జునుని యాఱవ కృతి వ్యవహారసిద్ధి. ఇందుబారమార్థికముగా ననాత్మత్వము, సాంవృతికముగా వ్యావహారిక ప్రపంచము నుపపన్నములు గావింపబడినవి.

పైని పేర్కొనిన వానివే కాక నాగార్జునుడు మఱి కొన్ని కృతులను నిర్మించి యున్నాడు. వానిలో రత్నావళి యొకటి. దీని కర్తృత్వమునం దెట్టి శంకయు గలుగరాదు. ఏల యన దీనినుండి పెక్కు శ్లోకములను జంద్రకీర్తియు, ప్రజ్ఞాకరమతియునదను వ్యాఖ్యలయందతని పేరితో 11 నుదాహరించి యున్నారు. ప్రొఫెసర్ టుచ్చి యీ గ్రంథమునందలి ప్రథమ ద్వితీయ చతుర్థ పరిచ్ఛేదములను రాయల్ ఏషియాటిక్ జర్నల్ (1934-36) లో నాంగ్లానువాద సహితముగా ప్రకటించెను.

ఎనిమిదవది చతుఃస్తవము. ఇదియు నాగార్జునుని కృతియేయన నెట్టి సందియము లేదు. ఏల యన నిందలి శ్లోకములు గొన్ని ప్రసన్నపదయందు, బోధిచర్యావతార పంజికయందు నుదాహృతములు. ఇప్పటి వఱకు నీ గ్రంథమందలి నాలుగు స్తవములలో రెండు మాత్రమే లభించినవి. వీనిని ప్రొఫెసర్ టుచ్చి రాయల్ ఏషియాటిక్ జర్నల్ (1932)లో నాంగ్లానువాద సహితముగా ప్రకటించెను. ఆ సంవత్సరముననే కీ.శే ప్రభూభాయ్ పటేలు భోట భాషానువాదమును బురస్కరించుకొని యీ నాల్గుస్తవములను సంస్కృతీకరించి ఇండియన్ హిస్టారికల్ క్వార్టర్లీ 8వ సంపుటిలో (316-331, 689-705 పుటలందు) ప్రకటించెను.

తొమ్మిదవ దగు ప్రతీత్యసముత్పాదహృదయము ఏడార్యలు గలిగిన కృతి. ఆయా వ్యాఖ్యలం దుపలభ్యమానములగు రెండు మూడు శ్లోకములు దక్క దక్కినవి గానవచ్చుట లేదు టిబెట్టు చైనా భాషలయందలి యిద్దాని యనువాదములు మాత్రము లభించుచున్నవి శ్రీ శర్మ అయ్యాస్వామి పండితులు చైనా భాష నుండి దీనిని ఆంగ్లమునందనువదించి కె.వి రంగస్వామి అయ్యంగారి స్మారక సంచికలో ప్రకటించిరి. ప్రతీత్యసముత్పాదహృదయమునకు జంద్రకీర్తి,

యుక్తిషష్టికము వ్యాఖ్యలు రచించిరి

ప్రాచ్యోదాహృత గ్రంథములే కాక యుపాయ హృదయము, మహాయానవింశకము, అబుద్ధబోధకము, భవసంక్రాంతిసూత్రవృత్తి, ప్రజ్ఞాదండము, ధర్మసంగ్రహము అను రచనలు గూడ నాగార్జునుని కృతులుగా చెప్పబడినవి. చీనా టిబెట్టు భాషలయందు లభించుచున్న యనువాదముల బురస్కరించుకొని యాంగ్లానువాద సహితముగా మహాయానవింశకమును ఆచార్య విధుశేఖర భట్టాచార్యులుగారును, భవసంక్రాంతిసూత్రవృత్తిని యన్. అయ్యాస్వామి పండితులును సంస్కృతీకరించి ప్రకటించిరి. ఈ కడపటి గ్రంథము నాగార్జునకృతి కావచ్చును. ప్రజ్ఞాదండము నీతి బోధక గ్రంథము. అందు కేవల మాధ్యమక వాదార్థమేమియులేదు. కావున నిది నాగార్జునుని కృతియని నిశ్చితముగా జెప్పలేము భోట భాషానువాదము బురస్కరించుకొని డబ్ల్యు. యల్ కాంప్బెల్ దీనిని ఆంగ్లభాషయం దనువదించి ప్రకటించెను. ధర్మసంగ్రహము బౌద్ధ పారిభాషిక పదకోశము. ఇది మాక్స్ముల్లర్ సంపాదకత్వమున క్రీ శ.1885లో బ్రకటిత మయ్యెను. వీనివే కాక నాగార్జునుడు మహాప్రజాపారమితా శాస్త్రము, ద్వాదశభూమి విభాషా శాస్త్రము, ద్వాదశనికాయముఖశాస్త్రము, ఏకశ్లోక శాస్త్రము గూడ రచించె నని చైనా త్రిపిటకములు చెప్పుచున్నవి. ఈ గ్రంథములం దొకటియును, సంస్కృతభాషయందు లభించుటలేదు. చీనా భాషనుండి మహాప్రజ్ఞాపారమితా శాస్త్రమును ఫ్రెంచిభాషయం దనువదించి ప్రొఫెసర్ లామోట్ ఇంతవఱకు రెండు సంపుటములను వెలువరించెను ఏకశ్లోకశాస్త్రము ఒకచైనా భాషయందె లభించుచున్నది. దీని యాంగ్లానువాదము ఎడ్కిన్స్ వ్రాసిన చీనీస్ బుద్ధిజమ్ అను గ్రంథమునందు బ్రకటింపబడినది. దీనిని తిరిగి సంస్కృతీకరించి హెచ్ ఆర్. ఆర్. అయ్యంగారుమైసూరు యూనివర్సిటీ జర్నల్(1922) ప్రథమ సంపుటి ద్వితీయ సంచికలో వెలువరించిరి.

ఇవి గాక రసరత్నాకరము మున్నెన వైద్య శాస్త్రాదిక గ్రంథములు నాగార్జునుని పేరితోగాన్పించుచున్నవి. వైద్య ముఖమున సేవ సేసి నాగార్జునుడు ప్రజానురాగము సంపాదించి యుండెనేని వీని కర్తృత్వముగూడ నాతనిదే యని భావింప నవకాశమేర్పడును. ఏది యెట్లున్నను వైద్య శాస్త్రజ్ఞులకు మాధ్యమక దర్శనముతోడను, మాధ్యమక దర్శనజ్ఞులకు వైద్య శాస్త్రముతోడను సాధారణముగా బరిచయము గలుగ కుండుటవలన రసరత్నాక రాదుల కర్తృత్వమింకను బరిశీలింప వలసి యున్నది

నాగార్జునుడు తన దార్శనిక గ్రంథములను రచింపకున్న నీ నాడాతని నంతగా చెప్పవలసిన యావశ్యకత లేదు ఆయన వైద్యగ్రంథములు వ్రాసి యుండవచ్చును. సాంఘిక రాజకీయాభివృద్ధికై పెక్కు భంగుల బాటుపడి యుండవచ్చును అయినను వానికి చారిత్రక ప్రాముఖ్యముదప్ప మఱొక వైశిష్ట్యము లేదు. ఏల యన నీ విషయములందాధునిక యుగ మభ్యుదయ మెంతయో సాధించియున్నది. వైద్యరంగమున నెన్నియో నూతన విషయములు వెలువడినవి. అతని రాజకీయ

నాగార్జునుని విగ్రహవ్యావర్తని

భావములు వాక్యమాత్రములుగాక, నేవి యొక్క సామాన్యములు కాక నీతని దార్శనిక భావము లట్టివిగావు విజ్ఞాన శాస్త్రములందు మనము మిక్కిలిగా ఉపయోగించి యుండవచ్చును ప్రాతకాపుగ్రహములను భూచంద్రుల మధ్య ప్రవేశము చేయింపవచ్చును. తేపు కుజగ్రహమునకు పోయి సేద్యము సేసి పంటతో తిరిగి రావచ్చును. నాడును నాగార్జునుని దార్శనిక భావము లాలోచనీయములే

ఇంతకు నాగార్జున దర్శన మేమి చెప్పుచున్నది ? అందలి విశిష్టత యేమి ?

ఈ ప్రశ్నములకు సమాధానము చెప్పుక మున్నొక విషయము గ్రహింపవలయును. అతని దర్శనము సుగమము గాదు. మీదుమిక్కిలి యపార్థము సేసికొనుటకు నవకాశములు మెండు. ఈ విషయమును నాగార్జునుడే యంగీకరించుచు మాధ్యమక వాద మతిగంభీర మనియు, నొక పట్టున బోధపడదనియు బేర్కొని యున్నాడు. దుర్భుక్తమైన యన్నము విషమై యెగ్గు కలిగించునట్లే, దుర్జ్ఞాతమగు మాధ్యమక వాదము ఘోర నీచస్థితి గలిగించునని యా యాచర్యుడే హెచ్చరించెను. ఇట్టి యవగాహన క్లేశ ముండుటవలననే వైదిక మతానుయాయులలో నాగార్జున వాద మర్థము సేసికొనిన మనీషులు దాదాపు మృగ్యులుగా నున్నారు. ఈ హేతువువలననే శతాబ్దులనుండి మాధ్యమకవాదము దూషణమునకు గుఱియగుచున్నది.



## మాధ్యమక వాదము

నాగార్జునుని వాదమునకు, మాధ్యమక వాదము, శూన్యవాదము, అద్వయ వాదము, ప్రతీత్య సముత్పాద వాదము, అజాతవాద మను నవి పర్యాయపదములు. కేవలము శబ్దమును బట్టి యీ వాదము నర్థము చేసికొనబూనిన నపోహములకు బాల్పడక తప్పదు. భారత దార్శనికుల నేకు లిట్టి యపోహములకు గుఱియై పెడత్రోవలు పట్టిరి.

నాగార్జునుని సిద్ధాంతము యుక్తిపై నాధార పడుచున్నదే కాని, యద్వైతాదులవలె శ్రుతిపై నాధార పడుట లేదు. మఱి యీ యుక్తి పరుల హృదయముల సంస్కరించి యొప్పించుటకొఱకు గాక యెవనికి వాడు తత్త్వము గ్రహింప నుద్దేశింపబడినది. మాధ్యమక మతమున యుక్తి యాధ్యాత్మిక మైన జిజ్ఞాస.

మానవుకు తన జీవితమునందు విభిన్నానుభవములను బొందుచుండును. ఇట్టి యనుభూయమా నావస్థలయం దొకప్పుడు వైరుధ్యము గోచరించును. ఆ వైరుధ్యము గోచరించినప్పుడే, యేది సత్య మను జిజ్ఞాస యతనియందంకురించును. ఈ యంకురము తల యెత్తనంత వఱకు నతనికి గసువిప్పు గలుగదు అప్పుడే యతడు విచారణమున కుపక్రమించును. "లట్లు చెప్పుకొన్న నిందులో నా చిక్కులున్నవి. ఇట్లు చెప్పుకొన్న నీ బాధ లున్నవి," యని

జి. వి. కృష్ణరావు

(ఞ) అసత్యాసగము మగు నసత్తునకు ప్రతిషేధమువలన సమము.

వెండియు మీరిట్లు పలికితిరి :-

ఉన్నదానికే ప్రతిషేధ మొప్పుచుండు
నిలయమున బాత్ర లేదని పలుకుచుందు;
మట్టులే స్వభావ మ్మున్న యపుడ కాన
బడును గాదె యర్థాని వ్యావర్తనమ్ము. 62

ఇక్కడ మేము చెప్పుచున్నాము.:-

ఉన్నదానికే ప్రతిషేధ మొప్పునేని,
భావ నిఃస్వభావత్వ నివర్తనమ్ము
మీరు కడగి కావించుచున్నారు గాన
వెలగు శూన్యత్వ మప్రతిషిద్ధ మగుచు.

సత్తునకే ప్రతిషేధము గలిగి, యసత్తునకు గలుగదేని, సర్వభావ నిఃస్వభావత్వమును మీరు ప్రతిషేధించుచున్నారు. మీ మాటచే సర్వ భావ నిఃస్వభావత్వము నిజముగ బ్రతిషిద్ధము గాదు. మీరు సద్భావత్వమును బట్టి ప్రతిషేధించుచున్నారు. సర్వభావముల నిఃస్వభావత్వము గూడ ప్రతిషిద్ధము. కావున బ్రతిషిద్ధమగు నర్థము గూడ శూన్యమే.



## లఘు టీక

ఉన్న యర్థమునే నివారింప శక్యమగును గాని, లేని యర్థమును నివారింప శక్యము గాదని ప్రతిపక్షి దూషణము గావించుచున్నాడు. "ధర్మములు నిఃస్వభావము," అను నిషేధము ప్రతీత్య సముత్పన్నము. ప్రతీత్య సముత్పన్న మగుటవలన నది నిఃస్వభావము. నిఃస్వభావ మగుట వలన నది శూన్యము. ఇట్టి శూన్యమగు స్వభావ నిషేధమును బ్రతిపక్షి నిషేధించుచున్నాడు. నర్థము సత్పదార్థ మగుచో నతని నివారణము సిద్ధించును. కాని శూన్యమగునది సతాదార్థము గాదు. కావున భావ నిఃస్వభావత్వ మవ్యాహత మగుచున్నది.

మీరు వ్యావృత్తి చేయుచున్నారు శూన్య
భావ; మాశూన్యతయు నేని పరగబోదు;
ఉన్నదానికే ప్రతిషేధ మొప్పునెడి
తావకీన వాద మ్మిట్లు ధ్వంస మందు. 63

సర్వ భావములు, నిఃస్వభావములు. కావున శూన్యములు. ఆ శూన్యత్వమును గూడ మీరు ప్రతిషేధించుచున్నారు. ఆ శూన్యతయు లేదు కావున 'సత్తునకే ప్రతిషేధము గాని, యసత్తునకు గా', దను మీ ప్రతిజ్ఞ భగ్న మగుచున్నది.

మఱియు

కించి దర్థమేని ప్రతిషేధించుచుండ
లేదు; ప్రతిషేధ్య మర్థమే లేదు మాకు;
కావున బ్రతిషేధించుచున్నావు నీవ
టన్న యధిలయ మొండె విన్యస్త మయ్యె. 64

మేము అర్థము కొంచెమేని ప్రతిషేధించుచుంటి మేని, మీ వాదము యుక్త మగును. కాని మేము ఏ కించి దర్థమును బ్రతిషేధించుట లేదు. కావున బ్రతిషేధ్యమగు నర్థము గొంచెమేని లేదు. ఇట్లు సర్వభావములు – ప్రతిషేధ్యము ప్రతిషేధము – శూన్యము అగుచుండగా, ''ప్రతిషేధించు చున్నారు,'' అని యిచట మీరు సద్భూతమగు దూషణము గావించుచున్నారు.

వెండియు మీరిట్లు పలికితిరి :–

''ధర్మముల్ నిఃస్వభావత దనరు నేని,
యేది మీ మాటచే బ్రతిషేధ మందు ?
దర్మముల్ ప్రతిషేధ్యముల్ దనరు నేని,
యని యనద్వాక్కున బ్రతిషేధ్యమ్మ లగును.''

ఇక్కడ మేము చెప్పుచున్నాము :–

పరగబోని మీదు వాక్కు చే బ్రతిషేధ
వచన సిద్ధియంచు బలికివారు;
ఇచట లేనిదనుచు నెఱిగించునే కాని
వాక్కు దాని భంగపఱుపబోదు. 65

''వాక్కు అసత్తైనను, ప్రతిషేధము ప్రసిద్ధి పొందుచున్నది. 'సర్వభావములు నిఃస్వభావములు,' అను వచన మేమి సేయుచున్నది?'' యని మీరు ప్రశ్నించుచున్నారు. కావున నవధరింపుడు :–

'సర్వభావములు నిఃస్వభావములు' అను నీ వాక్యము సర్వభావములను నిఃస్వభావముల గావించుటలేదు. నిఃస్వభావము అగు భావముల నిఃస్వభావత్వము నెఱిగించుచున్నది. దేవదత్తు డింటి యందు లేనపుడు ఒకడా యింటికేగి, ''దేవదత్తుడున్నాడా?'' యని యడిగె ననుకొనుడు. ''దేవదత్తుడింట లేడు,'' అని మఱియొకడు ప్రతివచనము చెప్పెననుకొనుడు. ఆ ప్రత్యుత్తరము దేవదత్తుని నింట లేకుండ జేయుట లేదు దేవదత్తుని సంభవము నుత్పాదించుటలేదు. దేవదత్తుడింటియందు లేకుండుటను మాత్రమే యది యెఱిగించుచున్నది 'లక్ష్మే భావము...

స్వభావము లేదు,' అను నీ వాక్యము వాచకమగుటకు నిస్స్వభావత్వము గలిగియుండుట లేదు
భావములయందలి స్వభావము యొక్క యభావమును మాత్రమె యెఱిగించుచున్నది

కావున, ''స్వభావము లేని దగుచుండగా 'స్వభావము లేదు' అను మీ వచన మేమి చేయుచున్నది? ఈ వచనము లేకయే స్వభావాభావము ప్రసిద్ధి పొందుచున్నది,'' అని మీ చెప్పినది యుక్తము గాదు.

(౯) ప్రతీత్య సముత్పన్నత్వమువలన నిర్హేతుకతాదోషము పొడమదు

మీరిట్లు పలికితిరి :–

మూఢ మతి మృగతృష్ణి కాంబువులఁ గ్రాహ
మెట్లు ప్రతిషేధ్య మగుచున్న దట్లె నిస్స్వ
భావతా భాసమాన ధర్మావలోకి
త మ్మసత్యతత్త్వము నివర్తనము పొందు

అనుట యుక్తమ్ము గాదు; గ్రాహాదికములు
మూడు, ప్రతిషేధ మాదిగా బొలుచు త్రికము
కలిపి యాఱు ధర్మమ్ములు గ్రాలుచున్న
వనుచు నంగీకరించుటే యగును జుమ్ము

౧౬౮

గ్రాహ మది లేనిదగు నేని, గ్రాహ్య మట్లె
యల గ్రహీతయు లేని వాడగున యేని,
వాని తో పాటె ప్రతిషేధ భావ మాది
యైన త్రితయమ్ము లేనిదే యగును జుమ్ము.

ప్రతిషేధ ప్రతిషేధ్య
ప్రతిషేద్ధలు గల్గ రేని, భావము లెల్లన్
స్థితిమై సిద్ధించును; వా
ని తత్త్వ మీకైవడి బరినిష్ఠం బొందున్.

''మూఢ మతి మృగతృష్ణి కాంబువుల'' అనుదానికి మేము చెప్పుచున్నాము :–

త్వన్మరీచి కా దృష్టాంత దత్త విపుల
చర్చ ప్రయుక్తి మాలి; దృష్టాంత మద్ది

మెట్లు యుపపత్తి పొందునో యేది నిర్ణ

యంబొ వివరించు చున్నార మవధరింపు 66

మృగతృష్ణి కా దృష్టాంతమందు మీరు విపుల విచారణ గావించితిరి ఇపుడీ నిర్ణయము వినుడు ఆ దృష్టాంత మనుపపన్నమే యగుచున్నది పైగా మాయా పురుషు నట్లు సర్వ భావములు ని.స్స్వభావములు ఆ విద్యచే నభూత వస్తు మోహమువలన నారోపితములగు సస్వభావములందు స్వభావముయొక్క యభావమును మూఢులగు పురుషుల కెఱింగించు చున్నది (ప్రొఫెసరు టుచ్చి పాఠము ననుసరించి )

మఱియు

గ్రాహ మది స్వభావమ్ముచే గ్రాలు నేని,

యది ప్రతీత్య సముత్పన్న మగుట లేదు;

గ్రాహ మది ప్రతీత్య బవమై గ్రాలు నేని,

యద్ది నిజముగా శూన్యత యగును జుమ్ము 67

మృగతృష్ణికి యందు జలగ్రాహము స్వభావమువలన నగునేని, యది ప్రతీత్య సముత్పన్నము గాదు మృగతృష్ణను బొంది, విపరీతమగు దర్శనమును బొంది అయోనిశః మనసికారము నొంది ప్రతీత్య సముత్పన్నమగుచున్నది ప్రతీత్య సముత్పన్న మగుటవలన నది స్వభావ శూన్యమే యగును. దీనిని బూర్వమే చెప్పితిమి.



మఱియు

గ్రాహ మది స్వభావమ్ముచే గ్రాలు నేని,

యెవ్వ డెట్టు లద్దాని వారింప గలడు ?

శేష ధర్మాల నీ విధి చెల్లుచుండు;

గాన దోష మీ వాదాన గాన రాదు 68

మృగతృష్ణ యందు జల గ్రాహము స్వభావమువలన నగునేని, యెవడు దానిని నివర్తించును? స్వభావమును నివర్తింప శక్యము గాదు కదా ! అగ్ని కుష్ణత్వము, నీటికి ద్రవత్వము, ఆకాశమునకు నిరావరణత్వము స్వభావము ఈ స్వభావ నివర్తనము గానబడదు కావున గ్రాహ్యాము ( గ్రాహము) శూన్య స్వభావము. ఇట్లే శేషములైన పంచ గ్రాహ్య ప్రవృత్తులగు ధర్మములందును నీ క్రమము ప్రత్యవగంతవ్యము

కావున, ''షడ్లక్షణ భావమువలన సర్వ భావము లశూన్యములు,'' అని మీ చెప్పినది యుక్తము గాదు.

కె. వి. కృష్ణారావు

వెంటనే యిట్లు చెప్పబడెను -

అట్లగుచో హేతు ప్రసిద్ధి యెటులు, నిస్స్వ
భావలను నేది హేతువై వరంగ గలదు?
హేతురహితమ్ముగా నర్థ మొనగునేని,
యర్థ మయ్యె దెట్లు ప్రసిద్ధి నంద గలదు ?

భావ నస్స్వభావత్వ నివర్తనమ్ము
హేతు హీనత సిద్ధి మీ కెనయు నేని,
భావ నస్స్వభావత్వమ్ము వఱలుచుంట
హేతు హీనత సిద్ధి మా కెనయు గలదు.

హేతువున కున్కి, భావ సంఘాతమునకు
నిస్స్వభావత్వ కరణమ్ము నిశ్చయించు
వాద మెట్లు గన్న నసువన్న మగును;
వర్తిలదు నిస్స్వభావ భావమ్ము జగతి.

128

ఇక్కడ మేము చెప్పుచున్నాము :-

హే త్వభావత సాధ్యసమత్వ మగుట
జేసి మున్నె ప్రత్యుక్త తాశ్లిష్ట మయ్యె;
త్వన్మరీచి దృష్టాంత నివర్తనంబు
నందు బూర్వమ్ము చెప్పిన దిం దెనంగు. 69

ఈ చర్చ చేతను, బూర్వోక్త చర్చచేతను హే త్వభావము గూడ బ్రత్యవగంతవ్య మగును. పూర్వపు హేతువునందును, షట్కో టివాద ప్రతిషేధమందును జేసిన చర్చ యిక్కడ గూడ జర్చయితవ్య మగును.

## లఘుటీక

•సర్వ భావములు నిఃస్వభావములు, నిఃస్వభావము లగుటవలన నని శూన్యములు ఇట్లగుచో హేతువును శూన్యమే యగుచున్నది. హేతువు లేనపుడు శూన్యతా వాద మెట్లు సిద్ధించుచున్నది?'' యను ప్రతిపక్షి దూషణమునకు సమాధానము చెప్పుచున్నారు -

నాగార్జునుని విగ్రహవ్యావర్తని

మా ప్రతిజ్ఞలో హేతువు లేదను ఆక్షేపణమునకు బూర్వోక్త చర్చయే ప్రత్యుత్తరమిచ్చుచున్నది. పూర్వము హేతు విషయమున చేసిన చర్చయు, షట్కోటి వాద ప్రతిషేధమున చేసిన చర్చయు ఇచట ననుస్మృతము చేసికొనవలయును (హేతు వున్నదనుటలో సాధ్యసమత్వ దోషమున్నది. హేతువు తనకు దాను సిద్ధించుటలేదు. పరమువలనను సిద్ధించుట లేదు అన్యహేతువుచేతను సిద్ధించుట లేదు అహేతుకము గాను సిద్ధించుటలేదు. హేతుమంతయు చేతను సిద్ధించుట లేదు.

IV ప్రతిషేధ ప్రతిషేద్యాభ్యుపగమము వలన నదోషము

మీరు వెండియు నిట్లంటరి :–

> ప్రథమమున బ్రతిషేధ మా పైని దాని
> విషయ ముండు నన్నమను, గాక వీని వ్యత్య
> యమ్ము చెప్పికొన్నను సిద్ధి యగుట లేదు;
> ఒక్క తఱి నున్న స్వాభావ్య మున్న దగును.

ఇక్కడ మేము చెప్పుచున్నాము :–

> మూడు కాలాల హేతువు మున్నె సాధ్య
> సమతజేసి ప్రత్యుక్తి విశ్రాంత మయ్యె;
> ఈ త్రికాల నివర్తక హేతువేని
> యల్ల శూన్యతావాదికే ప్రాప్త మగును. 70

త్రైకాల్యమునందు బ్రతిషేధవాచి యగు నీ హేతువునకు బ్రత్యుత్తరము చెప్పబడినది. ఎట్లు? సాధ్యసమ మగుటవలన. ప్రతిషేధము మూడుకాలములందు నుపపన్నము గానిచో బ్రతిషేధ ప్రతిషేధముగూడ నుపపన్నము గాదు. కావున "ప్రతిషేధము ప్రతిషేధ్యము లేనివగు చుండగా, బ్రతిషేధము ప్రతిషిద్ధ మగుచున్నది," యను మీ తలంపు యుక్తము గాదు. సర్వభావ స్వభావ ప్రతిషేధము చెప్పుచుండుటవలన శూన్యతావాదులకే త్రికాల ప్రతిషేధ వాచియగునీ హేతువు ప్రాప్త మగుచున్నది గాని, మీకు బ్రాప్త మగుటలేదు.

లేదా, యిది యిట్లు ప్రత్యుక్త మగుచున్నది :–

> "కించి దర్థ మేని ప్రతిషేధించుచుండ
> లేదు; ప్రతిషేధ్య మర్థమే లేదు మాకు,
> గావున బ్రతిషేధించుచున్నావు నీవ
> టన్న యదిలయ మొండె నిన్యస్త మయ్యె"

మీ రిట్లు తలంపవచ్చును. హేతువు పూర్వకాలీనముగాను, ఉత్తర కాలీనము గాను యుగప త్కాలీనము గాను, ఉండి మూడు కాలములందును దృష్ట మగుచున్నది. ఎట్లన, తండ్రి పుత్రునకు



జి. వి. కృష్ణరావు

బూర్వకాలీనుడు; శిష్యు డాచార్యునకు బశ్చాత్కాలీనుడు, ప్రదీపము ప్రకాశమునకు యుగప త్కాలీనము

ఇక్కడ జెప్పుచున్నాము – ఇది యిట్లు కాదు ఈ క్రమమునందు బూర్వోక్త దోషములు మూడు గలుగుచున్నవి

పైగా మీరు తలంచు నట్లే యగునేని, ప్రతిషేధ భావము మీచే నంగీకృత మగుచున్నది దీనివలన మీకు బ్రతిజ్ఞా హాని గలుగుచున్నది. మీదు మిక్కిలి స్వభావ ప్రతిషేధము గూడ సిద్ధ మగుచున్నది .

## లఘుటీక

'భూత భవిష్య ద్వర్తమానములందును నివారణమును దెలుపు హేతువు గలుగుట లేదు,' అనుదానికి (హేతు రాహిత్యమునకు) సమాధానము మున్నే చెప్పితిమి.

''ప్రతిషేధము మూడు కాలములందు సిద్ధింపదు,'' అను దూషణమున కాచార్యు లిపుడు ప్రత్యుత్తర మొసగుచున్నారు – అయ్యా! మా ప్రతిషేధమే సిద్ధింప దనుచున్నారు. మా ప్రతిషేధమే సిద్ధింపనపుడు మా ప్రతిషేధమును నివారించుచున్న మీ ప్రతిషేధము మాత్రమెట్లు సిద్ధించుచున్నది?

130 కావున మీ వాదము యుక్తము గాదు.

ఈ వాక్యముతో బ్రతిపక్షి దూషణము త్రోసివేయబడినదే కాని ప్రతిషేధ మెట్లు సిద్ధించుచున్నదో చెప్పబడ లేదు. కావున నిపుడాచార్యులు చెప్పుచున్నారు :–

మేము సర్వభావములు నిఃస్వభావములు అని చెప్పుచున్నాము ప్రతిషేధము గూడ నొక భావమే. కావున నిది నిఃస్వభావము. నిఃస్వభావమగుటవలన నిది శూన్యము ఈ యర్థమే 64వ పద్యమున నిట్లు వివరింపబడినది. ''కించి దర్థమును మేము నివారించుట లేదు. నివారింప దగిన యర్థమే మాకు లేదు. 'మీరు ప్రతిషేదించుచున్నారు' అను దూషణమును మాత్రమే మీరు మాయం దారోపించుచున్నారు.''

ఈ విధముగా మా ప్రతిషేధము సిద్ధించుచున్నది. ఈ సిద్ధి 'సర్వభావములు శూన్యములు,' అనువారి మతమున గలుగును గాని, భావములున్న వనువారి మతమున గలుగదు.

ఇట్లన్నప్పుడు ప్రతిపక్షి యిట్లు చెప్పవచ్చును. ''మా ప్రతిషేధము సిద్ధింపక పోవుట కలుగదు. హేతువు మూడు కాలములందును గానబడుచున్నది. హేతువు పూర్వ కాలీన మనుటకు దండ్రి గొడుకుల దృష్టాంతము చాలును. తండ్రి కొడుకునకు బూర్వకాలీనుడు. ఆచార్య శిష్యుల దృష్టాంతములో శిష్యుడు గురువునకు బశ్చాత్కాలీనుడు. ప్రదీప ప్రకాశ దృష్టాంతమున బ్రదీపమునకు బ్రకాశము సమకాలీనము.''

ఇట్లు చెప్పుచో వచ్చు దోషముల నాచార్యులు 50,51 పద్యములలోను, వాని వ్యాఖ్యానమందును, 35 నుండి 40 వరకు నున్న పద్యములలోను, వాని వ్యాఖ్యానమందును జర్చించి యున్నారు. అందు చెప్పిన దోషములు దీనికి గలుగుచున్నవి

దీనికి తోడు "సర్వభావములు శూన్యములు," అను మా ప్రతిషేధమును బ్రతిషేధించుచో మీరు ప్రతిషేధ భావమును నంగీకరించుచున్నారు. 'మాట లసత్తు' అను మాటను నివారించుటవలన నేమి కలుగుచున్నదో యదియే యిక్కడను గలుగుచున్నది. మీకు బ్రతిజ్ఞాభంగ మగుచున్నది. పైగా మేము చెప్పుచున్న స్వభావ ప్రతిషేధము గూడ సిద్ధమగుచున్నది.

ఎవని కీ శూన్యతోద్భవ మెసగుచుండు
వానికి నిఖి లార్థము లుద్భవమ్ము లగును;
ఎవని కీ శూన్య తోద్భవ మెసగ కుండు
వానికిం గించి దర్థ ముద్భవము గాదు. 71

ఈ శూన్యత కలుగువానికి లౌకిక లోకోత్తరము లగు సర్వార్థములు గలుగుచున్నవి. కారణ మేమి? శూన్యత గలుగువానికి బ్రతీత్య సముత్పాదము గలుగుచున్నది. ప్రతీత్య సముత్పాదము గలుగువానికి నార్యసత్యములు నాలుగు గలుగుచున్నవి. ఆర్యసత్యములు నాలుగు కలుగువానికి శ్రామణ్య ఫలములు గలుగుచున్నవి. సర్వవిశేషాధిగామములు నగుచున్నవి సర్వ విశేషాధిగమములు గలుగువానికి త్రిరత్నములు–బుద్ధ, ధర్మ, సంఘములు–గలుగుచున్నవి. ప్రతీత్య సముత్పాదము గలుగువానికి ధర్మము, ధర్మహేతువు, ధర్మఫలమును గలుగుచున్నవి; అధర్మము, అధర్మ హేతువు, అధర్మఫలమును గలుగుచున్నవి; క్లేశము, క్లేశసముదయము, క్లేశ వస్తువులును గలుగుచున్నవి. పూర్వోక్తమగు సర్వము గలుగువానికి సుగతి దుర్గతి వ్యవస్థలందు గతి దుర్గతి గమనము, సుగతి దుర్గతి గామియగు మార్గము, సుగతి దుర్గతి వ్యతిక్రమణము, సుగతి దుర్గతి వ్యతిక్రమోపాయము, లౌకికము లగు సర్వ సంవ్యవహారములు స్వయముగా నదిగంతవ్యము లగును. ఈ దిఙ్మాత్రమున గించి ద్వచన ముపదేశింప శక్యమగును.

సార శూన్యతయు బ్రతీత్య సంభవమ్ము
నైక వానార్థ తత్త్వమ్ము వ్యాకరించు
పూజ్య మధ్యమా ప్రతిపత్తు బోధ పఱిచి
నట్టి సంబుద్ధు వనుపము నాశ్రయింతు. 72



వి.వి.కృష్ణరావు

# విగ్రహవ్యావర్తనీ

## పూర్వపక్షః

1. సర్వేషాం భావానాం సర్వత్ర న విద్యతే స్వభావ శ్చేత్
త్వ ద్వచన మస్వభావం న నివర్తయితుం స్వభావ మలమ్.

2. అథ సస్వభావ మేత ద్వాక్యం పూర్వా హతా ప్రతిజ్ఞా తే
వైషమికత్వం తస్మిన్, విశేష హేతుశ్చ వక్తవ్యః.

3. మా శబ్దవ దిత్యేతత్ స్యాత్తే బుద్ధి ర్న చైత దుపపన్నమ్
శబ్దే నాత్ర సతా భవిష్యతో వారణం తస్య

4. ప్రతిషేధః ప్రతిషేధ్యే ఽప్యేవ మితి మతం భవేత్త దస ద్దేవ,
ఏవం తవ ప్రతిజ్ఞా లక్షణతో దూష్యతే న మమ.

5. ప్రత్యక్షేణ హి తావ ద్య ద్యుపలభ్య వినివర్తయసి భావాన్
తన్నాస్తి ప్రత్యక్షం భావా యే నోపలభ్యంతే



6. అనుమానం ప్రత్యుక్తం ప్రత్యక్షే ణాగమోపమానే
అనుమా నాగమ సాధ్యా యేర్థా దృష్టాంత సాధ్యాశ్చ

7. కుశలానాం ధర్మాణాం ధర్మావస్థావిదశ్చ మన్యంతే
కుశలం జనస్వభావం శేషే ష్వ ప్యేష వినియోగః

8. నైర్యాణిక స్వభావో ధర్మో నైర్యాణికాశ్చ యే తేషామ్
ధర్మావస్థోక్తానా మేవ చ నైర్యాణి కాదీనామ్

9. యది చ న భవేత్ స్వభావో ధర్మాణాం నిఃస్వభావ ఇత్యేవమ్
నామాపి భవే న్నైవం నామాపి నిర్వస్తుకం నాస్తి

10. అథ విద్యతే స్వభావః స చ ధర్మాణాం న విద్యతే తస్మాత్
ధర్మై ర్వినా స్వభావః స యస్య[1] తద్యుక్త ముపదేష్టుమ్.

11. సత ఏవ ప్రతిషేధో నాస్తి ఘటో గేహ ఇత్యయం యస్మాత్
దృష్టః ప్రతిషేధో ఽయం సతః స్వభావస్య తే తస్మాత్

[1] స యస్యాస్తి

12  అథ నాస్తి స్వభావః కిం ను ప్రతిషిధ్యతే త్వయా౽నేన
వచనేన ర్తే వచనా త్ప్రతిషేధః సిధ్యతే హ్యసతః

13. బాలానా మివ మిథ్యా మృగతృష్ణాయాం యథా జలగ్రాహః
ఏవం మిథ్యా గ్రాహః స్యాత్తే ప్రతిషేధ్యతో హ్యసతః.

14. న న్వేవం సత్యస్తి గ్రాహో గ్రాహ్యం చ తద్గృహీతం చ
ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధా చేతి షట్కం తత్.

15. అథ నైవాస్తి గ్రాహో న చ గ్రాహ్యం న చ గ్రహీతారః
ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధారో౽ప్యతు న సంతి.

16. ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధార శ్చ య ద్యుత న సంతి
సిద్ధాహి సర్వ భావా యేషా మేవం స్వభావ శ్చ.

17. హేతో స్తతో న సిద్ధిః నైః స్వాభావ్యా త్కుతో హి తే హేతుః
నిర్హేతుకస్య సిద్ధిర్న చోపపన్నాస్య తే ర్థస్య

18. యది చాహేతోః సిద్ధిః స్వభావ వినివర్తనస్య తే భవతి
స్వాభావ్య స్యాస్తిత్వం మమాపి నిర్హేతుకం సిద్ధమ్.

19. అథహేతో రస్తిత్వం భావ[1] నైఃస్వాభావ్యం నోపపన్నమ్
లోకే నైఃస్వాభావ్యా న్న హి కశ్చన విద్యతే భావః

20. పూర్వం చే త్ప్రతి షేధః పశ్చా త్ప్రతిషే ధ్య మిత్యనుపపన్నమ్
పశ్చా చ్చానుపపన్నో యుగపచ్చ యతః స్వభావో౽సన్.

## ఉత్తరపక్షః

21. హేతు ప్రత్యయ సామగ్ర్యాం పృథగ్భావే౽పి మద్వచో న యది
నను శూన్యత్వం సిద్ధం భావానా మస్వభావత్వాత్.

22. యశ్చ ప్రతీత్య భావో భావానాం శూన్యతేతి సా హ్యుక్తా
ప్రతీత్య యశ్చ భావో భవతీ హి త స్యాస్వభావత్వమ్.

[1]నైః స్వాభావ్యమిత్యనుపపన్నమ్.

23  నిర్మితకో నిర్మితకం మాయా పురుషః స్వ మాయయా సృష్టమ్
ప్రతిషేధయతే యద్వ త్ప్రతిషేధో ఽయం తదైవ స్యాత్

24.  న స్వాభావిక మేత ద్వాక్యం తస్మా న్న వాదహాని ర్మె
నాస్తి చ వైషమికత్వం విశేష హేతుశ్చ న వి గాద్యః.

25.  మా శబ్దవ దితి నాయం దృష్టాంతో య స్త్వయా సమారబ్ధః
శబ్దేన హ్యత్ర సతా భవిష్యతో వారణం తస్య.

26.  నైఃస్వాభావ్యానాం చే న్నైఃస్వాభావ్యేన వారణం యది హి
నైఃస్వాభావ్య నివృత్తౌ స్వాభావ్యం హి ప్రసిద్ధం స్యాత్

27.  అధవా నిర్మిత కాయాం యధా స్త్రియాం స్త్రీయ మిత్య సంగ్రా
నిర్మితకః ప్రతిహన్యా త్కస్యచి దేవం భవే దేతత్.

28.  అధవా సాధ్యసమో ఽయం హేతుర్న హి విద్యతే ధ్వనేః సత్తా
సంవ్యవహారం చ వయం నానభ్యుపగమ్య కధయామః

134

29.  యది కాచన ప్రతిజ్ఞా స్యా న్మే తత ఏవ మే భవే ద్దోషః
నాస్తిచ మమ ప్రతిజ్ఞా తస్మా న్నైవాస్తి మే దోషః.

30.  యది కించి దుపలభేయం ప్రవర్తయేయం నివర్తయేయం వా
ప్రత్యక్షాదిభి రర్థై స్తదభావా న్మే ఽనుపాలంభః.

31.  యది చ ప్రమాణతస్తే తేషాం తేషాం ప్రసిద్ధి రర్థానామ్
తేషాం పునఃప్రసిద్ధిం బ్రూహి కధం తే ప్రమాణానామ్.

32.  అన్యై ర్యది ప్రమాణైః ప్రమాణసిద్ధి ర్భవ త్యనవస్థా
నాదేః సిద్ధి స్తత్రాస్తి నైవ మధ్యస్య నాంతస్య.

33.  తేషా మధ ప్రమాణై ర్వినా ప్రసిద్ధిః విహీయతే వాదః
వైషమికత్వం తస్మిన్ విశేష హేతుశ్చ వక్తవ్యః.

34  ద్యోతయతి స్వాత్మానం యధా హుతాశః తధా పరాత్మానమ్
స్వపరాత్మానా వేవం ప్రసాధయంతి ప్రమాణానీ,

35 విపమోపన్యా సోఽయం న హ్యాత్మానం ప్రకాశయ త్యగ్నిః
న హి త స్యానుపలబ్ధిః దృష్టా తమ సీవ కుంభస్య

36. యది చ స్వాత్మాన మయం త్వద్వచ నేన ప్రకాశయ త్యగ్నిః
పర మివ న ల్వాత్మానం పరిధక్ష్య త్యపి హుతాశః

37. యది చ స్వపరాత్మానౌ త్వ ద్వచనేవ ప్రకాశయ త్యగ్నిః
ప్రచ్ఛాదయిష్యతి తమఃస్వపరాత్మానౌ హుతాశ ఇవ.

38. నాస్తి తమశ్చ జ్వాలావే యత్ర చ తిష్ఠతి తిష్ఠతి సదాత్మని జ్వలనః
కురుతే కథం ప్రకాశం సహి ప్రకాశోఽంధకారవధః.

39. ఉత్పద్యమాన ఏవ ప్రకాశయ త్యగ్ని రి త్యసద్వాదః
ఉత్పద్యమాన ఏవ ప్రాప్నోతి తమో నహి హుతాశః.



40. అప్రాపోఽపి జ్వలనో యది వా పునరంధకార ముపహన్యాత్
సర్వేషు లోకదాతుషు తమోఽయ మిహ సంస్థిత ఉపహన్యాత్.

41. యది చ స్వతః ప్రమాణసిద్ధి రనపేక్ష్య తే ప్రమేయాణి
భవతి ప్రమాణ సిద్ధిః న పరాపేక్షాత్మసిద్ధి రితి.

42. అనపేక్ష్య హి ప్రమేయా నర్థాన్ యది తే ప్రమాణసిద్ధి ర్భవతి
న భవంతి కస్యచి దేవ హీమాని ప్రమాణాని.

43. అథ మత మపేక్ష్య సిద్ధిః తేషా మిత్య[1] త్ర కో దోషః
సిద్ధస్య సాధనం స్యా న్నాసిద్ధోఽపేక్షతే హ్యన్యత్.

44. సిధ్యంతి హి ప్రమేయా ణ్యపేక్ష్య యది సర్వథా ప్రమాణాని
భవతి ప్రమేయసిద్ధి రనపే క్ష్యైవ భవతి ప్రమాణాని.

45. యది చ ప్రమేయసిద్ధి రనపే క్ష్యైవ భవతి ప్రమాణాని
కిం తే ప్రమాణసిద్ధ్యా తాని య దర్థం ప్రసిద్ధం తత్.

---

[1] మితి ఒభవతోకో దోషః

46 అథ తు ప్రమాణసిద్ధి ర్భవ త్యపేక్ష్యైవ తే ప్రమేయాణి
వ్యత్యయ ఏవం సతి తే ధ్రువం ప్రమాణ ప్రమేయాణామ్.

47. అథ తే ప్రమాణసిద్ధ్యా ప్రమేయసిద్ధిః, ప్రమేయసిద్ధ్యా చ
భవతి ప్రమాణసిద్ధిః, నాస్త్యుభయ స్యాపి తేసిద్ధిః

48. సిధ్యంతి హి ప్రమాణై ర్యది ప్రమేయాణి తాని తై రేవ
సాధ్యాని చ ప్రమేయై స్తాని కథం సాధయిష్యంతి?

49. సిద్ధ్యంతి చ ప్రమేయై ర్యది ప్రమాణాని తాని తై రేవ
సాధ్యాని చ ప్రమేయైః తాని కథం సాధయిష్యంతి?

50. పిత్రాయ ద్యుత్పాద్యః పుత్రో యది తేన చైవ పుత్రేణ
ఉత్పాద్యః స యది పితా వద త త్రోత్పాదయతి కఃకమ్.

51. కశ్చపితా, కః పుత్రః? [1]తత్రత్వం, బ్రూహి తా వుభావపి చ
పితా పుత్ర లక్ష్మధరా యతస్తతో నో౽త్ర సందేహః



52. నైవ స్వతః ప్రసిద్ధి ర్న [2]పరస్పర తో౽న్యప్రమాణై ర్వా
భవతి వ చ ప్రమేయైః [3]న చాప్య కస్మాత్ప్రమాణానామ్.

53. కుశలానాం ధర్మాణాం ధర్మావస్థావిదో బ్రువతే చ యత్
కుశల స్వభావ మేవం ప్రవిభాగే నాభిధేయః స్యాత్.

54. యదిచ ప్రతీత్య కుశలః స్వభావ ఉత్పద్యతే స కుశలా నాం
ధర్మాణాం పరభావః స్వభావ ఏవ కథం భవతి ?

55. అథ న ప్రతీత్య కించి త్స్వభావ ఉత్పద్యతే స కుశలానాం
ధర్మాణా మేవం స్యా ద్వాసో న బ్రహ్మచర్యస్య.

56. నాదర్మో ధర్మో వా సంవ్యవహారా శ్చ లౌకికా న స్యుః
నిత్యాశ్చ సర్వభావాః స్యుః నిత్యత్వా దహేతుమతః

---

[1]తత్రత్వం బ్రూహి కథం తా వుభా వపి చ పితాపుత్రౌ లక్షణధరౌ తతో నో౽త్ర సందేహః
[2]న పరస్పరతః ప్రమాణైర్వా. [3]న చాప్య కారణం భవతి.

57 ఏష చాకుశలే ష్వ్వాఖ్యాతేషు నైర్యాణాదిషు చ దోషః

తస్మా త్పూర్వం [illegible] తే భవ త్యేవమ్

58. యః సమ్ఖ్యాతం నామ బ్రూయాత్ సస్వభావ ఇ త్యేవం (స?)

భవతా ప్రతివక్తవ్యో, నామ బ్రూమశ్చ నయ వ సత్.

59. [1]నామాసదితి చ య దిదం తత్కిం ను సతో భవ త్యుతా సతః ?

యది హి సతో య ద్యసతో ద్విదాపి తే హీయతే వాదః

60. సర్వే షాం భావానాం శూన్యత్వం చోపపాదితం పూర్వమ్

స ఉపాలంభః [2]తస్మా ద్భవ త్యయం చాప్రతిజ్ఞాయాః

61. అధ విద్యతే స్వభావః స చ ధర్మాణాం న విద్యత ఇతి

ఇద మాశంకితం య దుక్తం భవ త్యనాశంకితం తచ్చ.

62. సత ఏవ ప్రతిషేధో యది శూన్యత్వం న్వప్రతిషిద్ధ మిదమ్

ప్రతిషేధయతే హి భవా భావానాం నిఃస్వభావత్వమ్.

63. ప్రతిషేధయ సేధ త్వం శూన్యత్వం తచ్చ నాస్తి శూన్యత్వమ్

ప్రతిషేధః సత ఇతి[3] తేన నేవం విహీయతే వాదః

64. ప్రతిషేధయామి నాహం కించి త్ప్రతిషేధ్య మస్తి న చ కించిత్

తస్మా త్ప్రతి షేధయ సీత్యధిలయ ఏవ త్వయా క్రియతే.

65. య చ్చాహం తే వచనా దసతః ప్రతిషేధవచనసిద్ధి రితి

అత్ర జ్ఞాపయతే వా గ సదితి తన్న ప్రతివిహంతి.

66. మృగతృష్ణా దృష్టాంతే యః పునరుక్త స్త్వయా మహాంశ్చర్చః

తత్రాపి నిర్ణయం శ్రుణు యధా స దృష్టాంత ఉపపన్నః

67 స యది స్వభావతః స్యా ద్గ్రాహో న స్యా త్ప్రతీత్య సంభూతః

యశ్చ ప్రతీత్య భవతి గ్రాహో నను శూన్యతా సైవ.

---

[1]నామాసది న [2]తస్మా త్ప్రతిజ్ఞాఽభావేఽ ప్యుపాలంభో యోఽస్తి. [3]ఇతి నను న హీయతే వాదః



జి. వి. కృష్ణరావు

68 యది చ స్వభావతః స్యాద్గ్రాహః తం నివర్తయే ద్గ్రాహమ్
శేషేష్వప్యేష విధిః [1]తస్మా ద్దోషోఽనుపాలంభః

69. ఏతేన హేత్వభావః ప్రత్యుక్తః పూర్వ [2]మేవ స సమత్వాత్
మృగతృష్ణా దృష్టాంత వ్యావృతి [3]విధాయ ఉక్తః ప్రాక్

70. యస్త్రైకాల్యే హేతుః ప్రత్యుక్తః పూర్వ మేవ స సమత్వాత్
త్రైకాల్య ప్రతిహేతుశ్చ శూన్యతా వాదినాం ప్రాప్తః

71. ప్రభవతి చ శూన్య తేయం యస్య ప్రభవంతి తస్య సర్వార్థాః
ప్రభవతి న తస్య కించి [4]న్నభవతి శూన్యతా యస్యేతి

72. యః శూన్యతాం ప్రతీత్య సముత్పాదం [5]మధ్యమా మనేకార్థామ్
నిజగాద ప్రణమామి తమప్రతియం సంబుద్ధ మితి



ఇతి శ్రీబోధిస త్త్వాచార్య నాగార్జున పాదానాం
విగ్రహవ్యావర్తనీ కారికా
సమాప్తా

---

[1]తస్మా దనుపాలంభః [2]సాధ్యసమత్వాత్ [3]సిద్ధా [4]కిన్న భవతి [5]మధ్యమా మనేకార్థమ్,
మధ్యమాం పద మేకార్థామ్

# పీఠిక

కళారంగంలో, ముఖ్యంగా సాహిత్యరంగంలో నేడు కనిపిస్తున్న తికమకలు, అవకతవకలు, లవ్యవస్థ మరేరంగంలోనూ కనిపించటంలేదు. ఇతర రంగాలలోకూడ అవ్యవస్థ లేకపోలేదు. కాని వాటిలో స్థితిగతులు ఇంత విషమంగా లేవు పరస్పర విరుద్ధాలైన పెక్కు వాదాలున్నాయి. అయినా వాటికి కొంతవ్యవస్థ ఉంది. భిన్న భిన్న విమర్శనలు, నిశిత నిశిత వివాదాలు ఉన్నా ఆ వాదాలను, పక్షాలను తేలికగా చెప్పుకోవచ్చును. అందలి మంచి చెడుగులు, సత్యాసత్యాలు అప్పటికప్పుడు కాకపోయినా కాలక్రమాన అయినా తెలిసి వస్తున్నాయి.

ఉదాహరణకు ధరల కంట్రోలు, రేషనింగు పద్ధతినే తీసుకోండి. కొంతమంది ధరలకంట్రోలు, రేషనింగు పద్ధతి ఎత్తివేయాలన్నారు. అలా ఎత్తివేసినప్పుడే అవినీతిపోయి ధరలు తగ్గి జనసామాన్యం సుఖంగా జీవిస్తుందని రాయిగ్రుద్ది చెప్పారు. మరి కొందరు ధరల కంట్రోలు, రేషనింగ్ పద్ధతి తీసివేస్తే ప్రబలమైన అనర్థం చుట్టుకొంటుందన్నారు. పేదసాదలకు, అంతంతమాత్రంగా ఉన్నవారికీ జీవితం దుర్భరమై పోతుందన్నారు. ఈ రెండు వాదాలలోని సత్యాసత్యాలు మామూలు ప్రజకు మొదట్లో తెలియకపోయినా తరువాత తరువాత తెలిసివచ్చాయి. ప్రజలకే కాదు, ప్రతిపక్షులకుకూడా సత్యం బోధపడక పోవటంలేదు.

140 C

ఇలాంటి స్థితి, వ్యవస్థ అయినా కళారంగంలో, ముఖ్యంగా సాహిత్యరంగంలో కనిపించటం లేదు. ఏ కథల సంపుటినో సమీక్షకోసం నాలుగు పత్రికలకు పంపితే పది అభిప్రాయాలు వెలువడుతున్నాయి. అందులో ఏ రెంటికీ పొత్తు ఉండదు. ఒక పత్రిక దాన్ని ఆకాశానికి ఎత్తితే, మరొకటి అథఃపాతాళానికి అణగద్రొక్కుతుంది.-మరొకటి దాని ప్రస్తావనే తలపెట్టదు. పోనీ రాజకీయాలలోవలెనే పుస్తకం మంచి చెడుగులు కాలక్రమాన వెల్లడి అవుతాయుందామా, అలాంటి దానికి ఏమాత్రం అవకాశం కనిపించటంలేదు.

అయితే ఈ ఘోర అవ్యవస్థకు కారణమేమిటి? చిత్తశుద్ధి లేదా? కాక అభిమానద్వేషాలు ప్రబలాయా? ఇలా ఆలోచిస్తే ప్రయోజనం లేదు. దీనివల్ల అసలు విమర్శకే తావులేకుండా పోతుంది. ఎందుకంటే, ప్రత్యర్థిచిత్తశుద్ధి శంకకు అస్పదమైతే, వారికిమాత్రం అలాంటిదోషం లేదని నిర్ధరించటానికి ఎలా వీలుపడుతుంది? కాబట్టి వ్యవస్థారాహిత్యానికి వేరే ప్రబల కారణం ఉండాలి.

కళలో, ముఖ్యంగా సాహిత్యంలో నేడున్న తికమకలకు, అవకతవకలకు, అవ్యవస్థకు కారణ మేమిటి?

ఈ ప్రశ్న ప్రజాస్వామ్యవాదులకు, కమ్యూనిష్టులకు కేవలకళావాదులకు అపోహ కలిగించకమానదు. ప్రజాస్వామ్యవాదులు ఇలా ప్రశ్నించవచ్చును:- కళలనుగూర్చి ప్రజలు తమకు తోచిన అభిప్రాయాలను, సిద్ధాంతాలను వెల్లడించుకోటానికి అవకాశంలేదా? ఒకేనాయకుడు, ఒకేజెండా, ఏకైక ఖండం అన్న నినాదాలు లేవనెత్తే ఫాసిస్టులకూ మీకూ తేడా యేమిటి? వ్యవస్థపేరుతో తమ తమ అభిప్రాయాలను వెల్లడించుకోరాదని ప్రజలను అనుశాసించటమే కదా!

కమ్యూనిష్టులు ఇలా ప్రశ్నించవచ్చును:- మానవుడు అనివార్యంగా ప్రవర్ధమానుడు అవుతాడని చరిత్ర ఉద్ఘోషిస్తున్నది. ఈ ప్రవర్ధమానత అనేది వర్గకలహంద్వారా సిద్ధిస్తుందని ఆచరిత్రే ముక్తకంఠంతో చెబుతున్నది. కాబట్టి ప్రపంచమందంతటా కమ్యూనిష్టు సామాజికవ్యవస్థ యేర్పడేటంతవరకు వర్గకలహం అనివార్యం. అభ్యుదయకాములంతా వర్గకలహం మాటుపరచక ప్రజలకు వివరించి

140 D

అభ్యుదయకరపాత్ర నిర్వహించే వర్గం పక్షాన పోరాడాలి. సాహిత్యంలో, కళలోకూడ అంతే. వర్గాలను పురస్కరించుకొని వాదభేదాలు బయలుదేరాయి. బయలుదేరుతున్నాయి. ఇలా బయలుదేరే వాదాలలో ఏవేవి యే యే వర్గాలకు చెందినవో బట్టబయలుచేసి అభ్యుదయకరపాత్ర నిర్వహించే వర్గంవారి వాదనను బలపరచాలి. కాబట్టి కళాభ్యుదయానికి వాదవైవిధ్యం, వాటి వివరణఖండనలు అవసరం. అంతేకాని సాహిత్యవ్యవస్థ పేరుతో వాదభేదాలను అణచివేయటం ఏ మాత్రం సమంజసం కాదు. పైగా అది విప్లవవిరోధి చేసేపని.

కేవలకళావాది ఇలా అనవచ్చును:- కళ అంటే ఒక విశిష్ట అనుభవం కలిగించేది. ఆ అనుభవ తత్త్వమేమిటి? దానికి అంశాలేవి? లక్షణాలు ఏవి? ఇలాంటి విచారానికి పూనుకొంటున్న క్షణంలోనే కళానుభూతి ప్రపంచంలోనుంచి జారిపోయి మరొక ప్రపంచంలో పడుతున్నాము. కాబట్టి ఇలాంటి విచారణవల్ల నిష్పన్నమయ్యే సిద్ధాంతం మరేమైనా అవుతుందేమో కాని కళాస్వరూప నిరూపకం మాత్రంకాదు, కాజాలదు. కళానుభూతి నిజంగా సహృదయ హృదయైకవేద్యం. అది అనిర్వచనీయం. వ్యవస్థకూ, కట్టుబాట్లకూ, కళకూ ఎక్కడా పొత్తులేదు. నిజానికి ఈ రెండూ ఆగర్భ శత్రువులు. కట్టుబాట్లలో కళా? అసంభవం.

---

జి.వి.కృష్ణరావు

పై మూడు ప్రతివాదాలకు సమాధానం చెప్పుకొనేది ముందు ఒక విషయం ఆలోచించాలి. ఏ వ్యవస్థ కావాలి అనటంలో విభిన్నవాదాలు ఉండవచ్చునని, అనేకుల్ని అభిప్రాయాలను వెల్లడించుకొనే వానికి అధికారం ఉండవలెనని ఈ సమయంలో అభిమతులంటారు. ఉంటేనూ. ప్రజలు స్వేచ్ఛగా, నిరాఘాటంగా ఈ అధికారం వినియోగించుకోవాలి. అలా చేయనివారు తమకు తామే ద్రోహం చేసుకొంటున్నారు. జీవితమే నిరర్థకం చేసుకొంటున్నారు. అయితే ప్రజలకున్న ఈ అధికారంతోపాటు బాధ్యతకూడా ఉన్నది. ఒకడు ఒక విషయాన్ని గూర్చి చెప్పేటప్పుడు అంతకుముందు ఆ విషయాన్ని గూర్చి ఇతరులు వెల్లడించిన అభిప్రాయాలను పరిశీలించి వుండాలి. పూర్వాభిప్రాయం సరిగా లేదనితోస్తే, ముందు దాన్ని ఖండించి తన అభిప్రాయాన్ని సహేతుకంగా నిరూపించుకోవాలి. అలాకాక పూర్వాభిప్రాయంలో అవ్యాప్తి, అతివ్యాప్తి దోషాలుంటే, వాటిని వివరించి సవరించాలి. అలాకాక పూర్వాభిప్రాయమే మంచిదని తోచి దానిని తిరిగి చెప్పటమే ముఖ్యమని భావించినప్పుడు, ఆ పూర్వాభిప్రాయాన్నే విపులీకరించి అందలి విశిష్టతను సుబోధకం చెయ్యాలి.

''అలాకాదు, నాకొక అభిప్రాయం తోచింది. దాన్ని వ్యక్తం చేసుకొనటానికి నాకు అధికారం వున్నదా, లేదా?'' అన్న ప్రశ్న రావచ్చును. ఈ ప్రశ్నకు జవాబు చెప్పేముందు రెండు ముక్కలు చెప్పాలి. మానవుడు గత చరిత్రతో సంబంధం లేకుండా, ఆకస్మికంగా, ఇతర సహాయం లేకుండా, స్వయంగా ఆలోచించ గలగటం అసంభవం. విస్పష్ట భావాలు కలగాలంటే భాష నేర్చుకొని వుండాలి. అలాంటి సంస్కారం లేకుండా అభిప్రాయాలు కలగటం అసంభవం. కేవలం చేతనకోటికి సహజమైన అవ్యక్తసంవేదనలు కలుగుతాయే కాని ఇతరులకు వెల్లడించటానికి వీలైన నిశ్చితాభిప్రాయాలు ఏర్పడవు. ఇందుకు సమాజంతో ఎలాంటి సంబంధం లేకుండా నిర్జనప్రదేశంలో పెరిగిన వ్యక్తి, శిశువు నిదర్శనం. కాగా వక్తవ్య అభిప్రాయాలు ఒకనికి కలగాలంటే, సమాజంలోని భూతవర్తమాన అభిప్రాయాలతో సంబంధం వుండితీరాలి.

ఒక వ్యక్తి పూర్వమున్న అభిప్రాయాలనే, ప్రజలకు చిరపరిచితమైన వాటినే తిరిగి ఏ కరువు పెడుతాడనుకోండి. దానివల్ల ఆ వ్యక్తికి కాని, సమాజానికి కాని కలిగే ప్రయోజన మేమిటి? అలాంటి చర్యలవల్ల గుడుగుడుగుంచాలు నాలుగుకంబాల ఆటలుతప్ప అభ్యుదయం ఎలా కలుగుతుంది?

కాబట్టి వ్యక్తి వెల్లడించే అభిప్రాయాలు విశేషార్థ బోధకాలు కావాలి



---

వేగంటు - స్వేచ్ఛ

విశేషప్రతిరోధం లేనిగానే ఏ వ్యవస్థ, ఏ నియమం వుండవుకాబట్టి వేరే చెప్పనక్కరలేదు ఇలా కాని పక్షంలో వ్యక్తి తన అభిప్రాయాలను తెలియజేయటానికేకాని, తద్వారా ఇతరోద్ధిష్టజ్ఞానం సంపాదించటానికి కాని అవకాశం వుండదు.

ఇలాంటి వ్యవస్థ కళాతత్త్వవిచారంలోకూడ వుండాలని ఈ రచయిత వుద్దేశం. అంతేకాని, పెక్కు సిద్ధాంతాలు వుండరాదనీ, కేవలం ఒకేసిద్ధాంతం వుండితీరాలనీ ఈ రచయిత అభిప్రాయం కాదు. కళారంగంలో, సాహిత్యాదిక్షేత్రాలలో ఎన్ని సిద్ధాంతాలైనా ప్రతిపాదించవచ్చును. అలా ప్రతిపాదించటానికి ప్రతి ఒక్కనికీ అధికారం వుంది. అయితే అలాంటి సిద్ధాంతానికి తలా తోకా వుండాలి, అందులో అంతర్వైరుధ్యాలు వుండగూడదు. పైగా ఆ సిద్ధాంతం నేలవిడిచి సాము చేయగూడదు. సిద్ధాంతం కోసం సిద్ధాంతం బయలుదేరక వున్న కళాసృష్టులకు అన్నిటికీ (Works of all arts) అన్వయించాలి. ఋగ్వేద కాలంనుంచి ఈనాటివరకు వివిధదేశాలలో, వివిధ జాతులలో జరిగిన సమస్త కళాసృష్టుల సౌందర్యాన్ని, లక్షణాలను, విశిష్టతావిశిష్టతలను, అర్థాలను (Values) వివరించగలగాలి. ఇక్కడ మరొక విషయం కూడా వుంది. కళ జీవితంలో ఒకభాగం, లేక ఒకవిధమైన జీవితం అవుతుంది. జీవితంలోని అన్ని అంశాలకు పరస్పర సంబంధం వుంది. కార్యకారణభావం లేకుండా శూన్యంనుంచి ఏదీరాదు. కాబట్టి జీవితంలోని అన్ని అంశాలు కార్యకారణ భావంతో అల్లిబిల్లిగా పెనవేసుకొని ఉంటాయి. అందువల్ల అన్ని అంశాలలోను అంతర్వ్యాపిగా, దండలో దారంవలె ఒక సామాన్య విషయం వుంటుంది. అంటే, జ్ఞానస్వరూపం సకలశాస్త్రాలకు, సకలకళలకు ఒకటే. కళాప్రతీతిలోని జ్ఞానస్వరూపం ఒక విధంగాను, శాస్త్రోపలబ్ధిలోని జ్ఞానస్వరూపం మరొకవిధంగాను వుండదు. కాబట్టి ఒక వ్యక్తి నూతన సాహిత్య సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నాడంటే, ఆ సిద్ధాంతంలో అంతర్భూతంగా వుంటున్న జ్ఞానస్వరూపం ఇతరశాస్త్రాలవల్ల వ్యక్తమౌతున్న జ్ఞానస్వరూపంతో సమన్వయం పొందాలి. అంతేకాని కేవలం దానికి పరకోటిగా, విరుద్ధంగా వుండటానికి వీలులేదు.



ఇలా వ్యాఘాతరాహిత్యం, సకలశాస్త్రవిహిత జ్ఞానస్వరూపం, అఖండత అన్నవి కళాసిద్ధాంతాలకే కాక అన్ని సిద్ధాంతాలకు అవసరం.

ఇక విమర్శకులు పేర్కొన్న వర్గ కలహం, కేవలకళావాది ప్రశ్న మిగిలి వున్నాయి. వర్గకలహంలో ప్రత్యేకతత్త్వవ్యాప్తి అంతర్వ్యాప్తమై ఉంది. అందువల్ల ఆ తత్త్వాన్ని వివరించి కాని సమాధానం చెప్పుకొన వీలులేదు. అదంతా ఈ రచయితే మరొకచోట వివరించటం వల్ల ఇక్కడ పేర్కొనటం లేదు. పోతే కేవల కళావాది ప్రశ్నకు సమాధానం చెప్పుకోవాలి.

---

జ వి.కృష్ణరావు

కేవలకళావాది చేసే వాదం మరొకసారి పరీక్షించుకుంటే, అందులో అంతర్యామియై వున్న సిద్ధాంతం బయటికి వెలిబుచ్చటానికి అవకాశం వుంది. ఎందుకంటే ప్రపంచంలో ఏదీ హేతువునకు అందదనీ, కేవలం ఏకతానతా మాత్రగ్రాహ్యమనీ, Intuition వల్లనే అర్థంచేసుకోటానికి వీలవుతుందనీ ఆ సిద్ధాంతానికి అంతరార్థం. ఈ అనుమానం నిరాధారం కాదు. కళానుభూతి సహృదయ హృదయైకవేద్యమని కేవల కళావాది అంటున్నాడు. మానవజీవితంలో, జగద్వ్యాప్తిలో ఈకళ కేవలం ఒకభాగం మాత్రమేనని ఒప్పుకోనక తప్పదు. ఎందుకంటే, జీవితంలో కళాసృష్టి, తదనుభూతిమాత్రమే కాక శాస్త్రాదికవ్యాపారంకూడ కనిపిస్తున్నది. ఈ విధంగా జీవితం, జగద్వ్యాప్తి వివిధ విశేష విశిష్టం. జీవితంతో పోల్చి చూస్తే కళ స్వల్పాతిస్వల్పమైనది కాకపోయినా, ఒకభాగం మాత్రమేనని స్పష్టం కాకమానదు. ఇలా ఏకదేశమైన కళ హేతుభిన్నము అతీతము అయినదై సహృదయ హృదయైకవేద్యమే అయితే ఏకదేశి అయిన జీవితం శాస్త్రవిచారానికి ఎలా అందుతుంది? కాబట్టి కేవలకళావాది ప్రతిపాదిస్తున్న అర్థాన్ని అనుసరిస్తే, జగత్తత్త్వం జీవితస్వరూపం హేతువునకు, శాస్త్రానికి అందేదికాదు. హృదయైకవేద్యమే. అది నిజమైతే శాస్త్రంద్వారా అర్థంచేసుకోటానికి, వున్న లోటు చక్కబరచుకొని అభ్యుదయం పొందటానికి వీలులేదు. అది అలావుంచి హృదయైక అనుభూతార్థం సత్యమో, అసత్యమో తెలుసుకోటానికి ఎలా వీలవుతుంది? మానవుడు క్రమక్రమంగా జ్ఞానం పెంపొందించుకొంటూ వస్తున్నట్లు చరిత్ర చెబుతున్నదికదా. ఏకతానతావాది ఇలాంటి చరిత్రను ఎలా త్రోసివేస్తాడు? ఇవన్నీ అలా వుంచుదాము. పరామర్శకు తావు లేకపోతే మానవునికీ, జంతువునకూ వ్యత్యాస మేమిటి? ఋగ్వేద కాలంనుంచి ఈనాటివరకు శాస్త్ర విచారం ఎందుకు చేస్తున్నాడు? ఇలాంటి విచారం నిరర్థకమైతే ఇలాంటి ప్రవృత్తి ఎలా సంభవిస్తున్నది?

ఈ ప్రశ్నలకు కేవల కళావాదినుంచి సంతృప్తికరమైన సమాధానం లేదుకనక ఆవాదాన్ని ఆదరించటానికి వీలులేదు.

ఇక మొదటి ప్రశ్న అలాగే వున్నది. నేడు కళాక్షేత్రంలో ఇన్ని అవకతవకలు, తికమకలు, అవ్యవస్థ ఎందుకు ప్రబలాయి? ఇలాంటిస్థితి తెలుగు దేశంలో వున్నంత విపరీతంగా పాశ్చాత్యదేశాలలో లేకపోయినా, అక్కడకూడా కొంతవరకు ఇలాంటి స్థితే కనిపిస్తున్నది. ఇటీవల అక్కడ బయలుదేరిన అలంకారికమతాలు చూస్తే, ఈ విషయం స్పష్టమౌతుంది. కాబట్టి ప్రపంచమంతటా మొత్తము మీద ఇలాంటి విషమస్థితే ఆవరించి వుంది.

ఇలా చెప్పినంతమాత్రాన మూలకారణం వివరించినట్లు కాదు. ఈలోటు ఎక్కడ వుందో పరిశీలించాలి.

వేమన - ప్లేటో

మనందరితో ఏదీ సామ్యంలేనిది లేదేమో. కారణం స్పష్టంగానే వుంది. ఇవాళ మన ఆచారాలు, సంస్థలు, వృత్తులు, జీవితం అన్నీ మార్పు చెందాయి, ఇంతకుముందు మనుష్య సంస్కృతి మొదలైనవి కొంతవరకు కారణాలు అంగీకరించక తప్పదు. తరువాత ముఖ్యకారణం నేటి సంస్కృతి, సంస్థలు, జీవితానుభవం మాత్రమే

కాగా నేటి అవ్యవస్థకున్న కారణాలను రెండు శాఖలుగా విభజించవచ్చును. - (1) పరంపరాగతాలు, (2) ప్రస్తుతజీవిత సిద్ధాంతాలు. పరంపరాగతాలను తిరిగి రెండు ఉపశాఖలుగా విభజించవచ్చును:- (1) తాత్త్వికాలు, (2) చరిత్రాత్మకాలు.

భారతీయషడ్దర్శనాలు భిన్నభిన్న దృక్పథాలను ప్రకటిస్తున్నా, కొన్ని ప్రధానాంశాలలో ఏకీభవిస్తున్నాయి. జ్ఞానం అనవచ్ఛిన్నం, పరిణామరహితమని అంటున్నాయి. ఈ భౌతిక ప్రపంచం అనిత్యమనీ, జీవులు తమతమ పూర్వజన్మకర్మ ఫలానుభవంకోసం పుడుతున్నాయనీ చెబుతున్నాయి. కాబట్టి మానవుని జీవితం, జగత్తు పరమార్థానికి సాధనాలే తప్ప స్వతః ప్రయోజనకారులు కావంటున్నాయి. అంటే అపవర్గ గమ్యస్థానానికి బయలుదేరిన జీవికి ఈ జగత్తు ఈ జీవితం మధ్యలో తటస్థపడే ధర్మశాలలవంటివి. వచ్చిపోతుండే యాత్రికులకు నిలువనీడ కల్పించటమే ధర్మశాలలకు ఎలా పరమార్థమో, ఈ జీవితజగత్తుల ప్రయోజనంకూడా అంతే. అంతకన్నా వీటిని గూర్చి విచారించవలసిన పనిలేదు. ఈ విషయాలను షడ్దర్శనాలు ముక్త కంఠంతో ఆమోదిస్తాయి.



ఇవి సిద్ధాంతాలైనప్పుడు కొన్ని విషయాలు అనివార్యంగా యేర్పడుతాయి. జ్ఞానం అనవచ్ఛిన్నమై, ఎదుగుబొదుగులులేక ఎల్లకాలం ఒకేవిధంగా వుంటున్నప్పుడు, దానిని ఎప్పుడో, యే ఒక్కడైనా తెలిసికొని వుండాలి. అంతేకాని కమక్రమంగా తెలిసికోవటం కాని, జ్ఞానం అభివృద్ధి చెందటంకాని అసంభవం. అందువల్ల ప్రాచీనతమమైన వాక్కే సత్యం చెప్పివుండాలనీ, క్రమికప్రవర్ధమానత అసంభమనీ సిద్ధిస్తున్నది. దీనితో సర్వజ్ఞానం వేదాలలో వున్నదనీ, ఆ వేదాలు అత్యంతప్రామాణికాలనీ, వాటి వెలుపల అంతకన్న అధికంగా జ్ఞానం వుండటానికి వీలులేదనీ తేలికగా నిష్పన్నమౌతుంది. ఇలాంటిదానితో చరిత్రాత్మకజ్ఞానం కుంటుపడక తప్పదు. అసలు దృష్టి అటువైపు పోవటానికికూడా వీలులేదు. ఈ విధంగా సునిశితబుద్ధులైన శాస్త్ర కారులకుకూడా ప్రాచీన తమ శాస్త్రగ్రంథాలు అనుల్లంఘనీయాలు, పరమ ప్రామాణికాలు, శిరసాపరిధార్యాలు అయి స్వతంత్రవివేచనకు, సత్యాన్వేషణకు అడ్డుతగిలాయి. స్వతంత్ర సిద్ధాంత ప్రవర్తకులైన మనీషులుకూడ తమ వాదాలను స్వోపజ్ఞములుగాకాక కేవలం ప్రాచీన గ్రంథార్థాలకు అనువాదాలుగా ప్రకటించుకొనటం జరిగింది. ఇందుకు బ్రహ్మసూత్రాలమీది విభిన్న భాష్యాలు, నాట్యశాస్త్రంపై వెలువడిన అభినవభారతి వ్యాఖ్య నిదర్శనాలు.

---

జె. వి. శ్యామరావు

జీవితము, జగత్తూ పరమార్థాలు కాక, కేవలం అపవర్గానికి సాధనాలుగా మాత్రమే స్వీకరించటంవల్ల ఈ జగజ్జీవితతత్త్వాలనుగూర్చి వుపేక్షించటం జరిగింది. వేదానికి పరమప్రామాణికులైన భారతీయదార్శనికు లెవరూ కళానుభూతినిగూర్చి వ్రాయలేదు. అసలు వాటి సంగతినికూడా వారు తడవలేదు. అభినవగుప్తుడు, రాజానకుడు, మధుసూదన సరస్వతివంటివారు తొమ్మిదవ శతాబ్ది తరువాతి వారుగాని, అంతకుముందున్న వారుకారు. పైగా ప్రాచీన భారతీయ సంప్రదాయానికి కట్టుబడివున్న ఈనాటి కళోపాసకులుకూడా కళకు స్వతంత్రసత్తాను అంగీకరించరు. తత్త్వార్థం వుత్తమోత్తమ మనీ, కళ దానికి న్యూనమైనదనీ ఈనాటికీ భావించటం జరుగుతున్నది. కళవల్ల బ్రహ్మాస్వాద సహోదరానుభూతి కలుగుతున్నదని చెబుతున్నారేకాని బ్రహ్మాస్వాదం కలుగుతున్నదని అనటంలేదు.

ఇలా జీవితమూ, జగత్తూ మరొకదానికి సాధనంగా భావించటంవల్ల కళాదుల తత్త్వ విచారం పాశ్చాత్య దేశాలలోకంటె వెనుక బయలుదేరింది. ఈ సందర్భంలో ''రసోవైసః'' అన్న శ్రుతిని పేర్కొనవచ్చును. ఈ శ్రుతిలోని రసశబ్దానికీ, అలంకారికులు చెప్పేరసానికీ సంబంధం లేదని రసగంగాధరకర్తకు వ్యతిరేకంగా నిర్ధరించటం జరిగింది. పోతే భరతుని నాట్యశాస్త్రం ప్రాచీనతమమైనది కాదా అని ప్రశ్నించవచ్చును. పైని పేర్కొన్న విషయాలను గమనించి నాట్యశాస్త్రాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే శైలినిబట్టీ, ప్రసక్త విషయాలనుబట్టి అది సూత్రయుగంలో వెలువడినది కాదనీ, పౌరాణిక యుగంలోనిదనీ స్పష్టం కాకమానదు.



షడ్దర్శనార్థాలు ఇలాంటి స్థితికి దారితీసినా, అలాకాదు. ఇలా వుండాలని అనుశాసించినా జీవితం, జగత్తు తన తన ధర్మాలనుబట్టి ప్రపంచిల్లింది. రామాయణం, భాగవతం, భాసకృతులు, గాధాసప్తశతి, బృహత్కథ, అశ్వఘోషుని కావ్యాలు, కాళిదాసాదుల మహాకావ్యాలు, మరొక ప్రక్క అజంతాచిత్రాలు బయలుదేరాయి. వాటితో కళాతత్త్వాను శీలనం ప్రారంభమయింది. దానితో అలంకారమతం తొలకరించింది. తరువాత క్రమక్రమంగా దార్శనికులు తమ తమ దర్శనాలను పురస్కరించుకొని కళాతత్త్వాన్ని, ముఖ్యంగా సాహిత్యతత్త్వాన్ని వివరిస్తూ ఆలంకారిక గ్రంథాలను వ్రాశారు. కాలక్రమాన సౌందర్యవిషయంలో షడ్దర్శన నిర్వచనాలు నిరాకృతాలై అద్వైతవాదులమతం సిద్ధాంతమైపోయింది. ఇలా బయలుదేరి పాతుకొనిపోయిన రసవాదం పరమప్రమాణమై సర్వసాహిత్య విశిష్టతావిశిష్టతలను నిర్ణయించసాగింది. రసవాదులు పేర్కొన్న ఏ ఒక నియమం వుల్లంఘించినా ఎలాంటి వుదాత్తకావ్యంకూడ తీవ్రఖండనకు పాల్పడింది. అలా ఖండించటానికి వీలులేకపోతే ఆ కావ్యాలను విరిచి ఎలాగో సూత్రార్థాలకు సరిపోయేట ట్లుగా అన్వయించటం జరుగుతూవచ్చింది. దీనికి శాకుంతలంలోని నాందీశ్లోకం, వుత్తరరామచరిత్రరసచర్చ మొదలైనవి నిదర్శనాలు.

---

జేగంటలు - ష్లేటో

ఇలా ఎంతసేపటికీ సాహిత్యతత్త్వం ఇలాంటిది కాబట్టి ఇలా వుండాలని ఊహించడం తప్ప, వున్న కావ్యాలు ఇలా వున్నాయి, కాబట్టి సాహిత్యతత్త్వం ఇలా వుండాలని ఆలంకారిక సిద్ధాంతాలను ఎప్పటికప్పుడు సవరించుకొనిపోవటం జరగలేదు.

పైగా అలంకారం, గుణం, రీతి, వృత్తి, వక్రోక్తి మొదలైన వాదాలు యే పద్యానికి ఆ పద్యం బాగోగులు కొంతవరకు ఎరాచి చెప్పగలిగినవేతప్ప మొత్తం మీద కావ్యం విశిష్టతావిశిష్టతలను నిర్ణయించి చెప్పగలిగిన స్థితిలోలేవు. లోచనవ్యాఖ్యాకర్త అయిన అభినవగుప్తుడుకూడా రసవంతంకాని రచన కావ్యం కాదని ధ్వని కర్తను అధిగమించి చెప్పగలిగాడేకాని ధ్వనికర్త పేర్కొన్న అలంకారధ్వని, వస్తుధ్వని ఎలా రసంగా పర్యవసిస్తాయో చెప్పలేదు. తరువాత వచ్చిన అలంకారికులైనా యీ విషయాన్ని అంతగా లోతుకు తరచి చూచినవారు లేరు.

నేటి సాహిత్యంలో ఖండకావ్యం, కథానిక, యేకాంకిక,-నవల ప్రధానం. వీటి మంచి చెడుగులు మొత్తంమీద చెప్పుకోవలసిందే తప్ప పద్యాలవారీగా కాని, పేరాలవారీగాకాని చెప్పుకోటానికి వీలులేదు. అందువల్ల ఈ నూతన కావ్యరూపాల విశిష్టతావిశిష్టతలను అలంకారికమతాలు స్వతః నిర్ణయించలేని స్థితి యేర్పడింది. దానితో వాటిపై విద్యావంతులకు గురితప్పి అలంకారికమతాలను పూర్తిగా వుల్లంఘించటం, విశృంఖలవృత్తి ప్రబలటం, అవ్యవస్థ నెలకొల్పటం జరిగింది.



### చరిత్రాత్మక కారణాలు

చరిత్రదృష్టితో చూస్తే 11వ శతాబ్దివరకు, అటుపిమ్మట కూడ నాటి విద్యావంతులకు దేశభాషలమీద ఏమాత్రం గౌరవముండేదికాదు. ప్రాంతీయ భాషలు వారికి అపభ్రంశాలుగా తోచేవి. అన్ని విషయాలూ యే సంస్కృతభాషలోనో వ్రాయవలెనేతప్ప వాటి ప్రకటనకు దేశభాషలు యేమాత్రం పనికిరావన్న అంధవిశ్వాసం వారికి వుండేది. దీనికి ఆంధ్రశబ్ద చింతామణిలోని "స్వస్థానవేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చావ్యదపహాయ," అన్న వాక్యం అధర్వణ కారికలలోని, "సమ్మూలవత్వాత్ రూఢత్వాత్ గృహీతత్వాచ్చ సాధుభిః, నాపభ్రంశత్వమేవ స్యాన్ని యమాభావ తస్తుతత్," అన్న కారిక సూచిస్తున్న అర్థం నిదర్శనం. పైగా నన్నయభట్టు వంటివాడుకూడ, "శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు," అన్న శ్లోకంతో తెలుగుభారతం ప్రారంభించటం, నన్నయ పూర్తిచేయని భాగం తిరిగి 16వ శతాబ్దిలో తిక్కన ఎత్తుకొనేటంతవరకు ఎవరూ అనువదించటానికి పూనుకొనక పోవటం, కవిబ్రహ్మకూడా హరిహరనాథుడు తనకు కలలో ప్రత్యక్షమై మిగిలిన భారతం పూర్తిచేయ వలసిందని ఆదేశించినట్లు చెప్పుకోవటం దీనికి దోహద మిస్తున్నవి.

---
జి.వి.కృష్ణరావు

భారత ఆంధ్రీకరణంతో పురాణేతిహాసాలు తెలుగులో వ్రాయటానికి మాత్రమే దారి ఏర్పడింది కాని, శాస్త్రవిషయాలేవీ అప్పటినుంచి ఇటీవలివరకు తెలుగుముఖం చూడలేదు. చివరికి ప్రామాణికాలైన తెలుగు వ్యాకరణ గ్రంథాలుకూడా 18 వ శతాబ్ది మధ్యవరకు ఎక్కువగా సంస్కృతభాషలోనే వ్రాయబడుతూ వచ్చాయి. ఇంతమాత్రం చేతనే అసలు శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలేవీ అణుమాత్రంకూడ తెలుగులో వ్రాయలేదని నా అభిప్రాయంకాదు. ఆంధ్రభాషాభూషణము మొదలైనవి వచ్చాయి. విన్నకోట పెద్దన, భట్టుమూర్తి మొదలైనవారు తెలుగువారికి అలంకార శాస్త్రంతో అత్యల్ప పరిచయం కలిగించారు. కాని కళాతత్వం, సౌందర్యలక్షణం ఒక్క తెలుగుమాత్రమే చదువుకొన్నవారికి ఈనాటికీ అపరిచిత విషయాలే. తత్త్వశాస్త్రాలలో ఒక అద్వైతగ్రంథాలు మాత్రం కొలదిగా తెలుగురూపం సంతరించాయి. ఇలా తెలుగులో ఇంత వరకూ వచ్చిన శాస్త్ర గ్రంథాలను చదివినంతమాత్రాన ఏ శాస్త్రంలోను గాఢపరిచయం లభించదు.

ఈ విధంగా కేవలం ఒక్క తెలుగు చదువుకొన్నవారి సంగతి ఈ నాటివరకు శోచనీయంగా ఉంది. బాగోగులను నిర్ణయించుకోవలసి వచ్చినప్పుడు ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు పోవటం జరుగుతున్నది. అందువల్ల కేవలం తెలుగుసాహిత్యంలో ఎలాంటి వ్యవస్థ లేదంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు.



ఇంతమాత్రంచేత శాస్త్రార్థవిచారశక్తి తెలుగు వారికి లేదనటానికి వీలులేదు. నేటికీ ఆయా రంగాలలో ప్రామాణికాలుగా భావింపబడుతున్న వేదభాష్యం, పంచదశి, రసగంగాధరం, పరిభాషేందు శేఖరం, తర్కసంగ్రహం మొదలైన ఉద్గ్రంథాలు వ్రాసినవారు ఆంధ్రులే. కాని తెలుగుభాషమాత్రం శాస్త్రార్థ ప్రకటనకు నోచుకోలేదు. దీనికి కారణం అఖిలభారత ప్రశంసాగౌరవాలను సంపాదించాలన్న అభిప్రాయమే ఆనాటి ఆంధ్రశాస్త్రవేత్తలను సంస్కృతభాషలో తమ గ్రంథాలను రచించటానికి ప్రోత్సహించింది. ఈనాడు శాస్త్రకారులు తమ తమ అభిప్రాయాలను అంతర్జాతీయ ప్రఖ్యాతికోసం ఆంగ్లంలో వ్రాస్తున్నట్లే వాడు మనవారు సంస్కృతంలో వ్రాశారు.

వాడు, నేడు కూడా మాతృభాష అనాదృతిపాలు కావటంవల్ల తెలుగుసాహిత్యంలో ఇంతటి ఘోర అవ్యవస్థ కనిపిస్తున్నది.

ఈనాడైనా ఈ అవ్యవస్థను తొలగించటానికి ప్రయత్నాలు చేయవచ్చునుగదా అన్న ప్రశ్న పాఠకునకు కలుగకపోదు. కాని యింతకుముందు పేర్కొన్న ప్రకృతజీవితసిద్ధాలైన కారణాలు అడ్డు తగులుతున్నాయి. ఇవి ఎలా అవరోధాలుగా ఉన్నవో పరిశీలించటం ముఖ్యం.

ప్రాచీనతపట్ల కారణాలనుకూడ ప్రధానంగా మూడు భాగాలు చేయవచ్చును:-
(1) సాంస్కృతికాలు, (2) సంస్థాసిద్ధాలు, (3) వర్తమాన జీవిత సిద్ధాలు.

## సాంస్కృతిక కారణాలు

18వ శతాబ్దిచివరనుంచి మన దేశంలో ఎన్నోమార్పులు వచ్చాయి. ముద్రణయంత్రాలు, రైళ్లు, స్టీమర్లు, తంతి, రేడియోలు, సినిమాలు, విమానాలు క్రమంగా వ్యాపించాయి. వీటివల్ల ప్రపంచంలోని వివిధభాగాలకు సన్నిహితసంబంధం ఏర్పడింది. వివిధదేశాల చరిత్రలు, సంస్కృతులు, సాహిత్యాలు, తత్త్వాలు, భావాలు, ఆదర్శాలు, సంప్రదాయాలు. మనదేశానికి కూడా ప్రాకాయి. వీటివల్ల కళలో, సాహిత్యంలో వచ్చిన మార్పులన్నీ యిన్నీకావు. సాహిత్యక్షేత్రంలో గ్రాంధికం అంపశయ్యపై కూలింది. కథానిక, ఏకాంకిక, ఖండకావ్యం, నవల, వ్యాసం, రేడియో నాటిక, కథ సాహిత్యరంగంలో ప్రవేశించాయి.

లోగడ వ్యావహారికభాష కావ్యానికి పనికిరానిదిగా ఉండేది. సామాన్య ప్రజాజీవితం దానికి నిషిద్ధవస్తువు. అభిజాత్యం, గుణసంపద ఉన్నవారే తప్ప ఇతరులు కావ్యంలో నాయికా నాయకులుగా ఉండటానికి వీలులేదు. నాటకంలో ప్రధానరసం శృంగారమో, లేక వీరమో ఉండవలెనేకాని మరొకటి ఉండటానికి వీలులేదు. మిగిలిన రూపకోపరూపకాలకు ఆయాసంధులు, సంధ్యంగాలు, నాయికానాయకులు, రసాలుతప్ప ఇతర సంధిసంధ్యంగాదులు ఉండటానికి వీలులేదు. కవిసంప్రదాయాలు, అలంకార గతవిబంధనాలు అనుల్లంఘనీయాలు, అనుసరణీయాలుగా ఉండేవి.

విదేశీయకావ్యాలలో ఈ విబంధనలు కనిపించలేదు. ఇవి కనిపించనంతమాత్రాన రసనిష్పత్తిలో లోటు కనిపించలేదు. పైపెచ్చుగా లోగడ పాటింపబడుతూవచ్చిన సంప్రదాయాలన్నీ చర్వణకు ప్రతిబంధకాలుగా కనిపించసాగాయి. ఇలా పోయిపోయి పద్యంలో యతిప్రాసలు దేనికి అన్నంతవరకూ వచ్చింది.

ఈ విధంగా కళాదేవతకు సంకెళ్ళు తగిలించారన్న భావం ప్రబలి మున్నెన్నడూ కనివిని యెరుగనంత మార్పు అనతికాలంలోనే బయలుదేరింది. ఆ మార్పు అనుదినం జరుగుతూనే ఉన్నది. ఇలాంటి స్థితిలో క్రొత్తపోకడల అంతర్యం గ్రహించలేక ప్రాచీన మతానుయాయులు, విప్లవవేగంలో కొట్టుకొనిపోతూ తమ గమ్యమూ, ప్రాచీనుల సిద్ధాంతమూ అర్థంచేసుకోలేక నవీన మతానుయాయులు అయోమయస్థితిలో వద్దారు.

## ప్రజాస్వామ్యం

సాంస్కృతికరంగంలో మరొక ముఖ్యవిషయం ఉంది. అంధవిశ్వాసాలను అధిగమించి

పాశ్చాత్యులు పరిశోధనలు సాగించి అనేక నూతనవిషయాలు కనుగొన్నారు. యంత్రాలు అవతరిల్లాయి. వీటివల్ల ఎక్కువ సరుకులు వుత్పన్నము కావటానికి, ఎక్కువమంది ఎక్కువతీరిక అనుభవించటానికి వీలు చేకూరింది. ''మహాత్మా సర్వభూతాంతరాత్మా,'' అని శతాబ్దాల నుంచి మానవుని హృదయంలో వుపశ్రుతు లీనమైవున్న సిద్ధాంతం ఆచరించి చూపటానికి అవకాశాలు క్రమక్రమంగా పెంపొందుతూ వచ్చాయి.

వీటిని పురస్కరించుకొని ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలైన పాశ్చాత్యదేశాలలో ప్రజా స్వామ్యం ప్రబలసాగింది. యంత్రసంస్కృతి ప్రేరితులై ఆంగ్లేయులు మన దేశానికి వచ్చారు. ఆసేతుహిమాచలం వారికి కైవసమైపోయింది. వారు ప్రవేశపెట్టిన ఆర్థిక రాజకీయ విధానాలతో పూర్వవ్యవస్థ సడలింది. పూర్వాచార వ్యవహార సంస్కారాలపై ఆదరాభిమా నాలు సన్నగిల్లసాగాయి. ఇదేసమయంలో ప్రభుత్వానికి ఇష్టంలేకపోయినా ఇంగ్లండు మొదలైన దేశాలలో ప్రవర్ధమానము లవుతూవచ్చిన ప్రజాస్వామ్య భావాలు ఇండియా మొదలైన ప్రాచ్యదేశాలలోగూడ ప్రాకసాగాయి.

శతాబ్దులనుంచి స్తంభించిపోయి వున్న సమాజంలో ఈ విధంగా సంచలనం ప్రారంభ మైనది. పూర్వం విద్యాధిక సంస్కారాలు కొన్ని వర్గాలకు మాత్రమే వుండేవి. కాని నూతన ప్రభుత్వం దేశంలో నెలకొనటం, దానితో నూతన సంస్కృతి రావటంవల్ల విద్యాధికం వర్ణైకనిష్ఠం కాక వివిధవర్గాలలోను ఆర్థికానుకూల్యం వున్నవారికి అలవడసాగింది. అందువల్ల వెనుకటిలోవలెగాక ఇప్పుడు అన్నివర్గాలలోనుంచి రచయితలు బయలుదేరారు. రచన ఎప్పుడూ రచయిత అనుభూతి సంస్కార సంభావనీయతలమీద ఆధారపడి వుంటుంది దీని ననుసరించి వివిధవర్గాల అనుభవాలు, సాహిత్యరూపం, కళారూపం సంతరించసాగాయి. స్వతః అవర్ణనీయం అంటూ ఒకటి లేకపోయింది. ఆంతరిక వైచిత్రివుండి, వైరుధ్యం లేకపోతే అవస్తూకార్యం లేకపోయింది. అందువల్ల మాలనిదగ్గరనుంచి బ్రాహ్మణునిదాక, ఆతతాయినుంచి ధీరోదాత్తునివరకు, పరమా ణువు నుంచి బ్రహ్మాండపర్యంతం చిత్రింపరానిది లేకపోయింది. వస్తుస్వీకారంలో లోగడ ఉన్న అభిమానద్వేషాలు, ఆదరవైముఖ్యాలు నశించాయి.

ఇలా చిత్రాతిచిత్రంగా వస్తున్న వస్తువైవిధ్యం, చిత్రణవైపరీత్యం విమర్శకుల కన్నులకు మిరుమిట్లు కొలుపుతున్నాయి నల్లి, కుక్క, మంచం, పెంటపోగు, నెరసినవెంట్రుక, ఘోరహత్య, నాయకుడులేని నాటకం, బీభత్సాంగి అయిన రూపకం, ఇతివృత్తంలేని ఈహామృగం, వీరులులేని ఇతిహాసాలు బయలుదేరుతున్నాయి. వలసరాజ్య సాహిత్యా లలో ఇవిబయలుదేరక పోయినా, విదేశీయ సాహిత్యాలలోనుంచి దేశీయసాహిత్యంలోకి

విపరీతి ఒప్పుతున్నాయి. ఇలా త్వర త్వరగా బహుముఖవ్యాప్తి, లేక వృద్ధి సాధనం, పెరుగుతుంటే వ్యవస్థ ఎందుకు ఉండదు?

పైగా మరొక విషయం వుంది. ప్రజాస్వామ్యభావం అపార్థం చేసుకోవటంవల్ల ఎవరికి వారే రాజులైపోతున్నారు. కళారంగంలో, సాహిత్యంలో నేర్చుకోవలసినది ఒకటి ఉన్నది అన్నభావం పోయింది; పోతున్నది విజ్ఞానశాస్త్రాలు (Natural Sciences) సామాజిక శాస్త్రాలు (Social Sciences) చదివినవారు, చదువుతున్నవారు సాహిత్యాది కళారంగంలో సాముగరిడీలు చేస్తున్నారు.

వీరు సృష్టికి పూనుకోరాదని అపోహ పడగూడదు. కాని కళాసృష్టికికూడ తమతమ శాస్త్రాలలోవలెనే వ్యవస్థ ఉన్నదని చాలమంది గ్రహించటంలేదు. పూర్వసాహిత్యాలతోను, కళాసృష్టులతోను (Works of Arts), అలంకారశాస్త్రంతోను సంబంధం లేకుండ సృష్టికి దిగుతున్నారు. అంతమాత్రాన అభ్యంతరం చెప్పవలసిన పనిలేదు. కాని అసలు బయలుదేరిన కళాసృష్టుల మంచిచెడ్డలు, అర్థాలు నిర్ణయించటంలో అధికారిత్వం ఎవరికి ఉండాలి? అధిక సంఖ్యాకుల సమ్మతి ననుసరించి శాస్త్రార్థ నిర్ణయం జరగాలని శాస్త్రవేత్తలు అంగీకరిస్తారా? ప్రజాస్వామ్యం అలా అనుశాసిస్తున్నదా?



అలంకారశాస్త్రంతోను, పూర్వకళాసృష్టులతోను సంబంధం లేని నవ్యకళా రాధకులు చేతికి దొరికిన ఏ పది విమర్శన గ్రంథాలనో పట్టుకొని అందులో తమకు నచ్చినవాటిని పరమ ప్రామాణికాలుగా భావిస్తున్నారు. వీటికి అలంకారశాస్త్రంలో ఎంతవరకు స్థాన మున్నదో, అవి ప్రతిపాదించే అర్థాలు ఉన్న కళాసృష్టులకు ఎంతవరకు అన్వయిస్తాయో, ఆయా విమర్శన గ్రంథకర్తలు ఏ విషయాలలో ప్రామాణికులో, ఎందులో అప్రామాణి కులో గుర్తించడం లేదు. ఒక పుస్తకం మంచిచెడ్డలను నిర్ణయించవలసి వచ్చినప్పుడు హడ్సన్ ఇలా అన్నాడనో, బేట్సు కథాలక్షణం ఇలా ఉండాలన్నాడనో, సోమర్‌సెట్‌మామ్ సాహిత్యం ఇలా వుండాలని అన్నాడనో, టాల్‌స్టాయ్ కళాతత్త్వన్ని ఇలా నిర్ణయించాడనో, లెనిన్ కళలు ఇలాంటి పనులు నిర్వహించాలన్నాడనో, ఫ్రాయిడ్ కృతిఅవతరణం ఇలా జరుగుతుందన్నాడనో పేర్కొని, ఆ నిర్వచనాలను పురస్కరించుకొని కళాసృష్టుల బాగోగులను నిర్ణయించటం జరుగుతున్నది. ఇలా కళా విషయంలో పుర్రెకొక బుద్ధిగా ఉంటున్నది.

కొంతమంది రచయితలు, కళాకారులు తమ తమ చిత్రణల కళాతత్త్వం నిరూపించుకోటానికి కొత్త కొత్త మార్గాలు త్రొక్కవలసి వస్తున్నది. అతివాస్తవవాదం (Sur-realism) సత్తావాదం (Existentialism) మొదలైనవి ఇందుకు నిదర్శనాలు. ఈ

వాదాలు కేవలం అత్యల్ప సంఖ్యాకుల సృష్టులను సమర్థించుకోటానికి పనికి వస్తున్నవే తప్ప ప్రాచీన ఆర్వాచీన కళా సృష్టులకు అన్నిటికీ గాని, లేక కనీసం ఒక శాఖాగత సృష్టులకు అన్నిటికీగాని, లేక కనీసం ఒకయుగంలో ఒక దేశంలో వెలువడిన సృష్టులకు అన్నిటికీగాని అన్వయించటం లేదు. దీనివల్ల అలంకారక్షేత్రంలో వాదాలు అడ్డాదిడ్డంగా పెంపొందటం, తికమకలు, అవకతవకలు, అవ్యవస్థ, పెచ్చరిల్లటం తప్ప, మరొకమేలు జరగటంలేదు.

## సంస్థాసిద్ధాలు

సమాజంలో బయలుదేరే వైవిధ్య వైరుధ్యాలకు సమన్వయ సహకారాలను కల్పించి అభ్యుదయానికి కీలుచీలలైన సంస్థలు కళలకు తోడ్పడుతున్నవో లేదో పరిశీలింతాము.

ఆంగ్లప్రభుత్వం మన దేశంలో నెలకొన్న తరువాత వివిధ రాష్ట్రాలలోను విశ్వవిద్యాలయాలు ఏర్పడ్డాయి. వీటి పరమావధి మొదట్లో పరిపాలనా నిర్వహణకు, విద్యాశాలల నిర్వహణకు కావలసిన ఉద్యోగులను, వుపాధ్యాయులను తయారుచేయడమే. అందువల్ల విద్యార్థులు నేర్చుకోవలసిన విషయాలనుగూడ తదనుగుణంగా నిర్ణయించటం జరిగింది. రాజభాష ఆంగ్లభాష కావటం వల్ల ఆంగ్లానికి ప్రాముఖ్యం వచ్చింది. దేశభాషలు ఒక విధంగా మూలబడ్డాయి. సద్యఃఫలమివ్వని తత్త్వశాస్త్రాదుల వంటివి పూర్తిగా వుపేక్షితాలయ్యాయి. పరిశ్రమలు మొదలైనవి ఆరోజులలో ఇక్కడ పెరగకపోవటంవల్ల విజ్ఞానశాస్త్రాలు చదువుకొన్నవారు చాల తక్కువగా తయారయ్యారు.



ఉద్యోగనిర్వహణకు ఆంగ్లభాష ప్రధానం కావటంవల్ల ఆ భాషమాత్రమే ఎక్కువ ప్రాధాన్యం వహించింది కాని ఆ సాహిత్యం, కళలు అంతగా ప్రాధాన్యం వహించలేదు. అందువల్ల పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులలో భాషాచరిత్ర ప్రాధాన్యం పొందినంతగా సాహిత్యం ప్రాముఖ్యం పొందలేదు. (తతిమ్మా కళల సంగతి అసలు చెప్పనే అవసరంలేదు.) బోధించే ఆ సాహిత్యంలో కూడ విడివిడిగా ఆ యా కవులనుగూర్చి, ఆయా యుగీన సాహిత్య లక్షణాలనుగూర్చి వున్న విమర్శలను, వివిధ కావ్య భేదాల లక్షణాలను స్థూలంగా పరిశీలించటం జరిగిందే కాని, "రామణీయక మంటే ఏమిటి? అది వస్తుగుణమా, ధర్మమా, లక్షణమా? లేక ప్రమాత గుణమా, ధర్మమా, లక్షణమా? కాక ప్రమాతా ప్రమేయముల సంబంధమా? జీవితానికి రామణీయకానికి, ధర్మానికి రామణీయకానికి, శాస్త్రానికి రామణీయకానికి ఏమిటి సంబంధం? జీవితంలో, జగత్తులో దానికున్న అర్థం ఏమిటి?" అని అణుమాత్రమైనా విచారించటం జరగలేదు.

సంస్థలలో సాహిత్య విద్యార్థులు అలంకార శాస్త్రం చదవకపోవటంలేదు. కాని, అవి అన్వయ రహితమై లోగడ పేర్కొన్న కారణాలవల్ల రక్తికి రంగానికి రావటంలేదు.

వెంటాలు - షేపా

ఈవిధంగా విద్యాసంస్థలుకూడా కళలో - ముఖ్యంగా సాహిత్యంలో అవ్యవస్థను దారితీస్తున్నవేతప్ప వ్యవస్థ నెలకొల్పటానికి తోడ్పడటంలేదు

## రాజకీయ పక్షాలు - ప్రచారం - కళలు

ఇటీవలి కొత్తగా వచ్చిన సంస్థలు, పార్టీలు, పత్రికలు వీటివల్ల కళకు ఏమి జరుగుతున్నదో పరిశీలిందాము.

ప్రజాస్వామ్యభావాలు ప్రబలినవని ఇంతకుముందు చెప్పుకొన్నాము. ఈనాడు వాటికున్న ఆదరాభిమానాలు మరేసిద్ధాంతానికీ లేవు. నియంతృత్వం అపేక్షించేవారుకూడ తాము ప్రజాస్వామ్యమునే కాంక్షిస్తున్నామని చెప్పుకొంటేతప్ప అంతర్జాతీయ రంగంలో కాని, జాతీయ రంగంలో కాని నీళ్ళు పుట్టవంటే అతిశయోక్తిలేదు. అయితే యీ ప్రజాస్వామ్యమనే పదానికి అంటగట్టే అర్థాలు అన్నీ యిన్నీ కావు.

ఏదేమి చెప్పినా, ప్రజాస్వామ్యభావాలు ప్రబలటంవల్లను, ప్రజాస్వామిక ప్రభుత్వాలు పెక్కు దేశాలలో నెలకొనటంవల్లను వివిధదేశాలలో భిన్నభిన్న రాజకీయ పక్షాలు బయలుదేరాయి. తుదికి ప్రజాస్వామ్యసిద్ధాంతానికే ఎసరుపెట్టే రాజకీయ పక్షాలు కూడా బయలుదేరాయి. ఇంకా బయలుదేరటానికి ఈనాటివరకూ అవకాశమున్నది. ఈపక్షాలు తమ తమ సిద్ధాంతాలను అమలులోకి తేవాలంటే వాటిని ప్రజలలో ప్రచారంచేసి వారి ఓట్లు సంపాదించి అధికారం చేపట్టాలని అంటున్నాయి. ప్రజలను విజ్ఞానవంతులను చేస్తే వారే తమ పరిపాలనను చక్కబెట్టుకొంటారన్న భావం ఈనాటివరకూ ఏదేశంలోను ప్రధాన రాజకీయపక్షాలకు లేదు. తాము, తమ పార్టీ మాత్రమే అలాంటిదానిని అమలుపరచగలమని ఆయా పార్టీ సభ్యుల విశ్వాసం. అందువల్ల అన్ని రాజకీయ పక్షాలకు రాజకీయ అధికార సముపార్జనం అత్యంత ముఖ్యమైపోయింది. పార్లమెంటరీపద్ధతి అమలులో వుంటున్నప్పుడు, ఆ పద్ధతికన్నా గత్యంతరం లేనప్పుడు ప్రచారం ఎంత ప్రాముఖ్యానికి వస్తుందో వేరే వివరించి చెప్పనవసరంలేదు.

ప్రతిరాజకీయ పక్షంకూడ తన సిద్ధాంతాలను, వాటికంటే తన నాయకుల గొప్పతనాన్ని చాటుకోటానికి వీలైన సాధనాలను తీవ్రంగా అన్వేషిస్తూ వచ్చింది. సభలు, సమావేశాలు, ప్రదర్శనాలు, నిరసనలు, సమ్మెలు, కరపత్రాలు కనిపెట్టింది. వీటి ప్రభావం తాత్కాలికంగా వుంటున్నదేకాని మానవుని హృదయాంతరాంతరాలలోకి ఎక్కి అవసరమైనప్పుడల్లా ప్రజ్వరిల్లటంలేదు. ఇలాంటిసాధనం ఏమిటా అని చూస్తే, నాటకాలు, ఒపేరాలు (Opera) జానపద గేయాలు, నాట్యాలు కనిపించాయి. అసలు కళలకు మించిన ఉత్తమప్రచార సాధనాలు దొరకటం అసంభవమని పుష్కిన్‌నుంచి టాల్‌స్టాయ్‌వరకు వచ్చిన రష్యన్ సాహిత్యం మన్ను తెరపించింది.



---
జి.వి.కృష్ణారావు

మొట్టమొదట ఈ విషయాన్ని కనిపెట్టిన గౌరవం కమ్యూనిస్టుపార్టీకే యివ్వాలి. ఎందుకంటే సాహిత్యాన్ని పార్టీ ప్రచారసాధనంగా మొట్టమొదట వినియోగించుకొన్నది వారే. పురాణేతిహాసాల కాలంనుంచి కళలో, సాహిత్యంలో ఒకవిధమైన ప్రచారం (కేవలప్రచారంకాదు) రచయితల విశిష్టదృక్పథం, హృదయస్పందనం మొదటినుంచీ వుంటూనేవున్నది. కాని ఒక పార్టీకోసమని, పార్టీవ్యక్తుల గొప్పకోసమని లోగడ సాహిత్యం, కళ పూర్తిగా ఆహుతిచేయటం జరగలేదు. తన హృదయస్పందనాన్ని, తన అనుభూతికి గోచరిస్తున్న సత్యాన్ని అభివ్యక్తం చేయటం జరిగింది. పుష్కిన్ కాలంనుంచి 1920 దాక రష్యన్ రచయితలూ అలాంటిపనే చేశారు. కాని కళను రాజకీయ పక్షానికి ఒక సాధనంగా సమర్పణ చేసికోవటం 18 శతాబ్ది ప్రథమ పాదం చివరిలోనే ప్రారంభమైనదని చెప్పాలి. ఏది ఎలా వున్నా యీ విషయంలో ముందంజ వేసింది కమ్యూనిస్టుపార్టీయో, లేక మరొకటో నిర్ణయించవలసిన బాధ్యత చరిత్రజ్ఞులకు వదలివేదాము.

ఇలా కళలను పార్టీ ప్రచారసాధనాలుగా వినియోగించటానికి అవకాశం వున్నదని స్ఫురించగానే ప్రతిపార్టీకూడా తన పార్టీకి అనుబంధంగా ఒక ప్రత్యేక సాహిత్యపరిషత్తును, నాట్యకళాపరిషత్తును, ఆలంకారికమలాన్ని లేవనెత్తింది. లేవనెత్తుతున్నది. ఇందుకు మనదేశంలో కమ్యూనిస్టు కాంగ్రెసుపార్టీలు చేస్తున్న ప్రయత్నాలే నిదర్శనం. కళ అంటే ఏమిటో, ఎలా వుండాలో గాంధీజీ సెలవిచ్చిపోయాడు. డాంగే ప్రభృతులు కూడా కళాతత్త్వాన్ని ఉపదేశిస్తున్నారు.



నూతనసాహిత్య సిద్ధాంతాలు వస్తున్నవంటే బుద్ధిమంతుడెవ్వడూ వులికిపడవలసిన పనిలేదు. పైపెచ్చుగా సంతోషించాలి. కాని యీ సిద్ధాంతాలు రామాయణ కాలంనుంచి నేటివరకు వచ్చిన కళాస్రష్టల అర్థాలను నిర్ణయించుకోటానికి తోడ్పడుతున్నవా? లేదనే చెప్పాలి. ఎందుకంటే బమ్మెరపోతన్న అభ్యుదయ కవి అవుతున్నాడు. శ్రీనాథుడు కావటంలేదు. ప్రబంధకవులు అభ్యుదయవిరోధకులైతే కవిత్రయం అభ్యుదయికం అవుతున్నది. శివకవులు ఏరేమౌతారో ఆ పార్టీవారు చెప్పేదాకా ముందుగా చెప్పటం సాహసమే. ఒక్క శివకవులను మినహాయిస్తే మిగతా ప్రాచీనాంధ్రకవులందరిదీ మొత్తంమీద తత్త్వతః ఒకటేదృష్టి. వారు ఆధ్యాత్మికవాదాన్ని ఆశ్రయించారు. వారు స్వీకరించిన ఇతివృత్తం, చిత్రించిన విధానం దానిని స్పష్టం చేస్తున్నాయి. అలాంటప్పుడు వారిలో కొందరు అభ్యుదయకవులనీ, మరి కొందరు అభ్యుదయనిరోధకులనీ విభజించటం హాస్యాస్పదం కాకమానదు రాజులను ఆశ్రయించనంత మాత్రాన పోతన్న అభ్యుదయకవి అయి, రాజులను ఆశ్రయించినంత మాత్రాన శ్రీనాథుడు అభ్యుదయనిరోధకుడని అనటం చాలా శోచనీయం.

రాజకీయపక్షాలను పురస్కరించుకొని బయలుదేరుతున్న సాహిత్య సిద్ధాంతాలవల్ల మరొక ఘోరాలపచారం జరుగుతున్నది. ఆయా పార్టీల సిద్ధాంతాలను చిత్రించిన రచనలే సాహిత్యమనీ తద్భిన్నాలు తాకటానికి కూడా యోగ్యాలు కావనీ అంధ ఆవేశాలు నానాటికీ ప్రబలిపోతున్నాయి. కొంత నిర్లిప్తంగా వుండి ప్రశాంతంగా వుండి ఆలోచించుకొని ఎవనికి వాడు స్వయంగా నిర్ణయించుకొనే అవకాశంపోయి పార్టీలో ఆవేశం, మాస్ హిస్టీరియా బయలుదేరుతున్నాయి. ఆవేశాదికాలు కళానుభూతికి కేవలం గర్భవిరోధులు కాని సహాయకారులుకావు. ఇలాంటి ఆవేశాలు, ఉన్మాదాలు పనికిరావని బ్రిటన్‌లో మాథ్యూ ఆర్నాల్డ్ ఒకప్పుడు మొత్తుకోవటం జరిగింది.

ఏది ఎలా వున్నా, రాజకీయ పక్షాలు కళారంగాలలో ప్రవేశించి అవ్యవస్థను పెంపొందించటానికి తోడ్పడుతున్నవే తప్ప, ఈనాటివరకూ మరొకవిధంగా సహాయం చేయటంలేదని భావించవలసి వస్తున్నది.*

## పత్రికలు

కళావిషయాలలో పత్రికలుకూడ ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్నవి. ఈ నిర్వహిస్తున్న పాత్రను తెలుసుకోవాలంటే వాటి తత్త్వం కొంత తెలుసుకొననిదే ప్రయోజనంలేదు. 'ఇలలో ఎంతో' కలలో అంత,' అన్నట్లుగా సమాజమెట్లో పత్రికలు అంతే. కాని సూక్ష్మంగా పరిశీలించి ఆర్థిక ఉపాధులనుబట్టి చెప్పవలసివస్తే పత్రికలను మూడు తరగతు లుగా విభజించవచ్చును:- (1) పార్టీ పత్రికలు, (2) కుక్షింభరులు, (3) స్వతంత్రలు.



## పార్టీపత్రికలు

దినపత్రికలు, సరియైన వారపత్రికలు సాధారణంగా పార్టీలు పూనుకొని నడపాలి. లేదా, లక్షాధికారులుకాని, కంపెనీలుకాని నడపాలి. సాధారణ వ్యక్తులకు ఆ నిర్వహణం ఈరోజులలో అసాధ్యమంటే అతిశయోక్తి యేమాత్రం లేదు. అందువల్ల పార్టీలవల్ల నడుపబడుతున్నప్పుడు పత్రికలు పార్టీల విధానాలే అవలంబిస్తవి తప్ప మరొక విధానం అవలంబించవు. పార్టీ విధానాలలో ద్వైతభావం ఉన్నంతకాలం – అంటే సాధనమూ సాధ్యము, పాలితులూ పాలకులు, వీటిమధ్య అగాధమైన వ్యత్యాసం ఆయా పార్టీవిధానాలు

---

* రాజకీయ పక్షాలు కళాస్వరూపనిరూపక సిద్ధాంతాలను, లక్ష్యాలను ప్రచారం చేయరాదని ఒప్పుకునేవాడను. జీవితం స్వతంత్రమై మరొకదానికి సాధనంకానట్లే, కళ స్వతంత్రం. మరొకదానికి సాధనం

కి.వి.కృష్ణరావు

న్యాయవిహితంగా పరిపాలిస్తారుకాని, అన్యథా వ్యవహరించరు. అసలు సమ్యగ్దర్శనోపాసకులు కానివారు సైనికులుగనో, అందుకూ అయోగ్యులైతే సామాన్య ప్రజలుగనో పరిగణింప బడుతారు. అసలు తత్త్వవేత్తలు యాథార్థ్యం, నిత్యత్వం ఆరాధిస్తారు. వారికి క్షణికాలు, పరిణాములు అయిన శరీరసుఖాలు భౌతిక విషయాలు తుచ్ఛాలు. పైగా వారికి గణిత శాస్త్రం, రేఖా గణితం, ఖగోళశాస్త్రం, తర్కం నేర్పుతారు. అందువల్ల వారు పెడత్రోవ పట్టటానికి ఆస్కారం లేదు.

పై సిద్ధాంతం ప్రకారం వివేకం అనేది పరిపాలకుల ఒక్కళ్ళలోనే ఉంటుందనీ, సామాన్య ప్రజానీకం కేవలం పైవారు అనుశాసించినట్లు చేయవలసినదేతప్ప మరేమీ చేయగూడదనీ సిద్ధిస్తున్నది. దీనికి కారణం ప్లేటోకు వృత్తికారులు, అంటే రెక్కలకష్టంమీద బ్రతికే సామాన్య ప్రజానీకంమీద ద్వేషంకాదు. దీనికి మూలకారణం, "మంచి పరిపాలన అనేది విగలిత ప్రత్యక్ష జ్ఞానమైన వివేకానికే విషయం కాని అభిప్రాయానికి విషయం కాదు. ఈ వివేకం జ్ఞానివర్గంసొత్తు," అనటంలో ఉంది. ప్లేటోమతం ప్రకారం రోగికీ వైద్యునికీ ఉన్న సంబంధమే, సామాన్య ప్రజానీకానికీ పాలకులకూ ఉన్నది

పై విషయాలనుబట్టి న్యాయమంటే ప్లేటో అభిమతమేమో తేలికగా ఊహించు కోవచ్చును. న్యాయమనేది సమాజం విచ్ఛిన్నం కాకుండా కలిపి ఉంచేమాత్రం. ఇది వ్యక్తుల అభిరుచులనుబట్టి, పొందిన శిక్షణమబట్టి సమరస భావంతో వ్యవహరింపజేస్తుంది. ఈ న్యాయం ఇటు వ్యక్తికము, అటు సామాజికము. ఈ న్యాయమువల్లనే రాజ్యానికీ, వ్యక్తులకూ శ్రేయస్సు కలుగుతుంది. మానవునకు తగిన వృత్తి లభించటంకంటె దానికి తగిన యోగ్యత సంపాదించటంకంటె ఉత్తమమైనది మరొకటిలేదు. ప్రతివ్యక్తి తనకు యోగ్యమైన వృత్తిలో ప్రవేశించటంకంటె శ్రేయస్కరమైనది అటు వ్యక్తులకు కాని, సమాజానికిగాని వేరేలేదు.

న్యాయమంటే ప్లేటోమతం ప్రకారం ఏవ్యక్తికి రావలసినది ఆవ్యక్తి కివ్వటమే. ఏ వ్యక్తికి రావలసినది ఆవ్యక్తికివ్వటమంటె అతనికున్న శక్తి సామర్థ్యాలనుబట్టి సత్కరించాలి. ఇలా చూచినందుకుగాను ఆ వ్యక్తి తనకు లబ్ధమైన పదవిని త్రికరణ శుద్ధిగా నిర్వహించాలి.

ఇలా నిర్వచింపబడిన న్యాయాన్ని గూర్చి శబైన్ ఇలా వ్రాస్తున్నాడు : ★

"This delinition of justice lacks the notion, connoted by the Latia word ns and the English word right, of powers of voluntary action in the exercise of which a man will be protected by law and supported by the authority of

★ History of Political Thought

the state Lacking this conception Plato does not mean by justice, except remotely the maintainance of public peace and order, at least external order is but a small part of the harmony which makes the state What the state provides its citizens is not so much freedom and protection as a life-all the opportunities for social interchanges which make up the necessaries (amenities) of a civilised existance It is true that in such a social life there are rights, just there are duties, but they can hardly be said to belong in any peculiar sense to individuals They are inherent rather in the services or functions that individuals perform Resting as it does upon, the principle that the state is created by mutual needs, the analysis runs necessarily in terms of services and not of powers Even the ruler is no exception, for he has merely the special function to which his wisdom entitles him. The notion of authority or severiegn power such as the Roman attached to his magistracies has practically no part in Plato's theory nor indeed in that of any Greek philosopher'.

ఆదర్శ ప్రాయమైన రాజ్యం ఏయే పరిస్థితులలో హ్రాసం పొందుతుందో, ఏయే

210

హ్రాసదశలలో ఎలా ఉంటుందో కూడ ప్లేటో సూచించాడు. ఉత్తమమైన రాజ్యం అరిస్టోక్రటిక్ రాజ్యమనీ, అంతకన్నా హీనమైనది మిలిటరీవర్గ రాజ్యమనీ, అంతకన్నా హీనమైనది ధనికవర్గ రాజ్యమనీ (Oligarchic State), అంతకన్న హీనమైనది ప్రజాస్వామికమనీ, అన్నిటికన్న హీనాతి హీనమైనది నియంతృక రాజ్యమనీ అన్నాడు.

ఇంతకూ ఉత్తమోత్తమమైన అరిస్టోక్రటిక్ రాజ్యం ఎలా హ్రాసం పొందుతుంది? అరిస్టోక్రసీ ఉండగా రాజ్యం యుద్ధనిమగ్నమౌతుంది. అలాంటి సమయంలో విజయకారకులైన సైన్యాధిపతులను బ్రహ్మాండంగా పొగడటం జరుగుతుంది. దానితో ప్రజలకు వారిమీద ఎక్కడలేని గౌరవ ప్రతిపత్తులు ఏర్పడుతాయి. యుద్ధం ముగియగానే ఆనాయకులను వారి అనుచరులు క్రింద నడవకుండా భుజాలమీద కెక్కించుకొని వస్తారు. ప్రజలు సంతోషవివశులై ఆ నాయకులను గవర్నర్లుగానో, లేక పరిపాలకులుగానో ఎన్నుకొంటారు. ఇలాంటి అనుభవం మనకు కొత్తకాదు. చరిత్రలో ప్రాచీన కాలంనుంచి నేటివరకూ అనుభవానికి తగులుతూనే ఉంది. అయితే యీ మిలిటరీ నాయకులకు తత్త్వవేత్తల కున్నంత వివేకం ఉండదు. కాబట్టి వీరు విపరీత వ్యయానికి లోనవుతారు. ఈ విధంగా రాజ్యంలోని ధనికవర్గానికి వీరు బాకీపడతారు. ఋణగ్రస్తుడు ఋణదాతచేతి కీలుబొమ్మగా తయారవుతాడు. దానితో పూర్వమున్న గౌరవప్రతిపత్తులను కోల్పోతాడు.

---

జి.వి.కృష్ణరావు

ఇలా మిలిటరీనాయకుల అధికారమంతా ఋణదాతలకు సంక్రమిస్తుంది. తుదికి ఋణదాతలు గవర్నర్లో, లేక పరిపాలకులో అవుతారు. దీనితో ధనికవర్గ ప్రభుత్వం ఏర్పడుతుంది.

మిలిటరీ నాయకులకంటె ధనికవర్గం వివేకహీనం. ఈ వర్గందృష్టి ఎంత సేపటికీ స్వలాభంమీద ఉంటుంది. శాసనాధికారాలను స్వార్థంకోసం, సొంత సొత్తుల పెంపుకోసం వినియోగిస్తుంది. తన బొక్కసాలు నింపుకొనేందుకు పేదలమీద రకరకాల పన్నులు విధిస్తుంది. ఈ విధంగా చివరికి రాజ్యమంతా రెండుభాగాలైపోతుంది. కొలదిమంది కోటీశ్వరులు ఒక ప్రక్కన, దారిద్ర్య పీడితమైన ప్రజాసామాన్యం మరొక ప్రక్కన, ఏర్పడుతుంది. తుట్టతుదకు అత్యధిక సంఖ్యాకమైన సామాన్య ప్రజానీకం విప్లవం తెచ్చి తమ్ము దోచుకుతినే ధనికవర్గ అధికారం స్వాయత్తం చేసుకొంటుంది. ఇదే ప్రజాస్వామికం.

ఈ ప్రజాస్వామ్యంకూడా ఎంతో కాలం నిలవదు. ఈ ప్రభుత్వం ఏర్పడీ ఏర్పడకముందే, తనవల్ల ప్రజానీకానికి విమోచనం కలిగింది కాబట్టి, పరిపాలనలో తనకు సముచితస్థానం ఉండాలని విప్లవనాయకుడు అంటాడు. పరిపాలన బాధ్యత తనకు అప్పగించి ప్రజలు తన్ను నమ్మాలంటాడు. నమ్మితే సర్వకష్టాలూ తొలగుతాయని ప్రజలకు వాగ్దానం చేస్తాడు. భూలోక స్వర్గమేర్పడుతుందని ప్రలోభపెడతాడు. తన్నుతానే రాజుగానో, గవర్నరుగానో ఎన్నుకుంటాడు. ఈ విధంగా నియంతృక పరిపాలన వస్తుంది. అన్ని ప్రభుత్వాలకంటె ఈ నియంతృక ప్రభుత్వం హీనాతిహీనం. దీనికంటె అన్యాయమైనది మరొకటి ఉండదు. ఈ ప్రభుత్వంలో సామరస్యం కుహూశార్వరిలో చంద్రరేఖ. నియంత కేవలం స్వార్థమపేక్షించి పరిపాలన సాగిస్తాడు.

ఈ ప్రభుత్వాలకు అనుగుణంగా అయిదురకాల వ్యక్తులుంటారు. వీరిలో తత్త్వవేత్త ఉత్తమోత్తముడు. తరువాతి వ్యక్తి సైనికుడు. తరువాతి వాడు ధనికుడు. ఆపిమ్మట పరిగణ్యుడు సామాన్యజనుడు. కట్టకడపటివాడు నిరంకుశుడు. వ్యక్తులలోకూడా ప్రోసంపైన చెప్పినట్లుగానే జరుగుతుంది. తత్త్వవేత్త మొట్టమొదటివాడు. అతని కొడుకు సైన్యాధిపతులకు లభించే ఆదరగౌరవాలు, కీర్తి, అధికారం చూస్తాడు. తన తండ్రిమార్గం అవలంబిస్తే ఆస్తిపాస్తులుండవనీ, భోగభాగ్యాలు లభించవనీ, కేవలం నిరర్థకంగా క్లిష్ట తాత్త్విక సమస్యా పరిష్కారంకోసం తలబ్రద్దలు చేసుకోవలసి వస్తుందనీ భావిస్తాడు. అతనికి సైన్యాధిపతి జీవితమే అభిలషణీయ మౌతుంది. ఆ వృత్తినే అవలంభిస్తాడు. అతని కొడుకు తండ్రి మిలిటరీ జీవితాన్ని చూస్తూ ఉంటాడు. తండ్రి నిరంతరం యుద్ధనిమగ్నుడై ఉండటంవల్ల ఏనిమిషాన ఎలాంటి విపత్తువస్తుందో అన్న ఆందోళన అతనికి కలుగుతుంటుంది. అప్పుడప్పుడు క్షతగాత్రుడై తండ్రి యింటికి చేరుకొంటూ ఉంటే అతని మనస్సు ఎలా ఉంటుందో వేరేచెప్పనవసరంలేదు. అందువల్ల

అతడు తండ్రి అడుగు జాడలలో నడవటానికి ఏమాత్రం సమ్మతించడు. నిరపాయజీవితం అభిలషిస్తాడు. అందువల్ల పనిర్వృత్తికి దిగుతాడు. ధనికుడౌతాడు. అతని కొడుకు తలకుమించిన ఖర్చు పెడతాడు. ఏమాత్రం ప్రతిబంధకమేర్పడినా చిరాకు పడతాడు. నీతినియమంలేకుండా వివేకహీనజీవితం గడుపుతాడు. అతడే ప్రజాస్వామ్యవాది. అతడు కేవలం అరిషడ్వర్గం ఆడించినట్లు ఆడుతాడు. అతని కొడుకుకు అణుమాత్రసహనంకూడా ఉండదు. తనకు అసలు ఎలాంటి అవరోధంకూడా ఉండగూడదనుకొంటాడు. ఇదే నిరంకుశుని లక్షణం.

ఈ పైని చెప్పుకొన్న విషయాలనుబట్టి ప్లేటో మతంప్రకారం ఎవని వృత్తివాడు త్రికరణశుద్ధిగా చేయటమే న్యాయం. ఇతర వృత్తి పొంత పోవటం అన్యాయం. ఈ సిద్ధాంతంలో బెర్ట్రాండ్ రస్సెల్ ★ పేర్కొన్నట్లు కర్మసిద్ధాంతం అంతర్భూతమై ఉంది. వ్యక్తి అవతరణకుముందే సమాజంలో అతని స్థానం నిర్దిష్టమై ఉంది. కాని జీవులు ఆ ధర్మం ఉల్లంఘించటానికి ప్రయత్నిస్తాయి. అయితే ఈశ్వరశాసనం అలా ఉల్లంఘించేవారిని శిక్షించి నిత్యవ్యవస్థను తిరిగి నెలకొల్పుతుంది. ఈ భావమే ''చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః'', ''యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత,'' ఇత్యాది గీతాశ్లోకాలలో రాణిస్తున్నది.



ప్లేటోచే ప్రతిపాదితమైన న్యాయస్వరూపంలో ప్రజాస్వామ్య మాకాంక్షించే సమానత్వానికి ఎక్కడా ఆస్కారం లేదు. అతడు చెప్పే న్యాయం ప్రకారం కొందరికి ఎక్కువ అధికారం, మరి కొందరికి తక్కువ అధికారం ఉండవచ్చును. ఉదాహరణకు అతని ఆదర్శరాజ్యంలోని పాలకులను తీసుకుంటే, సర్వాధికారాలూ వారివే. అలా ఉండటం అతడు న్యాయమే నంటాడు. ఎందుకంటే వివేకవంతులైనవారు ప్రజా సామాన్యంలో ఉన్నప్పుడు జరుగుతుంది; లేదా పాలకులలో మూఢులున్నప్పుడు అన్యాయమౌతుంది. ఇలాంటి అన్యాయం తొలగించటానికి అతడు మార్గం సూచించాడు. అయితే అతని మతం ప్రకారం సామాన్య ప్రజానీకానికి రాజకీయవ్యవహారాలలో ఎలాంటి జోక్యం లేకపోవటమే న్యాయం.

ప్లేటో న్యాయ నిర్వచనం పరిణామ రహితమై, సర్వకాలసర్వావస్థలందు ఒకే విధంగా ఉండే సమాజమపేక్షిస్తూ, వృత్తులను ప్రభుత్వమే నిర్ణయించాలని అనుశాసిస్తున్నది. తనవృత్తిని తాము నిర్ణయించుకోటానికి గాని తనకు సత్యమనితోచిన పరమార్థమనుసరించి జీవితం దిద్ది తీర్చుకోటానికిగాని వ్యక్తికి స్వాతంత్ర్యం లేకుండా చేస్తున్నది ''స్వప్రత్యూషా

★ History of European Philosophy

నుభవం కూడా యథార్థం. సమాజమనేది సచేతనమైన అవయవి కాదు. వ్యక్తి, సమాజంలోకి పోయినా, ఒంటరిగానో, జంటగానో నివసించిన రోజులున్నవి. ప్రత్యక్షానుభవంవిరహితమైన వివేకచోదితమైన జీవితమే పరమార్థం కాని, దాని వెలుపల మరొక పరమార్థం లేదని భావించి తదనుగుణంగా త్రికరణశుద్ధిగా వ్యవహరించేవారికి చోటు లేకుండా పోతున్నది. అలాంటి వారంతా పాపులు, అన్యాయపరులు, దండ్యులు అవుతున్నారు.

రిపబ్లిక్‌లో ప్లేటో కమ్యూనిజం ప్రతిపాదించాడని బీర్★ మొదలైనవారు భావిస్తున్నారు. వారు ప్లేటో సిద్ధాంతానికీ, కమ్యూనిజానికీ ఉన్న యీ క్రింది సామ్యాలను సూచిస్తున్నారు.

1. సొంత ఆస్తి ఉండగూడదు.
2. కుటుంబజీవనం పనికిరాదు.
3. పిల్లలను ప్రభుత్వమే పెంచాలి.
4. విద్యావిధానం ప్రభుత్వమే స్వయంగా నడపాలి.
5. శరీరానికి అంగాలకు ఉన్న సంబంధమే సమాజానికి వ్యక్తికీ ఉన్నది.
6. నియంతృత్వం అవసరం.

కమ్యూనిజానికీ, ప్లేటో సిద్ధాంతానికీ పై విషయాలలో సామ్యమున్నమాట నిజమే కాని అంతమాత్రం చేతనే ప్లేటో కమ్యూనిజం ప్రతిపాదించాడనటంలో అర్థంలేదు. అసలు అలా అంటున్నారంటే ఇటు ప్లేటో మతం కాని, అటు కమ్యూనిస్టు సిద్ధాంతం కాని అర్థం కాలేదన్నమాట. ఎందుకంటే ప్లేటో ప్రతిపాదించేది. 1. ఆధ్యాత్మికవాదం. ఈ వాదం ప్రకారం భావాలు, ఆత్మ ఈశ్వరుడు ఉన్నారు. మన వ్యావహారిక జగత్తు అయథార్థం. కమ్యూనిజంలో అంతర్భూతమై ఉంది భౌతికవాదం. ఇది ఆత్మ ఈశ్వరుల ఉనికి అంగీకరించదు. ఈ జగత్తు యథార్థ మంటుంది. ఈ జగత్తు వెనుక స్వర్గనరకాదులున్నట్లు అంగీకరించదు. 2. ప్లేటోమతం ప్రకారం ఈ జగత్తుహేయం. కమ్యూనిజం ప్రకారమిది ధ్యేయం. ప్లేటోమతం భావానికి ప్రాధాన్యమిస్తే కమ్యూనిజం ఆర్థికస్థితిగతు లకు ప్రాధాన్య మిస్తున్నది. 3. ప్లేటో రిపబ్లిక్‌లో కార్మికుల ఆర్థిక సముద్ధరణసంగతి ఎత్తనేలేదు. 4. ఉత్పత్తి సాధనాలు సరకుపంపకం వ్యక్తులపరంగా జరగాలంటున్నాడు. 5. ప్లేటో సూచించే ఆదర్శ రాజ్యానికి ప్రాతిపదిక వ్యవసాయమే కాని యంత్రపరిశ్రమలు కావు. 6. రిపబ్లిక్‌లోని ఆర్థిక వ్యవస్థీకరణం వ్యష్టికమే కాని సమష్టికం కాదు. 7. పాలకులకుమాత్రమే సొంత ఆస్తులు రిపబ్లిక్‌లో నిషేధింపబడ్డాయి. ఇది ఆర్థిక దృష్టితో జరిగింది కాదు. బొశాంకో పేర్కొ న్నట్లు రాజకీయాలను ఆర్థికదుష్ట

★ Beer Social Struggles in Antiquity

సంపర్కం నుంచి తొలగించటానికి జరిగింది. 8 ప్లేటో వర్గరాహిత్యం ప్రతిపాదించలేదు పరిపాలకవర్గం, రక్షకవర్గం, కార్మికవర్గం స్థిరంగా అలాగే ఉంటాయి. క్రిందివర్గాలు పైవర్గంవారి శాసనాలను శిరసావహించాలి. ప్లేటో ప్రతిపాదించే విద్యావిధానం, స్త్రీ పురుష సమానత్వం, వివాహసంస్కరణలు మొదలైనవి పాలకరక్షక వర్గాలకేగాని సామాన్య ప్రజానీకానికి కాదు. అందువల్ల రిపబ్లిక్ పేరుకు ఒకటే రాజ్యమైనా అరిస్టోటల్ ''రాజకీయాలు''★ అనే గ్రంథంలో విమర్శించినట్లు రెండు రాజ్యాలేర్పడుతు న్నాయి. పాలకవర్గరాజ్యం ఒకటి. సామాన్యప్రజలరాజ్యం మరొకటి. 9. ప్లేటో ప్రతి పాదించేది స్వసంప్రమైముఖ్యం, సుఖవిరాసం బోధించే కమ్యూనిస్టిక్ సన్యాసం ¤

కాబట్టి ప్లేటో ప్రతిపాదించినది కమ్యూనిజం కాదు. ఆపక్షంలో ఈరెంటికీ పైని పేర్కొన్న సామ్యాలు ఎలా ఏర్పడ్డాయి? అవి యాదృచ్ఛికాలా? యాదృచ్ఛికాలు కాదనే చెప్పాలి ఎందుకంటే అటు ప్లేటో, ఇటు కమ్యూనిజాన్ని శాస్త్రీయపద్ధతిని వివరించిన మార్క్సు ఈక్రింది విషయాలలో ఏకీభవిస్తున్నారు:– 1. సమాజం ఒకశరీరం. వ్యక్తిఅయిన మానవుడు దానినుంచి విడివడి బ్రతకలేని అవయవం. 2. మానవజీవితం మరొకదానికి సాధనమే కాని తనకుతాను పరమార్థంకాదు. ప్లేటో ఈజీవితం భావ జ్ఞానసిద్ధికి సాధనమంటే, మార్క్సు కమ్యూనిస్టు ఆదర్శసిద్ధికి సాధనమంటాడు. కాబట్టి ఇరువురిమతం ప్రకారం లక్ష్యసిద్ధికి చేసేదంతాధర్మమే. అలాంటిది అధర్మంకాదు. ఈశ్వరుడు పరిపాలకులను బంగారంతో చేశాడనీ, రక్షకులను వెండితో చేశాడనీ, వృత్తికారులను ఇనుముతో చేశాడనీ ప్రభుత్వం అసత్యప్రచారం చేయాలని ప్లేటో రిపబ్లిక్‌లో సూచించాడు. సూచించటమే కాదు. అసత్యం పాలకుల ప్రత్యేకాధికార మన్నాడు. కార్యసాధకమైతే సరి ఎలాంటి మార్గమైనా అవలంబించవచ్చునని రష్యన్ కమ్యూనిజం తన చరిత్రతో లోకానికి చాటుతున్నది. 3. ప్లేటో సిద్ధాంతంలో కర్మసిద్ధాంత మంతర్భూతమై ఉంది. ఈ కర్మ సిద్ధాంతమే చారిత్రావశ్యకత పేరుతో కమ్యూనిస్టు సిద్ధాంతంలో అంతర్భూతమై ఉంది. 4 ప్లేటో ప్రతిపాదించే వివేకం సామాన్య ప్రజానీకం ఇష్టానిష్టాలతో నిమిత్తంలేని పారమార్థికమత్యం. అలాగే మార్క్సు ప్రతిపాదించే గతితార్కిక



---

★ Politics, Book 11, Chap 5 "The necessary consequence is that there will be two states in one and those states mutually hostile"

¤ "In summary it is a communism of monastic asceticism and renounciation, a communism of withdrawal from the world and the cares of the world " The socialist tradition Alexander Grass A E Taylor కూడ Platonism అనే పుస్తకంలో ఈ మాటే అంటాడు

---

జి.వి.కృష్ణరావు

భౌతికవాదంకూడ సామాన్యప్రజానీకం ఇష్టానిష్టాలతో నిమిత్తంలేని పారమార్థికసత్యం. అందువల్ల ఇద్దరూ నియంతృక పరిపాలన అంగీకరిస్తున్నారు. విద్యావిధానం, శిశు శిక్షణ, వివాహాలు, సామాజిక జీవనం ప్రభుత్వమే బాధ్యత వహించి నడపాలనీ, ప్రజలు ఆ అనుశాసనాలను శిరసావహించి నడచుకోవాలని అంగీకరిస్తారు. అయితే యిరువురి పరమార్థాలూ వేరు కాబట్టి ప్రభుత్వ లక్ష్యాలుకూడా భిన్నంగా ఉన్నాయి. 5. యుద్ధాలకు కారణం ధనమేనని అటు ప్లేటో అంగీకరిస్తున్నాడు. ఇటు మార్క్స్ అంగీకరిస్తున్నాడు. అందువల్ల సొంత ఆస్తులను, ఇద్దరూ నిషేధిస్తున్నారు.

ఇకమీదట ధర్మ విషయం వదలి మనకుముఖ్యమైన రామణీయకాన్ని గూర్చి ప్లేటో ఏమి చెబుతున్నాడో చూదాము.

# రామణీయక విచారణ

ప్లేటో ప్రతిపాదించిన జ్ఞానస్వరూపాన్నిబట్టి ఆధ్యాత్మికమనీ, భౌతికమనీ రెండు జగత్తు లేర్పడుతున్నాయి. భౌతికజగత్తుకు ఆధ్యాత్మిక జగత్తుమూలం భౌతికజగత్తు వ్యక్తికము, సాపేక్షము, ఇంద్రియగోచరము, లభిప్రాయానికి విషయము, పరిణామి, నశ్వరము, విరుద్ధగుణభూయిష్ఠము. ఆధ్యాత్మిక జగత్తు అంటేనో అలాకాదు. స్వయంభువు, సంపూర్ణము వివేకానికి విషయం, అతీంద్రియం, పరిణామరహితం, పారమార్థికం, నిత్యం.

ఈ విభాగాన్ని బట్టి రామణీయకమనేదికూడా రెండు విభాగాలవుతున్నది. (1) అలౌకిక రామణీయకం, (2) లౌకిక రామణీయకం.

అలౌకిక రామణీయం ఏకైకం, స్వయంభువు. సంపూర్ణము, అతీంద్రియము, వివేకైక విషయం. మారేదికాదు. సాపేక్షంకాదు. నిత్యం.

ఈరామణీయకం ఏకైకము. అంటే సత్యం, ధర్మం మొదలైనభావాల కంటె భిన్నమై స్వతంత్రంగా ఉంటుంది. దీనిలో తరతమ భావాలు లేవు.

స్వయంభువు. ఈ రామణీయకం మనఃకల్పితం కాదు. ఈశ్వరకల్పితమూ కాదు. అంటే ఏవిధంగాను ఉత్పాద్యం కాదు. దేశకాల బద్ధమూ కాదు.

రామణీయకం భౌతికం కాదు. అంటే ఇది ఆకృతిలో కాని, రూపంలోకాని, శబ్దంలో కాని, నాదంలోకాని లేదు. అందువల్ల ఇంద్రియగోచరం కాదు. ఇది అతీంద్రియం. రామణీయకం వివేకానికి విషయం అంటే వివేకానికి ఒక్కదానికే గోచరిస్తుంది. ఇది నిరుపాధికం (Nonhypothetical), ఈరమణీయకం మారేదికాదు. అన్ని దేశాలకూ, అందరు వ్యక్తులకూ, అన్నికాలాలకు ఇది ఒకటే. ఒకప్పుడు తరిగేది కాదు, మరొకప్పుడు పెరిగేది కాదు.

రామణీయకం ధర్మం మీదకాని, సత్యంమీదకాని, మరొకభావం మీదకాని ఆధారపడటంలేదు, ఇది కేవలం నిరపేక్షము. స్వయం ప్రకాశము.

లౌకిక రామణీయకం ప్లేటో మతంప్రకారం రెండుభాగాలౌతుంది. ఒకటి ప్రకృతిసిద్ధ రామణీయకం. రెండు మానవకల్పితరామణీయకం ప్రకృతి సిద్ధరామణీయకం అలౌకిక రామణీయకానికి అనుకరణం. ఈ అనుకృతికి కల్పిత రామణీయకం అనుకృతి.

అయితే లౌకిక రామణీయకలక్షణ మేమిటి? ఇది 1. వ్యక్తికము. 2. సాపేక్షము. 3. ఇంద్రియగోచరము. 4. అభిప్రాయానికి విషయము. 5. పరిణామి. 6. నశ్వరము. 7. విరుద్ధగుణభూయిష్ఠము. 8. అసంపూర్ణము. 9. అవివేకవంతము. 10. సోపాధికము.

ఈ లౌకిక రామణీయకం అనేకము. రమణీయ భవనాలు, రమణీయ విగ్రహాలు, రమణీయ గానం, రమణీయ కావ్యం, రమణీయచిత్రం ఇలా అనేకంగా ఉంటుంది. ఈ రామణీయకం చక్షుష్కర్ణగోచరం. సాపేక్షం. ఇందులో తరతమభావాలున్నాయి. ఇది పరిణామి. సత్యం, ధర్మం, వికారం మొదలైనవాటికికూడా ఇందులో ప్రసక్తి ఉంటుంది. దీనికి ప్రయోజకతాప్రయోజకతలున్నాయి. ఈరామణీయకం నశ్వరం.

మానవకల్పిత రామణీయకానికి కూడా ఇవే లక్షణాలు. అయితే ప్రకృతి సిద్ధరామణీయకం దీనికంటె ఉత్తమం. ఎందుకంటే ప్రకృతిసిద్ధరామణీయకం యథార్థతరం, ప్రయోజనకారి. మానవకల్పిత రామణీయకమంటేనో అనుకృతికి అనుకృతి. అందువల్ల అయథార్థం, అవివేక ఉద్బోధకం. అందువల్ల మానవకల్పితరామణీయకం, అవివేక ఉద్బోధకం త్యాజ్యంఅని ప్లేటో విషేధిస్తాడు.

ఈ సిద్ధాంతాలను దృష్టిలో ఉంచుకొని ప్లేటో వాద మనుసరిస్తే తేలికగా అర్థమౌ తుంది.



★ ఏవి రమణీయవస్తువులు? రామణీయకమంటే ఏమిటి? వివేకం కలిగినవారిని వివేకవంతులంటున్నాము. మంచితనం ఉన్నవాళ్ళను మంచివాళ్ళంటు న్నాము. కాబట్టి వివేకం మంచితనం ఉన్నాయి. అలాగే రామణీకం కలిగిన వస్తువులను రమణీయ వస్తువులంటున్నాము. అంటే రామణీయకమనేది ఒకటి ఉన్నది. అయితే ఏమిటి ఈ రామణీయకం? దేనిని రామణీయక మంటున్నాము?

అందమైన కన్య రామణీయక మనవచ్చును. కాని కన్య ఒక్కటేనా రామణీయకం? అశ్వాలు, గోవులు, వీణలు, భాండాలు రమణీయాలు కావా? రామణీయార్థాలు ఎన్నో ఉన్నాయి. కాని వీనిలో తరతమ భావాలుంటున్నాయి. రమణీయ కాంతలతోను, అశ్వాలతోను, వీణలతోను పోల్చిచూచినప్పుడు భాండాలు రమణీయాలు కావు. అత్యంతరమణీయమైన కోతిని మానవునితో పోల్చిచూచినప్పుడు వికారంగా ఉంటుంది.

---

★ Hippias Major ఈకృతి నిజంగా ప్లేటోదేనా అన్న విషయంలో సందేహాలు సూచించారు. కాని విషయాన్ని బట్టి చూస్తేమాత్రం ప్లేటో వాదమే కనిపిస్తుంది A E Taylor మొదలైనవారు ప్లేటోదిగా అంగీకరించారు.

భాండాలను కాంతలతో పోల్చి చూచినప్పుడు వికారంగా ఉంటాయి. ఈ కాంతలనే వేశ్యలతో పోల్చి చూచినప్పుడు చాల వికృతంగా ఉంటారు.

ఇంతకూ అసలు ప్రశ్న అలాగే ఉంది – ఏది పారమార్థిక రామణీయకం? దేని ఉనికివల్ల వస్తువులు రమణీయాలౌతున్నాయి? కన్య కావటంవల్లనా? లేక వీణ కావటంవల్లనా? కాక అశ్వం కావటంవల్లనా?

మెరిసేదీ, కష్టనిదీ స్వర్ణం. దీనిని కోరనివాళ్ళు ఉండరు. దీని సంయోగంతో ఎలాంటి వికారవస్తువైనా రమణీయమౌతుంది. వికారంగా కనిపించేది కూడా రమణీయంగా కన్పిస్తుంది అనవచ్చును.

ఆలెక్కలో శిల్పి ఫీడియస్ అనేశిల్పి (Phiodias) తెలివిః క్కువవాడు కావాలి. ఎందుకంటే అతడు " ఎథీనా" సుందరీప్రతిమ కన్నులను బం గారంతో చేయలేదు. ముఖం కాని కరచణాలు కాని బంగారంతో చేయలేదు. కేవలం దంతంతో చేశాడు. దంతంకూడా రామణీయకమేనంటే నేత్ర గోళంకూడా ఆ దంతంతోచేసి ఉండవలసింది. కాని అతడు అలా చేయలేదు. దంతచ్ఛాయ కలిగిన రాతితో చేశాడు. అతడు అలా ఎందుకు చేయాలి? రమణీయశిలకూడా రామణీయకమేనా?



ఔచితి ఉంటే, రాయికూడా రామణీయకమే అనవచ్చును. ఈ లెక్కలో అనౌచిత్య వికృతి అన్నమాట. కాబట్టి ఔచితి ఉన్నప్పుడే స్వర్ణదంతములు వస్తువులను రమణీయాలుగా చేస్తున్న వన్నమాట. అందువల్ల ఔచితి ఏ వస్తువునైనా రమణీయం చేయాలి.

సరే, బాగానే ఉంది. తొర్రిమొర్రికుండలో ఒక విర్భాగ్యు( ) వంట చేస్తుంటాడు. దానికి తగింది, ఉచితమైనది బంగారుతెడ్డా? కొయ్యతెడ్డా? కొయ్యతెడ్డుతో వంటకానికి కొంత రుచిరావచ్చును. బంగారు తెడ్డుతో అసలు కుండకే వ ప్పురావచ్చును. కాబట్టి తొర్రి మొర్రి కుండకు కొయ్య తెడ్డు ఉంటే రమణీయమౌతుంది. కాబట్టి వంగలేని అత్తకు లేవలేని కోడలు, కుంటివానికి గ్రుడ్డిపెళ్ళాము ఉండటం రామణీయకం. అంతేనా?

అది అలా ఉంచి మనకు ముఖ్యమైన విషయం విచారింతాము. మనకు కావలసింది ఏమిటి? ఎవరికీ, ఎప్పుడూ వికారం కాని రమణీయ విషయం కావాలి.

ఈమాట అనగానే ఒకటి స్ఫురించవచ్చును.

"కేదారమునుండి పాలింటి కేతేర బహుధాన్యములు చేలబండియొరగ

నెడనెడ బొండ్లెడ్లు నడుగులు వాడమ గృహాట్టప్రాంగణ మధ్యమంచు [illegible]

---

జి.వి. కృష్ణారావు

ఒరివారి కాకోటి పనిపాటు వాటెంప జల్లంపు సందడి పెట్టుకొనగ
గ్రామ మెంతయు నిజప్రాపమున్మన మన పత్యసిష్ఠకు ఉన్న సాక్షిగోర॥

పుత్రార్థాయుష్షం కలిగి గతించిన తల్లిదండ్రులకు కర్మలు చేస్తూ తుదికి కొడుకుచేతి మీదుగా వెళ్ళిపోవటం రమణీయం. ప్రతివాడూ దీనికి ఒప్పుకుంటాడు. ప్రతియుగం దీనికి హర్షిస్తుంది, అని అనుకోవచ్చును

నిజంగా ఇది అందరికీ, అన్ని కాలాలకూ రమణీయంగా ఉంటుందా? బ్రహ్మకూడా ఇదే కోరుకుంటాడా? తన తల్లిదండ్రులకు, అంటే లక్ష్మీ నారాయణులకు తిలోదకాలు వదలుతూ, చివరికి వారదాది పుత్రులచేతి మీదుగా పోవాలనుకుంటాడా? ఇది ఘోరం. దేవతలపట్ల అపచారం. ఇది అందరికీ అన్ని కాలాలకూ రమణీయం కాదు. మనకు కావలసినది. ఎలాంటి బాధాలేని రామణీయకం. అంటే దేని ఉనికివల్ల రాయి, రప్ప, చెట్టు, పుట్ట, కాడికర్ర, మనుష్యులు, దేవతలు, కర్మలు, జ్ఞానాలు సమస్తమైన వారికి సర్వకాలాలకు రమణీయ మౌతున్నవి? ఏది పారమార్థిక రామణీయకం?

ఇంతకుముందు ఔచితివల్ల వస్తువులు రమణీయాలవుతున్నవన్న ప్రస్తావన వచ్చింది. అయితే ఈ ఔచితి వస్తువులను నిజంగా రమణీయం చేస్తుందా? లేక రమణీయాలవలె కనపించేటట్టు చేస్తుందా? లేక ఈ రెండు పనులూ చేయదా? స్వభావానుసారంగా ఉన్నదానికంటె వస్తువులను ఔచిత ఎక్కువ రమణీయాలు చేస్తుందంటే, అది ఒకవిధమైన రామణీయక ఆభాసమేకాని రామణీయకం కాదు. అలాంటి ఆభాసం మనకు అవసరం లేదు, అనివార్యమూ కాదు. మనకు ముఖ్యం ఒక్కటే. దేనివల్ల రమణీయ వస్తువులు రమణీయంగా ఉంటున్నాయి? పెద్దవస్తువులు పెద్దతనం ఎందులో ఉన్నది? అంటే పరిమాణంలో ఇతర వస్తువులను అతిశయించి ఉన్నవి కాబట్టి, పెద్దవంటున్నాము. అలాగే దేనివల్ల రమణీయ వస్తువులు రమణీయంగా ఉంటున్నాయి? ఔచితివల్ల రమణీయ వస్తువులు రమణీయంగా ఉన్నాయి అనటానికి వీలులేదు. ఎందుకంటే దానివల్ల వస్తువులు నిజంగా ఉన్నదానికంటె ఎక్కువ రమణీయాలు అవుతాయి.

అలా కాదు. ఔచితి వస్తువులను యథార్థంగాను, ఆభాసికంగాను రమణీయం చేస్తుందని అంటామేమో. ఆ పక్షంలో వివిధ ఆచారాలు, జీవిత సరణులు మొదలైన యథార్థరమణీయ వస్తువులను రమణీయాలని అన్ని కాలాలలోను అందరు మానవులూ భావిస్తున్నారా? వీని రామణీక విషయంలో వ్యక్తులు, సంఘాలు వివాదపడటం లేదా? నిజానికి రామణీయ వస్తువులను గుర్తించకపోవటం జరుగుతున్నది. వస్తువులు యథార్థంగా రమణీయాలైపైకికూడా అలా కనిపిస్తున్న పక్షంలో అలాంటి వివాదాలు రావటానికి వీలులేదు. ఔచితయే

రామణీయమైన వస్తువులను యథార్థంగా రమణీయాలను చేసి పైపైకూడ రమణీయాలవలె కనిపించేటట్లు చేస్తే అంతా దానిని గుర్తించి ఉండేవారు. అప్పుడు వివాదాలు ఉండేవికావు. కాని అలా జరగుటంలేదు. పైగా ఒక్కటే అటు యథార్థ రామణీయానికి ఇటు తదాభాసకు కారణం కాజాలదు. కాబట్టి ఔచితి వస్తువులను యథార్థంగాను, ఆభాసికంగాను రమణీయం చేయజాలదు.

కాగా ఔచితి రామణీయకం కాదు.

వినియోగపడే వస్తువులను రమణీయాలందామా? ఆ పక్షంలో వినియోగమే రామణీయక మౌతుంది. ఇది కొంత బాగున్నదేమో? ఎందుకంటే, గ్రుడ్డికన్నును రమణీయమనలేము. అలాగే రోగగ్రస్తమై పని పాటలకు వినియోగపడని శరీరం కాని, పరుగెత్తలేని గుర్రాన్ని కాని రమణీయమంటామా! లేదు. రమణీయాశ్వం, రమణీయకుక్కటం, వస్తువులు, వాహనాలు, నౌకలు, వీణాదిపరికరాలు, రమణీయాలంటున్నాము. వినియోగపడనివాటి నంటున్నామా? ఇలాగే సంస్థలు, జీవితపథాలు రమణీయాలంటున్నాము. వీటి పుట్టుపూర్వోత్తరాలు, ఒక్కొక్కదాని స్థానం విచారించి వినియోగపడేదైతే రమణీయ మంటున్నాము. వినియోగపడనిదైతే



వికారమంటున్నాము.

ఈ పక్షంలో వినియోగసామర్థ్యం రామణీయక మౌతున్నది; అసామర్థ్యం వికారమౌతున్నది. ఈపక్షంలో వివేకం అత్యంతరమణీయం, అవివేకం అత్యంతవికారం కావాలి.

దుష్టకార్యాలకు వినియోగపడే వస్తువులను రమణీయాలంటున్నామా? లేదు. అలా ఎప్పుడూ అనలేము. కేవలం సద్వినియోగ సామర్థ్యమే రామణీయక మంటున్నాము. సామర్థ్యము, వినియోగము ఉండి ప్రయోజనం లేదు. అది శ్రేయస్కరం కావాలి, దానికి తోడ్పడాలి. అప్పుడే అలాంటి వస్తువు రమణీయమౌతున్నది. రమణీయశరీరాలనీ, రమణీయపథాలనీ, రమణీయవివేకమనీ అంటున్నామంటే లాభదాయకాలు కాబట్టి అంటున్నాము. ఈపక్షంలో లాభదాయకత్వము రామణీయకం కావాలి. అయితే లాభదాయకమనేది ఏదో ఒక శ్రేయస్సు కలిగించాలి. అప్పుడు రామణీయకం శ్రేయస్సుకు, ధర్మానికి కారణం కావాలి. ధర్మం కార్యం అవుతుంది. ఋజుత్వం, సద్గుణపుంజం రమణీయాలంటున్నామంటే అవిధర్మం, శ్రేయం కలిగిస్తున్నాయి కాబట్టి రమణీయా లంటున్నామన్నమాట. వారికి అందుకే అంతగా స్థానమిస్తున్నా మన్నమాట. ఇదే నిజమైతే, రమణీయవస్తువు ధార్మికమైన దానికి జనకమౌతున్నది. ఆ పక్షంలో రామణీయకం కారణమై

ధర్మం కార్యమౌతున్నది. అయితే ఎంద్రి తండ్రియేకాని కొడుకు కానట్లుగా, కారణము కారణమే కాని కార్యం కాజాలదు. కారణము కార్యమూ కాదు. కార్యము కారణమూ కాదు.

కాబట్టి రమణీయమైనది ధార్మికమూ కాదు. ధార్మికమైనది రమణీయమూ కాదు. కాగా ధర్మానికి కారణమైన లాభదాయకత్వం కాని, వినియోగత్వంకాని, సామర్థ్యం కాని రామణీయకం కాదు.

అలాకాదు. చక్షువుద్వారాకాని, కర్ణంద్వారాకాని సుఖం, లేక సంతోషం కలిగించే వస్తువును రామణీయక మందామా? అంటే బాధలున్నాయా? ఉంటే అవి ఏమిటి? రమణీయ పురుషులు, రంగుల నమూనాలు (Colour Patterns), చిత్రాలు, విగ్రహాలు చూచినప్పుడు మనకు సుఖం, సంతోషం కలుగుతున్నది. రమణీయకంఠాలు, సంగీతం పద్య కవిత్వం, గద్యకవిత్వం, కథలు విన్నప్పుడుకూడా అలాగే సంతోషం కలుగుతున్నది. కాబట్టి చక్షుశ్శ్రవణంద్వారా సంతోషం లేక సుఖం కలిగించేదానిని రామణీయక మందామా?

కొందరు ఇలా అనవచ్చును:- అనేక ఇంద్రియాలవల్ల సుఖం లేక సంతోషం కలుగుతున్నదికదా? అలా సుఖం కలిగించేవాటి అన్నిటిలోను కేవలం చక్షుశ్శ్రవణంద్వారా సుఖం కలిగించేవాటికే రామణీకయమని ఎందుకనాలి? ఆహారవిహారాదులవల్ల పానీయాలవల్ల సంభోగాదికంవల్ల సుఖం, సంతోషం కలుగుతున్నదికదా? అలాంటప్పుడు దృశ్యతారమణీయాలు, శ్రవ్యతారమణీయాలు మాత్రమే రామణీయకమని తతిమ్మా వాటిని ఎందుకు వెలివేయాలి? ఆహారవిహారక్రీడలు సుగంధాలు మొదలైనవి సంతోషమిచ్చేవే. సుఖం కలిగించేవే. కాని వాటిని రామణీయకమంటే నవ్వు వస్తుంది. ఇలాంటివి సంతోషదాయకాలే, సుఖకరాలే. సంభోగసుఖం గొప్పదేనని అంతా ఒప్పుకొంటారు. కాని అది ఏకాంతంలో అనుభవించవలసినదేకాని బాహాటంగా మాత్రం కాదు. బాహాటంగా జరిగితే చాలా అసభ్యంగా ఉంటుంది.

ఇలా సమాధానం చెబితే పృచ్ఛకుడు ఇలా అనవచ్చును:- ''అయితే మీరింతసేపూ అధికసంఖ్యాకులు ఒప్పుకోక నవ్విపోతారన్న భయంతో కొన్ని ప్రత్యేక సుఖాలను, సంతోషాలను మాత్రమే రమణీయాలంటున్నారన్నమాట లోకంలో ఎక్కువమంది ఏది రామణీయకమని భావిస్తున్నారో చెప్పమని నేను కోరటంలేదు. అసలు యథార్థంగా రమణీయమైనది ఏది?'' అని అడుగుతున్నాను.

చక్షుష్కర్ణంద్వారా సుఖం కలిగించేవే రమణీ [illegible]
అప్పుడు ఒక సందేహం వస్తున్నది.

కేవలం చక్షుస్సుద్వారా సంతోషంకలిగించే వస్తువులు చక్షుష్కర్ణం ద్వారా సంతోషం, సుఖం కలిగించే వస్తుకోటిలో చేరవుకదా? అప్పుడు అవి రమణీయకం కాదుకదా అలాగే కేవలం కర్ణంద్వారా మాత్రమే సంతోషం, సుఖం కలిగించే వస్తువులు కూడా రామణీయకం కాదుగదా అన్న సందేహం వస్తుంది. ఈ రెండింద్రియాలలో ఒక ఇంద్రియంద్వారా సుఖకరమైనది ఈ ఉభయ ఇంద్రియాలద్వారా సుఖకరం కానిమాట వాస్తవం ఈ రెండుసుఖాలలో ప్రతి ఒక్కటీ తనకు తాను రామణీయకం కాబట్టి రెండూ రామణీయకమే.

సరే, అంతవరకూ బాగానే ఉన్నదందాము. మీరు చెప్పినట్లుగా కంటి ద్వారా సుఖం కలిగించేవీ ఉన్నవి. చెవిద్వారా సుఖం కలిగించేవీ ఉన్నవి. ఇలాగే తతిమ్మా ఇంద్రియాల ద్వారా సుఖం కలిగించేవీ ఉన్నవి. అయితే ఈ సుఖంలో భేదాలున్నాయి. అంటే విభిన్న ఇంద్రియాలద్వారా కలుగుతున్న సుఖంలో తారతమ్యాలు ఉన్నవా లేవా అని అడగటం లేదు. కాని ఒకటి సుఖమై మరొకటి కాకపోతున్నదా? లేదు. అన్నీ సుఖం కలిగించేవే.

దీనినిబట్టి ఒకటి తేలుతున్నది. దృశ్యతారమణీయాలు, శ్రవ్యతా రమణీయాలు రామణీయక మంటున్నమంటే సుఖం కలిగిస్తున్నవి కాబట్టి రామణీయక మనటంలేదు. వాటిని రామణీయక మంటున్నామంటే, తతిమ్మా సుఖకరాలనుంచి వేరుపరచే ప్రత్యేకలక్షణ మేదో ఒకటి ఉండాలి. దృశ్యతాసుఖం కేవలం దృశ్యతవల్ల కలుగుతున్నది కాబట్టి రమణీయ మనటంలేదు. దృశ్యతవల్ల కలిగే సుఖము ఒక్కటే రామణీయకమనేటట్లయితే, శ్రవ్యతద్వారా కలిగే సుఖం రామణీయకం కాకపోవాలి. ఎందుకంటే అది దృశ్యతద్వారా లభించటం లేదు. శ్రవ్యతాసుఖం రామణీయకమంటే పై విధంగానే దృశ్యతాసుఖం రామణీయకం కాకపోవాలి. అయినా రెండూ రామణీయక మంటున్నాము కాబట్టి రెంటినీ రమణీయం చేసే సామాన్యలక్షణం ఒకటి వాటి రెంటిలోను ఉండాలి. అలా కానిపక్షంలో ప్రతి ఒకటీ కాని, రెండూ కాని రామణీయకం కాజాలవు.

రమణీయవస్తువులలో దృశ్యతారమణీయాలు, శ్రవ్యతా రమణీయాలు మాత్రమే రామణీయకమని వేరు చేస్తున్నాయి. ఇలా వేరుచేస్తున్నా ఈ రెండు సుఖాలలోను ఉన్న రామణీయకాన్ని ఎలా నిర్వచించాలి? ఈ రెండు సుఖాలు నిరపాయాలు. సుఖాలన్నిటిలోను ఇవి ఉత్తమాలు. ఇది రెంటికీ, ప్రతి ఒకదానికి అన్వయిస్తుంది. అయితే యింతమా రామణీయకమంటే లాభదాయకమైన సంతోషమనేనా నిర్వచనం? ఆ పక్షంలో ఇంతవరకు మనం చెప్పుకొన్నట్లు లాభదాయకమంటే ధర్మప్రతిపాదకమనీ, రామణీయకం

సుఖమైనా, ధర్మం కార్యానికి హేతువయి, కారణకార్యములు వేరనీ సిద్ధిస్తున్నవి కాబట్టి మళ్ళీ మొదటికే వస్తున్నామన్నమాట. అంటే రామణీయకం ధర్మంకాదనీ, ఈ రెంటిలో ప్రతి ఒక్కటీ రెండవదానికంటె భిన్నమనీ ఇదివరకే తేలిపోయింది.

ఈ పర్యాలోకనంతో ఏమి తేలింది? రామణీయకమంటే శిలాదంతసువర్ణాదికద్రవ్యం కాదు. ఔచితి కాదు. ప్రయోజనం కాదు. సామర్థ్యం కాదు. ప్రయోజన సామర్థ్యం అంతకన్నా కాదు. ధర్మం అసలే కాదు. సుఖసంతోషాలు అంతకన్నా కావు. అయితే ఇది ఒక నిర్వచనమేనా? రామణీయకమంటే ఏది కాదో చెప్పటం జరిగింది కాని, ఏమిటో నిర్వచించటం జరగలేదు. కాబట్టి ప్లేటోకు రామణీయకమంటే ఏమిటో తేలలేదు. అతడుకూడ సందిగ్ధావస్థలోనే ఉన్నాడనిపించవచ్చు. కాని అది పొరపాటు. అతనికి రామణీయకమంటే ఏమిటో ఒక నిర్దిష్టాభిప్రాయం ఉంది. ఆ అభిప్రాయాన్ని ప్రతిపాదించటానికే పైని పేర్కొన్న చర్చ సాగించాడు.

అతని మతంప్రకారం రామణీయకం భౌతిక పదార్థంకాదు. అది కేవలం ఒక భావం. ఈ భావం స్వతంత్రం. ఇది మానవకల్పితమూ కాదు, ఈశ్వర కల్పితమూ కాదు. ఇది జీవాత్మ కాదు, పరమాత్మ కాదు. నిత్యము తారతమ్యవిరహితమూ, స్వయంభువు అయిన భావం.

ఈ అర్థమే ప్లేటో సింపోజీయంలో ఇలా వివరించాడు:– '' ఈ రామణీయకం నిత్యం దీనికి ఆద్యంతాలు లేవు. ఇది ఉత్పన్నం కాదు. నష్టం అంతకన్నా కాదు. ఈ రామణీయకం ఒకవిధంగా రమణీయమై మరొకవిధంగా వికారంగా కనిపించేదికాదు. ఇది ఒకకాలంలో, ఒకచోట, ఒకదృష్టికి రామణీయకమై మరొక కాలంలో, మరొకచోట, మరొక దృష్టికి వికారంగా కనిపించేది కాదు. ఈ రామణీయకం ద్రష్టలమీద ఆధారపడి లేదు. ఈ రామణీయకం ముక్కు గాదు, ముఖం కాదు. రక్తమాంసాలతో కూడిన శరీరం కాదు. వాక్కు కాదు. విద్యాగ్రహణం కాదు. దాని సత్తా ప్రాణిలో కాని, పృథ్విలోకాని, ఆకాశంలో కాని లేదు. మరేజీవిలోను ఉండేది కాదు. దాని కేవలసత్తా ఏకైకమై తనలోతాను ఉంటుంది. ఈ రామణీయకం యొక్క లక్షణాలను పొంది వస్తువులు రమణీయాలవుతున్నవి. ఇలాంటి రమణీయవస్తువులు పుడుతూ గిడుతూ ఉంటాయి. అయితే, పారమార్థికమైన రామణీయకం తరగదు, పెరగదు. వికారంలేక పరిణతి అంతకన్నా పొందదు.''

అయితే ఇలాంటి పారమార్థిక రామణీయకం నుంచి లౌకిక రామణీయకం ఎలా అవతరిస్తుందో చూదాము.

★ Republic, Chap 10

## లౌకిక రామణీయకం

* దానిని ఈశ్వరాభివ్యక్తమని చెప్పుకొన్నాము. దీనికి భౌతిక ప్రపంచంలో అనేక విధాలైన ఆభాసాలున్నాయి. ఉదాహరణకు గృహమును తీసికొందాము. గృహభావం ఈశ్వరాభివ్యక్తం ఈ భావాన్ని లనుసరించి వాస్తుజ్ఞుడు ప్రయోజనంకోసం గృహం నిర్మిస్తున్నాడు. చిత్రకారుడు భౌతికగృహాన్ని అనుసరించి గృహచిత్రం గీస్తున్నాడు. ఇక్కడొక విశేషముంది. వాస్తుశాస్త్ర నిర్దిష్ట విషయాలను మాత్రమే నిర్మిస్తాడు. చిత్రకారుడు అలా కాదు. ఇతర వృత్తులవారు చేసే వస్తువులన్నీ సృష్టిస్తున్నాడు. అతడు మనుష్యులనేకాదు, తరు లతాదులనే కాదు, ప్రాణికోటినే కాదు, సమస్త విషయాలనూ సృష్టిస్తున్నాడు. మూడులోకాలను, తుదికి దేవతలనుకూడ సృష్టిస్తున్నాడు.

ఇలాంటి పని కష్టతమ మనిపించవచ్చును. కాని నిజానికి ఇలాంటిపని సులువుగా తొందరగా చేయటానికి అనేక మార్గాలున్నాయి. వాటన్నిటిలో మరీ సులువైనది మరొకటి ఉంది. అద్దం నలుమొగాల తిప్పితేసరి, భూమ్యాకాశాలను, సూర్యుణ్ణి తరులతాదులను, మానవులను తేలికగా సృష్టించివేయవచ్చును. అయితే యిలా సృష్టమైనవన్నీ ఆభాసాలే. కవి, చిత్రకారుడు ఈ ఆభాసాలనే తయారుచేస్తారు. వీరిచే సృష్టమైనదంతా అయథార్థం.

224 ఇప్పటికి మూడురకాల సృష్టులు కనిపిస్తున్నాయి. 1. ఈశ్వరాభి వ్యక్తమైన గృహభావాదికం, 2. వృత్తికారసృష్టి అయిన గృహాదికం, 3. కళాస్రష్ట సృష్టి అయిన గృహచిత్రాదికం. మొదటిది యథార్థం. రెండవది మొదటిదాని ఆభాసము. మూడోది రెండవదానికి అనుకరణం. కాబట్టి మూడవదైన కళాసృష్టి యాథార్థ్యానికి మూడింతలు దూరమౌతున్నది.

## వ్యావహారిక జగత్తు - కళాసృష్టి

ఇంతకూ కళాస్రష్ట అనుకరణం సత్యాన్ని అనుకరించటం లేదు. కేవలం ఆభాసాన్ని అనుకరిస్తున్నది. వ్యావహారికశయ్య ఒకటి ఉన్నదనుకోండి. దానిని భిన్న భిన్న స్థానాల నుంచి, భిన్న భిన్న దూరాలలో ఉండి చూస్తే ఆ ఒకేశయ్య భిన్నభిన్న ఆకృతులలో గోచరి

* ఈ అర్థమే పండితరాయలుకూడా ప్రతిపాదించాడు :-

"విభావాదీనామపి స్వప్నతురగాదీనామివ, రంగరజతాదీనామివ సాక్షిభాస్యత్వ మవిరుద్ధమ్."

(రసగంగాధరం, ప్రథమాననం 26 పే.)

ఇది సిద్ధాంతమైతే బొశాంకో పేర్కొన్నట్లు సంగీత సాహిత్యకళల యథార్థ్యం విలువ పూర్తిగా అపకృష్టమౌతుంది.

---

జి.వి.కృష్ణరావు

స్తుంది. (కళాస్రష్ట ఆ భిన్నత్వాలనే చిత్రిస్తున్నాడు. కాని, ఏకంగా ఉన్న ఆ వ్యావహారిక శయ్యను చిత్రించటంలేదు.) అందువల్లనే కళాస్రష్ట కేవలం ఆభాస మనుకరిస్తున్నాడని చెప్పాలి * అతడు ఇలా కేవలం అభాసాలను అనుకరిస్తూ ఉండటం వల్లనే అన్ని వస్తువులను సృష్టించగలుగుతున్నాడు. కమ్మరిని, వడ్రంగిని మొదలైన వారినంతా సృష్టిస్తున్నాడు. కాని వారి వృత్తులలో ఒకటికూడ అతనికి తెలియదు. అయినా అతని బొమ్మలనుచూచి పిల్లలు తెలియనివాళ్లు నిజంగా వడ్రంగిని కమ్మరిని చూస్తున్నా మనుకొంటున్నారు. చిత్రకారుడు సర్వజ్ఞుడని భావిస్తున్నారు. కాని ఇలా అనుకొనే వారికి జ్ఞాన అజ్ఞాన అనుకరణాల స్వరూపం తెలియదు.

కవి చిత్రగారాదులు అనుకరిస్తున్నారే అనుకొన్నా, అలా అనుకరించటానికైనా జ్ఞానం కావాలి కదా అనవచ్చును. కాని బింబము, ప్రతి బింబమూ సృష్టించగలిగినవాడు ప్రతిబింబ సృష్టిలో ఎందుకు నిమగ్నుడౌతాడు? జీవితానికి మరొక పరమార్థం లేనట్లుగా అనుకర ణమే ప్రధానంగా ఎందుకు చూచుకొంటాడు?

అసలు అనుకరణస్వరూపం తెల్చుకొంటే కళాస్రష్ట సృష్టిసంగతి తేలుతుంది. అనుకరణం రెండువిధాలు: (1) దివ్యము, (2) మానవము. ఈశ్వర సృష్టి దివ్యము. మనుజుడు చేసే సృష్టి మానవం. దివ్యసృష్టి భౌతికవస్తువులను అపేక్షించదు. మానవసృష్టి అలాకాదు భౌతిక వస్తువుల మాతనసంయోగంతో జరుగుతుంది. దివ్యమూ మానవమూ అయినసృష్టి తరిగి రెండు విధాలు. (1) యధార్థం, (2) అయధార్థం. ప్రకృతి సిద్ధవస్తువులు, భూ సముద్రాదులు, తరు లతాదులు, పశుపక్ష్యాదులు యధార్థ దివ్య సృష్టిలోనివి. స్వప్నాలు, వెలుగువల్ల ఏర్పడే నీడలు, మణిదర్పణాదులందు గోచరించే ప్రతిబింబాలు అయధార్థదివ్యసృష్టిలోనివి. గృహరామాదికములు యధార్థ మానవ సృష్టిలోనివి. సంగీత సాహిత్యాదిక సృష్టి అయధార్థ మానవసృష్టిలోనిది.

అయాధార్థమానవసృష్టి తిరిగి సదృశము, అసదృశము అని రెండు విధాలు. ఈ సదృశసృష్టిలోని ప్రతిబింబాలు బింబం ఏనిష్పత్తిలో, ఏరంగులో, ఎలా ఉంటుందో అలాగే ఉంటాయి. అసదృశసృష్టిలో అలాకాదు. ఉదాహరణకు శిల్పిచెక్కే బృహద్వి గ్రహమే తీసికొందాము. ఈ విగ్రహము అవయవాలు ప్రకృతి సిద్ధంగా ఉండే పరిమాణంలో ఉండవు. అలా ఉండకపోగా ప్రకృతి సిద్ధమూర్తి అవయవాలు ఏ నిష్పత్తిలో ఉంటాయో ఆ నిష్పత్తిలోనైనా ఉండవు. విగ్రహం క్రింద నిలిచి తల పైకెత్తి చూస్తే ప్రకృతి సిద్ధనిష్పత్తి కనుపించేటట్లుగా అవయవ పరిమాణం ఉంటుంది. అంటే విగ్రహాశీర్ష భాగం ప్రకృతిలో ఉన్న నిష్పత్తికంటె లధికంగా ఉంటుంది. ఇది అసదృశం. ఈ అసదృశం

ఉపకరణోత్పన్నమనీ, ఆత్మోత్పన్నమనీ రెండురకాలు. తూలికావీణాది కోత్పన్నాలైన చిత్రరాగసంవా రాదిక ములు మొదటి దాని క్రిందికి వస్తవి. (2) తన్నులానే ఉపకరణంగా వాడుకొని చేసే సృష్టి నటనం (mimicry). ఈ నటనం రెండువిధాలు: 1. తెలిసి చేసేది, 2. తెలియకుండా చేసేది. న్యాయధర్మాదుల యథార్థరూపం తెలియనివాళ్ళు తమ వాక్కర్మలద్వారా తామనుకొనే న్యాయధర్మాదికముల ఆభాసము ప్రదర్శిస్తారు. ఇలా తమకున్న లక్ష్యాన్ని ప్రదర్శించటంలో కొందరు సఫలు లౌతారు. ఇలా తెలియకుండా చేసే నటనానికి ప్రత్యేకమైన పేరు లేదు. కాబట్టి ప్రస్తుతానికి దీనిని వంచకము (Counter feiting) అందాము. ఇలాంటి వంచన చేసేవానికి తనకు యాథార్థ్యం తెలుసునన్న నమ్మకం ఉండవచ్చును. కాని నిజానికి అతనికి తెలియదు. మరొకరకమైన వారికి తమకు తెలియునని నటిస్తున్నది నిజంగా తమకు తెలియదన్న అనుమానం ఉండవచ్చును. ఇలా తెలియదని తెలిసి కూడా చేసేవారు imposters.

మొత్తంమీద అనుకరణం ఇన్నిపోకలు పోతున్నది. ఇలాంటి అనుకరణంవల్ల ఏర్పడుతున్న కళాస్రష్టసృష్టిలో వినియోగానికి వచ్చేది ఏమీలేదు. ఈ సృష్టిలో అనేక విషయాలు ప్రసక్తాలవుతాయి. పురాదివర్ణనలు వైద్యం, సత్పరిపాలనం, జీవితపరమార్థం మొదలైనవి వర్ణితము లౌతాయి. అవి పురాదుల నిర్మాణానికి, రోగ చికిత్సకు, జీవితలక్ష్య నిష్కర్షకు తోడ్పడవు. అసలు అది ఉపదేశకం కాదు.



కాబట్టి కవిచిత్రకారాది కళాస్రష్టలంతా పుణ్యాదిక ప్రతిబింబాలను అనుకరించే వారేకాని సత్యం చెప్పలేరు. చిత్రకారుడు వర్ణాలతో ఆయా ప్రతిబింబాలను అనుకరిస్తు న్నట్లే కవి తన పదాలతో వాటిని అనుకరిస్తున్నాడు. అనుకరించటానికి అవసరమైనంత జ్ఞానమున్మాత్రమే అతనికి ఉంటున్నది. ఆ లయ, Mellody, ఛందస్సు, నాదము, పదగత వైచిత్రి తీసివేసి వచనంలాగా చేస్తే అసలురూపమేమిటో బోధపడుతుంది. కవుల కథల బండారం బయటపడుతుంది. ముఖం వస్తుతః అందంగా లేకపోయినా యౌవనో దయంతో వికాసం పొందుతున్నట్లుగానే ఛందోలంకారాదినిగ దితమైన కవిత వికాసంకలిగి ఉంటున్నది. యౌవననిర్గమనంతో ముఖం ముడతలుపడి వికారం పొందుతున్నట్లే ఛందోలంకారాదులను తీసివేసి తాత్పర్యైక ప్రధానం చేసిన రచన వికారంగా ఉంటుంది.

పైగా అనుకారికి యథార్థసత్త తెలియదు. ఆభాసాలుమాత్రమే అతనికి తెలుసు.

ప్రతిదాని ఉత్తమత్వం, రామణీయకం, సత్యం అనేది వృత్తికారుడుద్దేశించిన ప్రయోజనం మీద ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు వీణను తీసికొందాము. వీణయొక్క మంచిచెడ్డలు వైణికునికే తెలుసు. ఏ వీణ బాగున్నదో, ఏది బాగుగాలేదో,

ఎలాచేస్తే బాగుంటుందో అతడు వీణ చేసేవానికి చెబుతాడు. అతడు వైణికుని సలహా ననుసరించి వీణ తయారు చేస్తాడు.

వైణికుడు వీణ మంచిచెడ్డలను చెప్పగలిగినట్లుగా కవిచిత్రకారాదులు ప్రయోజనాన్నిబట్టి తమకృతులు సరిగా, అంటే రమణీయంగా ఉన్నవో లేవో చెప్పగలరా? తాము ఏమి వ్రాయాలో దేశికునివద్ద ఉపదేశం పొందితే వారికి సరియైన అభిప్రాయం ఏర్పడుతుందా? లేదు. తమ కృతుల బాగోగులు వారికి తెలియవు. వారికి సరియైన అభిప్రాయమూ ఉండదు.

బాగోగులు దేనివల్ల ఏర్పడుతున్నవో తెలియకుండానే చిత్రకారాదులు అనుకరిస్తున్నారు. దీనినిబట్టి అజ్ఞానంలో మునిగితేలే ప్రజాసామాన్యానికి మంచిదానిలా కనిపించే దానినే వారనుకరిస్తున్నారనుకోవాలి. " ఈ అనుకరణం ఒకవిధమైన క్రీడ, లేక ఆట."

ఈ అనుకరణం మనలోని అభిప్రాయానికి విషయమౌతున్నదే కాని, వివేకానికి మాత్రం కాదు. అనుకృతి నిజంగా అనుకృతిగా ఉంటే అది వివేకానికి విషయం కాదు. బుద్ధికి విషయం కాదు. అభిప్రాయానికి మాత్రమే, అంతేకాదు. ఈ అనుకృతి వీక్షణ శ్రవణములకు మాత్రమే విషయమౌతున్నది[1]. ఈ అనుకృతికి యధార్థం, లేక శివంకరమైన లక్ష్యం లేదు.



కళ అవివేకవతి[2] ఈ అవివేకమే అనుకృతికి అనంతవస్తువైవిధ్యం ప్రసాదిస్తున్నది. వివేకవంతము, ప్రశాంతము, ఉత్తమమైన వృత్తము ఎప్పుడూ ఒకటిగా సమంగా ఉంటుంది. ఇలాంటిది అనుకరణకు దుష్కరం. ఒకవేళ అనుకృతమైనా ఆస్వాదించటం కష్టం. అందులో నానావిధ మనస్తత్వం కలిగిన జన సందోహం నాటకశాలలో సమావేశమైనప్పుడు మరీ కష్టం.

కవి స్వభావం కాని, అతని కళ కాని, ఆత్మలోని వివేకాన్ని తుష్టం చేయటానికి ఉద్దిష్టంకాదు. అతడు ప్రజాసామాన్యం మెప్పుకోసం ప్రాకులాడుతాడు. అందువల్ల తేలికగా అనుకరించటానికి వీలైన ఆవేశాలను అనుకరించటానికి ఇష్టపడతాడు. ఇలాగే చిత్రకారుడు. వీరు మానవునిలోని మనోమాలిన్యాలను రెచ్చగొట్టి వివేకానికి భంగం కలిగిస్తారు. కవి తన రచన ద్వారా మనలోని శోకాన్ని ఎంతగా పొంగించగలిగితే అంతగా

---

1. This imitation is confined to the sight and to the bearing relating in fact to what we term Poetry.

2. Art is irrational

సంతోషిస్తున్నాము. నిజానికి మనకొక కష్టంవచ్చి దుఃఖం కలుగుతున్నప్పుడు దానిని ఎంత అణచివేసికోగలిగితే అంత గర్వపడతాము. ఇలా శోకం దిగమింగటానికి బదులుగా పైకి వెళ్ళబోసికొంటూ దానికి సంతోషించటం హేయంకాదా?

కష్టాలు వచ్చినప్పుడు బావురున ఏడ్చి శోకవిముక్తి పొందాలన్న స్వాభావిక వాంఛ మనలో ఉంటుంది. అయితే ఇది వివేకానికి కట్టుబడి అణగి ఉంటుంది. ఈ వాంఛే కవులవల్ల తుష్టిప్రాప్త మౌతుంది. ఈవాంఛ వివేకంవల్ల సముచితశిక్షణ పొందకపోవటంవల్ల కావి, కలుగుతున్నదుఃఖం మరొకనిదికదా అన్న సానుభూతి వల్లకాని పొంగిపొర్లటానికి అవకాశ మేర్పడుతుంది. ఇతరుడు వచ్చి తన మంచితనం, తనకు వచ్చిన కష్టాలు చెప్పుకొన్నప్పుడు అతనిని ప్రశంసిస్తూ జాలిపడటంలో అవమానకరమైనది ఏమీ లేదని సామాజికుడు అపోహపడుతున్నాడు. ఈ సుఖం ఒకలాభ మనుకొంటున్నాడు. వైముఖ్యం అవలంభించి ఈసుఖాన్ని, కావ్యాన్ని ఎందుకు కోల్పోవాలి అనుకొంటున్నాడు. ఇతరుల అనర్థకాలవల్ల కొంత అనర్థం తనకుకూడా సంక్రమిస్తున్నదన్న పరామర్శం కొలదిమందికికూడా కలగటం లేదు.

ఇదే హాస్యానికికూడా అన్వయిస్తుంది. కొన్ని చతురోక్తులు నీకు నీవు విసరటానికి సిగ్గుపడతావు. అయినా వాటినే రంగభూమినుంచో, మరొకరి నోటినుంచో విన్నప్పుడు వినోదిస్తావు. వాటి అసభ్యతకు అసహ్యించుకోవు. ఇదంతా సానుభూతి ఉన్నప్పుడే జరుగుతుంది. మానవుని తత్త్వంలోనే ఈ హాసం వాసనారూపంగా ఉంది. అయితే ఇతరులు విదూషకుడంటారన్న భయంతో నవ్వం. ఈ విధంగా వాసన వివేకానికి లోనై లోలోనే ఉండిపోతుంది. ఈవాసన నాటకశాలలో దోహదం పొంది నీకు తెలియకుండానే విదూషకుడ వైపోతున్నావు*.

ఇచ్ఛాసుఖదుఃఖవిశిష్టమైన రతిక్రోధాదులు మానవుని ప్రతివ్యాపారంలోను అవినాభావ సంబంధం కలిగి ఉంటున్నాయి. కవిత్వం, కళ ఈ ఆవేశాలను, మనోమాలిన్యాలను అణచివేయటానికి బదులుగా దోహదమిచ్చి పెంపొందిస్తుంది. వీటిని అదుపు ఆజ్ఞలలో ఉంచక స్వేచ్ఛావిహారం చేయనిస్తుంది. మానవజాతి అభ్యుదయం పొందాలంటే, ఈ ఆవేశాలను కంట్రోలు చేయాలి. కాబట్టి దేవతాస్తోత్రాలు ఉత్తమ పురుషుల ప్రశంసలు తప్ప మరెలాంటి కవిత్వాన్ని రాజ్యంలోనికి అడుగుపెట్టనీ గూడదు. అడుగు పెట్టనిస్తే, రాజ్యంలో పెత్తనం చేసేవి సుఖదుఃఖాలే కాని నీతి నియమాలు, వివేకం కావు.

---

* Having stimulated the risible faculty at the theatre, you are betraying unconsciously to yourself into playing the comic part at home.

Republic, Chapt 10

కాబట్టి కవిత్వం సత్య సాధనంగా పరిగణించటానికి వీలులేదు. ఆత్మసిద్ధి పొంద కోరేవాడు చా[illegible]క్యాలకు మోసపోరాదు.

## దివ్యోద్బోధం

ఇంతవరకు లోకవృత్తానుకరణంవల్ల కళాసృష్టి జరుగుతున్నదని చూచాము. అను కరణస్వభావం పరిశీలించాము. అయితే ఈ అనుకరణ క్రియ ఏ అవస్థలో జరుగుతుంది? తత్కృతిస్రష్టవ్యక్తిలో ఏమి జరుగుతుంది? ఈ విషయాలను విశదంగా పరిశీలించాలి.

లయస్కాంతానికి ఇనుపశలాకను ఆకర్షించే దివ్యశక్తి ఒకటి ఉన్నసంగతి మనకు తెలిసినదే. అయస్కాంతాకృష్టశలాకకుకూడా అయస్కాంత శక్తి వ్యాపిస్తుంది. ఆశక్తిచేత అది మరొక శలాకను ఆకర్షిస్తుంది. ఇలా అయస్కాంతమందలి దివ్యశక్తివల్ల శలాకాపరంపర ఆకృష్టమౌతున్నది. అయస్కాంతశక్తి శలాకాధారద్వారా వ్యాపించి ఆకర్షిస్తున్నట్లే సరస్వతికూడ నిజ ఉద్బుద్ధవ్యక్తిద్వారా, తన్మయీభావయోగ్యత ఉన్నవారందరిలోను వ్యాపిస్తుంది. అయస్కాంతంలోని ఆకర్షణశక్తి అయశ్శలాకాధారను ఆకర్షిస్తున్నట్లే కళాస్రష్టలోని సరస్వతీ సముద్బోధంకూడా తన్మయీభావ యోగ్యత ఉన్నవారిని ఆకర్షిస్తుంది. ఈ విధంగా ఒకధారను సృష్టిస్తుంది. ఉత్తమ కావ్యనిర్మాతల కవితాప్రతిభ ఆయా సూత్రాలను అనుసరించటం వల్ల ప్రాప్తించటం లేదు. కేవలం ఉద్బుద్ధావస్థలో ఉండి ఆ రమణీయ శ్లోకాలు, గీతాలు ఆలాపిస్తున్నారు. నిజంగా ఆ స్థితిలో వారిని ఏదో ఒక దేవత ఆవేశించి పలుకుతన్నట్లుగా ఉంటుంది. ఈవిధంగా కవులు 'దివ్యోన్మాదావస్థ'లో ఉండి తమ కావ్యాలను గానం చేస్తున్నారు. ఇలాంటి అతిలోకోద్బుద్ధావస్థలో ఉండి లయసామరస్యాలచే (Rhythm Harmony) ప్రేరితులై వాటిని మనకు అందజేస్తున్నారు. కవులు చెబుతున్నట్లుగా వారి ఆత్మలు పూవుపూవునకు తుమ్మెదలవలె పోతూ, ఆరామశాద్వలాదిస్థలాలలో సంచరించి దివ్యసుధావాహినులందు మునిగి గానమాధుర్యం కొనివస్తాయి. భావనామహిమాన్వితులై వారు సత్యం చెబుతారు. కవికి అతిలోకలాఘవమున్నది, రెక్కలున్నాయి. అతడు దివ్య ప్రకృతి సంపన్నుడు. ఉద్బుద్ధుడు కానంతవరకు, దివ్యోన్మాదం ఆవేశించనంతవరకు, వివేకం ఉన్నంతవరకు అతడు కవితాశబ్దవాచ్యమైన సృష్టి చేయలేడు. వివేకంలో యత్కించిదంశమున్నా అతడు కవిత్వం చెప్పటానికి ఏమాత్రం సమర్థుడు కాడు. హోమర్ మొదలైన కవుల కృతులను గానంచేసేవారు, నటకులు కూడా వృత్తివల్లగాని, శిక్షణవల్లగాని ఆ రామణీయకం అభివ్యక్తం చేయలేరు. ఆ దివ్యోద్బోధం ఎంత గాఢంగా ఉంటే. సరస్వతి ఎంతగా ఆవేశిస్తే కవి గాయకాదుల కవితా గానాదుల రామణీయకం అంత ఉదాత్తంగా ఉంటుంది.

జేగంటలు – ప్లేటో

ఇతరవిషయాలలో కవులు అజ్ఞానులు, అసమర్థులు కావచ్చును. ఎందుకంటే నేర్చిన వృత్తివిద్య ననుసరించి వారు కవిత్వం చెప్పటంలేదు కేవలం దివ్యోద్బోధ ప్రేరితులై పలుకుతున్నారు. విమర్శనసూత్రాల ననుసరించి ఏ ఒకవిషయం మీదనైనా హృదయం గమంగా పద్యాలు చెప్పగలిగితే ఆ సూత్రాలనే ఇతర విషయాలకు కూడా అన్వయించి మనోజ్ఞకవిత్వం చెప్పవచ్చును. కాని అలాంటిది జరగటంలేదు. చూడగా చూడగా ఈశ్వరుడు తన సందేశాలను లోకానికి వెల్లడించటంకోసమని కవులకు, ప్రవక్తలకు, జ్యోతిష్కులకు, ఉద్దేశపూర్వకంగానే బుద్ధి వివేకాలణుమాత్రం కూడ లేకుండ చేసినట్లు కనిపిస్తున్నది. ఉత్తమోత్తమ కావ్యాలు, కృతులు మనుష్య మాత్రకృతాలు కావు; కేవలం దివ్యాలని ఈశ్వరుడు రుజువుచేస్తున్నట్లు కనిపిస్తున్నది. కాబట్టి కవిచిత్రకారాదులు దేవతలకు వ్యాఖ్యాతలు. ప్రతికవి ఒకానొక దేవతచే ఆవిష్టుడౌతాడు.

ఇంతకుముందు అయస్కాంతాకృష్టశలాకా పరంపరనుగూర్చి చెప్పుకొన్నాము. ఆ పరంపరలోని కడపటి లంకె సహృదయుడు; నడిమిలంకె కావ్యగానం చేసేవారు, నటకులు; మొదటి లంకె కవి.

## సుఖదుఃఖాల తత్త్వం

230 ఇంతవరకు కళాసృష్టి సంగతి చూచాము. ఇక కళానుభూతి, అంటే కళాసృష్టియొక్క రూపారికం గోచరించినప్పుడు కలిగే అనుభవం ఎలా ఉంటుందో చూదాము. దీని సంగతి విచారించేముందు సుఖదుఃఖముల స్వరూపాన్ని గూర్చి ప్లేటో అభిమతం తెలుసుకోవాలి.

అతని మతం ప్రకారం నశ్వరము, జడమైన శరీరం, అనశ్వరము చేతనమైన ఆత్మ వేరువేరుగా ఉన్నాయి. వాటి ననుసరించి సుఖదుఃఖాలు కూడా మూడు భాగాలవుతున్నవి: శారీరకములు, మానసికములు, ఉభయములు. ఆత్మ యథార్థమూ, శరీరం అయథార్థమూ అయినట్లు ఈ సుఖ దుఃఖాలు కూడా యథార్థాలు, అయథార్థాలు అవుతున్నవి.

ఈ విభాగం సంగతి తరువాత చూదాము. అసలు సుఖం కాని దుఃఖం కాని ఎలా కలుగుతున్నవి? శరీరంలోని వివిధ పదార్థాలు ఒక నిర్దిష్ట నిష్పత్తిలో ఉంటాయి. ఇలా నిర్దిష్టనిష్పత్తిలో ఉండటమే సామరస్యము. ఈ సామరస్యం చెడినప్పుడు దుఃఖము కలుగుతుంది. ఉదాహరణకు ఒక చిన్న విషయం తీసుకొందాము. శరీరంలో జలం కొంత ఉంటుంది కదా. ఆ ఉన్నకొంతలో కొంత క్షీణిస్తుంది. అప్పుడు మనకు దప్పి అవుతుంది. ఈ విధంగా సామరస్యం చెడటంవల్ల, అంటే జలక్షీణతవల్ల దుఃఖం కలుగుతున్నది. ఈ సామరస్యం తిరిగి నెలకొనటానికి మంచినీరు త్రాగుతామనుకోండి. అంటే

జలపూరణం చేస్తున్నాము. దీనివల్ల సుఖం కలుగుచున్నది. ఇలాగే శీతోష్ణాదులందు కూడా క్షీణతవల్ల దుఃఖము, పూరణంవల్ల సుఖము కలుగుతున్నాయి. ఈ సుఖదుఃఖాలు శరీరంవల్ల కలుగుతున్నా ఈ జ్ఞానం మనస్సు మాత్రమే పొందగలుగుతున్నది. ఈ సుఖదుఃఖాలకు సాక్షాత్తుగా నిమిత్తం శరీరం కావటంవల్ల వీనిని శారీరకాలంటున్నాము.

ఇక మానసిక సుఖదుఃఖాల సంగతి పరిశీలింతాము. శరీరంలోని సామరస్యం ఇకముందు చెడుతుందని మనస్సు ఊహిస్తే అది దుఃఖం. చెడిన సామరస్యం కోలుకుంటుందని ఊహిస్తే అది సుఖం. ఇలా సామరస్య పూరణక్షీణతల ఊహాలు మానసిక సుఖదుఃఖాలవుతున్నాయి.

ఇంతవరకు చెప్పుకొన్న దానినిబట్టి సుఖదుఃఖాలవేవి సామరస్య పూరణక్షీణతలమీద ఆధారపడుతున్నవని తేలిపోయింది. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి దుఃఖరాహిత్యం సుఖంకాదని నిష్పన్నమవుతున్నది. పైగా సుఖదుఃఖ విరహితావస్థకూడా ఒకటి ఉన్నట్లు సిద్ధిస్తున్నది. ఎందుకంటే, సామరస్యం చెడినప్పుడు దుఃఖము, తిరిగి కోల్కొన్నప్పుడు సుఖము కలుగుతున్నవి. సామరస్యం యథాప్రకారంగా ఉంటున్నపుడు ఎలాంటి అవస్థ ఏర్పడుతుంది? అది సుఖమూ కాదు, దుఃఖమూకాదు. కాబట్టి సుఖ దుఃఖవిరహితమైన మధ్యస్థ అవస్థ కావాలి. ఇలాంటి తటస్థావస్థ, లేక మధ్యస్థావస్థ వివేక చోదితమైన జీవితంలో గోచరిస్తుంది.

అయితే జీవితంలో సుఖదుఃఖాలు, తదభావం దేనికదిగా విడివడి ఉండవు. ఉదాహరణకు మనం ఊరికి నడిచివెళ్ళుతుంటామనుకోండి. నడి వేసవికాలం, నాలుక ఆర్చుకపోతూ ఉంటుంది. ఈ నాలుక ఆర్చుక పోవటం శారీరక దుఃఖమేకదా! అయితే మనస్సులో అదే సమయంలో ఒక ఆశ అంకురించవచ్చును. ఇంకా నాలుగడుగులు ముందుకువేస్తే మంచినీళ్ళబావి వస్తుంది. ఆ నీరుకూడా దివ్యం. దప్పిక తీరిపోతుందను కోవచ్చును. ఇలాంటి ఆశ, లేక ఊహవల్ల సుఖం కలుగుతున్నది. ఈ విధంగా ఒకే సమయంలో శారీరకంగా దుఃఖమూ, మానసికంగా సుఖమూ కలుగుతున్నాయి. జీవితంలో కలిగే అనుభవాలలో ఎక్కువభాగం ఇలాంటి సమ్మిశ్రితసుఖాలే. ఎందుకంటే, ఇవి కేవలం సుఖాలు కావు; కేవలం దుఃఖాలు కావు.

## సుఖదుఃఖాల యథార్థతాయథార్థతలు

పైదానినిబట్టి మిశ్రిత సుఖం కాని, మిశ్రితదుఃఖం కాని ఏర్పడటానికి వీలున్నదని చూచాము. అయితే ఇలా ప్రతిద్వంద్వాలతో అనుసరింపబడుతున్న సుఖం కాని, దుఃఖం

కాని యథార్థమా? ఎందుకంటే ఒకే కాలంలో పరస్పర విరుద్ధ అనుభవాలు కలుగుతున్నవి కదా. ఇలా కలుగుతున్న ద్వంద్వంలో ఏది యథార్థం? ఏది అయథార్థం? లేక రెండూ యథార్థాలా? లేక రెండూ అయథార్థాలా?

మానవుడు ఉన్మాదావస్థలో ఉన్నా, జాగ్రదవస్థలో ఉన్నా, స్వప్నావస్థలో ఉన్నా, ఆ అనుభవిస్తున్నది సుఖమైనా దుఃఖమైనా యథార్థమే అనవచ్చును ఒకనికి ఒక అభిప్రాయం ఉన్నదనుకొందాము. ఆ అభిప్రాయం యథార్థమైనా కాకపోయినా అభిప్రాయం కాకపోదు. అలాగే సుఖంకూడా యథార్థమైనా కాకపోయినా సుఖమే. అలాగే దుఃఖం. కాబట్టి సుఖదుఃఖ విషయంలో యథార్థతాయథార్థతల ప్రశ్నే రాదనవచ్చును.

కాని సుఖం సంగతి చెప్పవలసివచ్చినప్పుడు అల్పమనీ, ఉత్కృష్టమనీ విశేషణాలతో పేర్కొంటున్నాము. అలాగే యథార్థము, అయథార్థము అన్న విశేషణాలను కూడా చేర్చటానికి వీలులేదా? ఒక విషయాన్ని మరొక విషయమని అభిప్రాయపడినప్పుడు అది అయథార్థాభిప్రాయమంటున్నాము. అలాగే సుఖానికి విషయమైనదానిలో పొరపడినప్పుడు ఆ సుఖాన్ని అయథార్థసుఖ మనగూడదా? ఈ ప్రశ్న ఒక దృష్టాంతంతో తేలికగా బోధపడుతుంది. ఎన్నికలు జరుగుతుంటాయి. ఒకవ్యక్తి ఏ ఒక ప్రత్యేకపక్షమో నెగ్గితేనే దేశానికి మేలుకలుగుతుందని నిశ్చయించుకొంటాడు. ఆ పక్షం ఎన్నికల్లో నెగ్గగానే సంతోషిస్తాడు. కాని ఆపక్షం అతడు ఆశించినదానికి కేవలం విరుద్ధంగా వ్యవహరిస్తుందే ననుకొందాము. అలాంటప్పుడు అతని సుఖం అయథార్థం కదా?

కాబట్టి సుఖదుఃఖాలకు యథార్థతాయథార్థతలు ఉంటున్నాయి. ఉన్నప్పుడు వాని యథార్థతాయథార్థతలు దేనిమీద ఆధారపడుతున్నవి?

ఇంతకుముందు మానసిక సుఖదుఃఖాలు మనోనిశ్చయం (Judgement) మీద ఆధారపడుతున్నవని చెప్పుకున్నాము. ఈ నిశ్చయం యథార్థమైతే దానివల్ల కలిగే సుఖదుఃఖాలుకూడా యథార్థాలు. అయథార్థమైతే అవికూడా అయథార్థాలు. ఇంతకూ నిశ్చయం ఎలా కలుగుతున్నది? దాని యథార్థతాయథార్థతలు ఎలా ఏర్పడుతున్నాయి?

ఆత్మలో కామాంశం ఉందని చెప్పుకొన్నాం. అంటే మనస్సు అని చెప్పుకొనేదానిలో రతి, క్రోధ, భయవిశ్వాసాదివాసనలు, సంస్కారాలు ఉన్నాయి. ఇలాంటి మనస్సుకు ఇంద్రియకశక్తి, స్మరణశక్తి, వికల్పనశక్తి ఉన్నాయి. వస్తువులను ఇంద్రియాలతో చూస్తాము. అలా కలిగిన జ్ఞానం స్మృతి పథంలో ఉంటుంది. మనలోని వాసనలను పురస్కరించుకొని స్మృతి పథంలో నిలిచి ఉన్న ఇంద్రియక జ్ఞానానికి వికల్పనశక్తి ఒక నిర్దిష్టరూపమిచ్చినప్పుడు

నిశ్చయ మేర్పడుతున్నది. ఈవిధంగా ఇంద్రియకజ్ఞానస్మృతి వాసనా సంస్కార సమ్మేళనంతో నిశ్చయ మేర్పడుతున్నది. ఇంద్రియజ్ఞానం ప్రమ కాదని లోగడ చెప్పుకొన్నాము. కాబట్టి ఇంద్రియ జ్ఞానాన్ని పురస్కరించుకొని యేర్పడే నిశ్చయమంతా అయధార్థం. అలాంటి అయధార్థనిశ్చయంవల్ల కలిగే సుఖదుఃఖాలుకూడా అయధార్థాలు.

ఈవిధంగా లేనిపోని ఉజ్జ్వలభవిష్యం రాగలదన్న అయధార్థనిశ్చయంతో అయధార్థ సుఖం పొందవచ్చును. అయధార్థమైన గతవిషయాలను స్మరించుకొని, దానివల్ల కలిగిన అయధార్థనిశ్చయంతో అయధార్థసుఖం పొందవచ్చును. వర్తమాన విషయాలు ఒకవిధంగా ఉంటే మరొకవిధంగా ఉన్నాయన్న అయధార్థనిశ్చయంతో అయధార్థసుఖం పొందవచ్చును. ఇలాగే అయధార్థదుఃఖంకూడా.

సుఖదుఃఖాల అయధార్థతకు నిశ్చయదోషమే కాక మరొకకారణం కూడా ఉంది. సుఖము, దుఃఖము ఒకేసారి కలగటానికి వీలున్నదని చూచాము. ఒకటి శరీరం ద్వారా కలిగేది. రెండోది మనస్సు ద్వారా కలిగేది. ప్రకృతం శరీరం రోగపరిపీడ్యమానం అను కొందాము. ఈబాధ ఒక ప్రక్కన, ముమ్ముందు ఆరోగ్యం కలుగుతుందన్న ఆశతో కలిగే సుఖం మరొక ప్రక్కన ఉంటాయి. ఇప్పుడు కలుగుతున్న బాధముందు రేపు కలగబోయే సుఖం ఎంత ఉత్కటమైనా చాలా అల్పంగా కనిపిస్తుంది. అందువల్ల బాధ ఉన్న దానికంటె ఎక్కువగా కనిపిస్తుంది. ముందువచ్చే ఆరోగ్యంవలని సుఖం తీరా ప్రాప్తించినప్పుడు ఆ సుఖపరిమాణం ఎంతో పెరిగినట్లు కనిపిస్తుంది. కాబట్టి మనం పొందే సుఖదుఃఖాలలో కొంతయాథార్థ్యం, కొంత ఆభాసం ఉంది. ఈ అభాసాంశం తీసివేస్తే వాటి యధార్థపరిమాణాలు తేలుతాయి. కాని అనుభవంలో అలాంటిది సాధ్యపడదు.



సుఖదుఃఖాల అయధార్థతకు ఇంకొక కారణం కూడా ఉంది. శరీర సామరస్యం యథా ప్రకారంగా కొనసాగుతున్నప్పుడు సుఖమూ దుఃఖమూ కాని అవస్థ ఉంటుంది. శరీర సామరస్యంలో జరిగే పూరణక్షీణతల పరిమాణం తగినంతగా ఉంటే కాని మనోగోచరం కాదు. అలా తెలిసివచ్చినప్పుడే సుఖమో దుఃఖమో అనుభూతమౌతున్నది. పూరణ క్షీణతలు అంత పరిమాణంలో లేనప్పుడు తటస్థావస్థ ఏర్పడుతున్నది. ఇలాంటి తటస్థ సంవేదనను సుఖమనో, దుఃఖమనో అనటం జరుగుతున్నది. నిజానికి ఈ సంవేదనం దుఃఖమూ కాదు, సుఖమూ కాదు.

గాఢతమసుఖాలు వ్యాధిగ్రస్తునకే. ఆవ్యాధి మానసికమైనా శారీరకమైనా అతనికే. ఇలాంటి గాఢతమసుఖాలన్నీ దుఃఖసమ్మిశ్రితాలే. ఈసమ్మిశ్రితసుఖాలు శారీరకాలు

కావచ్చును; లేదా మానసికాలూ కావచ్చును; లేదా ఉభయాలూ కావచ్చును

శారీరకమూ, ఉభయమూ అయిన సమ్మిశ్రితసుఖాలను గూర్చి లోగడ చెప్పు కున్నాము. కేవలం మానసికాలైన సమ్మిశ్రితసుఖాలను పరిశీలించాలి.

కేవల మానసిక సమ్మిశ్రితసుఖాలు మనస్సులో రతిభయశోక క్రోధద్వేషస్పర్ధాది వాసన లున్నాయి. ఇవన్నీ మానసిక దుఃఖం కలిగించేవే. అంటే ప్రబుద్ధమైనప్పుడు దుఃఖం కలిగిస్తాయి. ఇవి తుష్టిపొందినప్పుడు అత్యధిక సుఖం కలుగుతుంది.

పిల్లవాడు ఏదో చెడ్డపని చేస్తాడనుకోండి. అప్పుడు ఎక్కడలేని కోపం వస్తుంది. అంతవరకు అది బాధ. పిల్లవాణ్ణి గట్టిగా మందలించో, కొట్టో మనం కోపం తీర్చుకొంటా మనుకోండి. బాధకలిగిస్తున్న ఆకోపమే సుఖం కలిగిస్తుంది. అలాగే ఏ ప్రహసనమో, లేక హాస్యరసప్రధానమైన మరొక రూపకమో చూస్తామనుకోండి. అప్పుడు కూడ ఇలాంటి మిశ్రిత సుఖమే కలుగుతుంది. ఇలా అవగానే ఆశ్చర్యం కలుగక మానదు. హాస్యాస్పదమైన విషయంయొక్క తత్త్వం వివరిస్తే కాని పైమాట విశ్వాసపాత్రం కాదు.★

హాస్యరసనిష్యంది అయిన కథలో కాని, సన్నివేశంలోకాని, పాత్రలోకాని మనకు ఏది నవ్వు కలిగిస్తున్నది? అందుండే జాడ్యం, లేక ఆత్మజ్ఞాన అభావం. పాత్ర యధార్థస్థితికీ అది భావించేస్థితికీ వ్యత్యయం కలిగినప్పుడు నవ్వుతాము. ఇదే కధకూ, సన్నివేశానికీ వర్తిస్తుంది.



హాస్యానికి మూలబీజమైన జాడ్యం, లేక ఆత్మజ్ఞాన అభావం మూడు విధాలు – 1. భాగ్యానికి సంబంధించినది. కొంతమంది యధార్థంగా తమకున్న దానికంటె ఎక్కువ భాగ్యవంతులమని భావిస్తారు. అలాంటి ఆత్మవంచనఅంతా దీనిక్రిందికి వస్తుంది. 2. సౌందర్యానికి సంబంధించినది. 3. జ్ఞానానికి సంధించినది. ఇదంతా జాడ్యమే ఈ జాడ్యం ఒకప్పుడు నిరపాయం కావచ్చును. అంటే ఇలాంటి దానివల్ల హాని లేకపోవచ్చును.

---

★ ఈ అంశాన్ని బెర్గ్సన్ అన్న ఫ్రెంచి తత్త్వవేత్త Laughter అనే గ్రంథంలో చక్కగా వివరించాడు.

హాస్యరసవిషయంలో సాహిత్యదర్పణం – పెద్దలకు కోపం రాకుండా ఉంటే – అంధమనే చెప్పాలి. ఎందుకంటే, అందలి వివరణ –

వికృతాకారవాగ్వేష చేష్టాదేః కుహకాద్భవేత్,<br>
హాస్యో హాసస్థాయిభావః శ్వేతః ప్రమథదైవతః.<br>
అని మాత్రమే.

జి.వి.కృష్ణరావు

మరొకప్పుడిది హాని కలిగించవచ్చును. ఒకవ్యక్తి ఆత్మవంచనంవల్ల ఎవరికీ ఎలాంటిహానీ కలగనప్పుడు అది హాస్యాస్పదమౌతుంది. హానికరమైనప్పుడు భయావహం, జుగుప్సాకరం అవుతుంది. పాత్రలోని నిరపాయకరమైన ఆత్మవంచనమే హాస్యాస్పదంగా ఉండి నవ్వుతాము.

ఇంతవరకూ చెప్పుకొన్నదానినిబట్టి సామాజికునిలోగాని, వ్యావహారిక జగత్తులో గాని కేవలం సుఖం కలుగుతున్నదే కాని దుఃఖం కలగడం లేదే అన్న సందేహం కలగవచ్చును. కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే కాని అసలు తత్త్వం అర్థంకాదు. అనపాయకరమైన ఆత్మవంచనం గోచరించినప్పుడు నవ్వు వస్తుందన్నాము. ఈ గోచరత మనస్సులోని ఏ వాసనను శమింపజేస్తున్నది? ద్వేషాన్ని. కాబట్టి ద్వేషం ప్రబుద్ధమైనప్పుడు దుఃఖము కలుగుతున్నది; శమం పొందినప్పుడు సుఖం కలుగుతున్నది. ఈ రెండు వ్యాపారాలూ ఒకే కాలంలో కలుగుతున్నవి కాబట్టి హాస్యం కూడ దుఃఖసమ్మిశ్రిత సుఖమే★.

కాగా వాసనాప్రబోధంతో దుఃఖమూ, శమంతో సుఖమూ ఏక కాలమందే కలుగుతున్నవి. ఈ సూత్రం సాహిత్య జగత్తుకేకాక వ్యావహారిక జగత్తుకుకూడా అన్వయిస్తుంది.

ఇంతవరకూ పరిశీలించినవన్నీ అయథార్థ సుఖదుఃఖాలే. అసలు యథార్థసుఖాలు అనేవి ఉన్నవా, లేవా? ఉంటే అవి ఎలా ఉంటాయి? వేనివల్ల కలుగుతాయి? అసలు సుఖమన్నది శరీరసామరస్య పూరణంవల్ల కలుగు తుందనీ, దుఃఖం క్షీణతవల్ల కలుగుతుందనీ చూశాము. ఈ క్షీణత మనస్సుకు గోచరించనంత అల్పంగా ఉన్నప్పుడు

---

★ ఒకపాత్రగాని, సన్నివేశంగాని, కథగాని హాస్యాస్పదంగా ఉండాలంటే అది ఇష్టమైనది (Likeable) కావాలి. లేకపోతే హాస్యానికి తావులేదని ప్లేటో ఘంటాపథంగా చెబుతున్నాడు. ఇదే అన్ని సాహిత్యాలలోను గోచరిస్తుంది. మృచ్ఛకటికంలోని శకారుడు, సంస్కృత నాటకంలోని విదూషకుడు, షేక్స్పియర్‌సృష్టించినఫాల్‌స్టాఫ్, ప్రతాపరుద్రీయంలోని పేరిగాడు, కన్యాశుల్కంలోని గిరీశం మొదలైనవారు దృష్టాంతం.

ఈ సందర్భంలో మరొక విషయం పేర్కొనటం అప్రస్తుత ప్రశంస కాదనుకొంటాను. కేవల మానసిక సమ్మిశ్రిత సుఖాలన్నిటికి శమం మూలమని ప్లేటో అంటున్నాడు. సాధారణ కావ్యాది కానందానుభూతినంతా సమ్మిశ్రితసుఖంక్రింద పరిగణిస్తున్నాడు. కాబట్టి సాహిత్యదర్పణ కారుడు అద్భుతం సర్వరసాలకు అంతర్వ్యాపి అంటున్నట్లే ప్లేటో శమము సర్వరసాలకు అంతర్వ్యాపి అంటున్నాడు. అంతేకాదు. సర్వమానసిక సుఖాలకు అతని మతంలో శమమే – క్షీణతాశబ్దంతో లోగడ పేర్కొన్న అర్థమే – కారణం. కాబట్టి ప్లేటోమతం ప్రకారంకూడా శాంతం రసరాట్టు అవుతున్నది.

జేగంటలు – ప్లేటో

దుఃఖం ఉండదు. సామరస్యపూరణం మనో గోచరమైనప్పుడు సుఖం కలిగిస్తుంది. ఇలాంటివే కేవల యథార్థ అసమ్మిశ్రితసుఖాలు లేక ఆనందాలు (?; రమణీయాలైన రంగులు, ఆకృతులు, ధ్వనులు, కొన్ని సుగంధాలు (ఆహార పానీయాదికముల వాసనలు, ''మగువపొలుపు దెలుపు మారుతము'' మొదలైనవి వినా) ఇలాంటి ఆనందం కలిగిస్తాయి.

అయితే ఆకృతులను రమణీయమంటున్నామంటే ఆ రామణీయకం శరీరచిత్రాదుల రామణీయకం వంటిది కాదు. శరీరచిత్రాదుల రామణీయకం సాపేక్షం; పురస్సరద్వాంఛం, అస్తిప్రయోజనం. కేవల ఆకృతి మాత్రరమణీయాలైన దీర్ఘచతురాశ్రాల, గోళాల త్రిభుజాల రామణీయకం విశిష్టం. ఈ రామణీయకం సాపేక్షంకాదు. స్వభావతః ఇవి నిత్యరమణీయాలు. ఇలాగేస్పష్టములు, లలితములు, అశ్లిష్టములు అయిన ధ్వనులు నిరపేక్షలానిత్యరమణీయాలు. పైని పేర్కొన్న గ్రంధాలుగూడా రమణీయాలే కాని అంత ఉదాత్తాలు కావు. అయినా వీటివల్ల కలిగేదికూడా ఆనందమే.

ఈ ఆనందంలో మరొకవిధమైన ఆనందం ఉన్నది. అర్థజ్ఞానం (Learning) లేక శాస్త్రజ్ఞానంవల్ల కలిగే ఆనందం ఇందులో చేరుతుంది. క్షుత్పిపాసాదులందువలె మొదట దుఃఖంకలిగి దాని నివారణంవల్ల సుఖం కలుగుతున్నట్లుగా ఈ జ్ఞానాభావంవల్ల దుఃఖం కలగటంవలేదు సంపాదించిన ఈ జ్ఞానం మరచిపోతున్నప్పుడు దుఃఖం కలుగటంలేదు. మరచిపోయాననే అన్న పరామర్శంవల్ల దుఃఖం కలిగితే కలగవచ్చును. అది వేరేసంగతి. కాని స్వతః అర్థజ్ఞానం లేక, శాస్త్రజ్ఞానం ఆనందం కలిగిస్తున్నది.

ఆనందంలోని ఈ రెండురకాలలో ఏది ఉత్తమం అనే విషయంలో ప్లేటో తన అభిప్రాయాన్ని వెల్లడించక మౌనంగా ఊరుకొన్నాడు.

ఇంతవరకు సుఖదుఃఖ స్వరూపపర్యాలోచన జరిగింది. ఆనందము, క్షుత్పిపాసాది స్వాభావికతృష్ణల నివారణంవల్ల కలిగే సుఖము, నైతికప్రవర్తనసంజనిత సుఖము అన్న మూడు అంశాలతో గూడినదే ధర్మం. ఈ ధర్మం రామణీయకం, నిష్పత్తి (Proportion), సత్యమూ అన్న మూడు ''భావాలచే'' అభివ్యక్తమౌతుంది. అంటే రామణీయకంలోను, నిష్పత్తిలోను, సత్యంలోను ధర్మముంది. ఇలాగే రామణీయకంలో నిష్పత్తి సత్యం ధర్మం ఉన్నాయి. ఇలాగే సత్యం నిష్పత్తి కూడా.

రామణీయకమంటే మితత్వం, నిర్దిష్ట నిష్పత్తి అంటూ ప్లేటో దానిని ధర్మంతో ముడివేశాడు. అందువల్ల అతని మతం ప్రకారం విగళితధర్మమైన రామణీయకం లేదు.



జి.వి.కృష్ణరావు

ఒకటి రమణీయ మైయున్నామంటే అతని మతం ప్రకారం అది ధార్మికమూ కావాలి. అంతేకాని కళ కళకోసమే నన్న వాదన ఇతడు ఏమాత్రం అంగీకరించడు.

కాబట్టి కళ ధర్మబోధకం కావాలి. అయితే కళ ఎలాటి ధర్మోపదేశం చేయాలంటు న్నాడో తెలిసికోవటం అవసరం.

## కళ - దర్మం

కళాసృజనక్రియకు ఏది ఉద్బోధకమో, ఆ సృష్టిస్వరూపము, సత్తా ఎలాంటివో, దానివల్ల ఎలాంటి అనుభవం కలుగుతున్నదో చూచాము. కళాసృష్టి పారమార్థికసత్యం కాదు. ఇది ప్రతిబింబానికి ప్రతిబింబం (కేవలం సాక్షిభాస్యం). కాబట్టి పారమార్థిక సత్యమైనభావాలు లక్ష్యాలు తత్ జ్ఞానసిద్ధికోసం పాటుపడటం జీవధర్మం. అందువల్ల లోకంలోని ప్రతిదీ ప్రయోజనకారి కావాలి. కళాసృష్టికూడ ప్రయోజనకారి, అంటే మానవుని పరమార్థసిద్ధికి వినియోగ పడాలి. అంతకు తప్ప ఇది తనకు తాను పరమార్థంకాదు. కాబట్టి సాహిత్యాదికం పరమార్థబోధకంగా ఉండాలి. కాని తానే పరమార్థమైనట్లుగా తనముందే సర్వం లీనమైపోయేటట్లు ఉండగూడదు. అంటే ఇది ధర్మోపదేశకం కావాలి.



కవులు గానం చేసేకథలు పూర్ణంగా సత్యవర్జితాలు కాకపోయినా ప్రధానంగా కల్పితాలు. ★ పిల్లల మనస్సులు లేతవి. ఏమిచెప్పినా వారి హృదయకుహరంలో హత్తుకొనిపోయి వారిశీలంమారుస్తుంటాయి. అందువల్ల ఏకథలనుబడితే ఆకథలను చెప్పగూడదు. అందువల్ల మంచికథలేవో చెడ్డవేవో పరిశీలించి చెడ్డవాటిని ప్రభుత్వం నిషేధించాలి. ప్రభుత్వం ఆమోదించినవాటినే తల్లులు, దాదులు చెప్పాలి.

దేవతల ప్రకృతి, వీరులచరిత్ర చెప్పేటప్పుడు కవులు వారి స్వభావాల కనుచితమైన అబద్ధాలన్నో వ్రాస్తుంటారు. దేవతలలో తండ్రి కొడుకులకు వైరము నట్లు, ఒండొరుల మీద కక్షసాధించుకొన్నట్లు వ్రాశారు. అలాంటి కథలువింటే పిల్లల మనస్సు లేమౌతాయి? దేవతలు తమలో తాము పోరాడుకొన్నట్లు వ్రాయగూడదు. ఒకరిమీద ఒకరు కుట్రలు పన్నినట్లు ఉల్లేఖించగూడదు. వీరులు బంధువులతోను, మిత్రులతోను పోరాడినట్లు వర్ణించరాదు. దీనినిబట్టి గాంగేయ పరశురాములయుద్ధం, భారతయుద్ధం పరిహరణీయాలవుతున్నవి.

కథలలో సాధారణంగా కవులు ఎలాంటి విషయాలు చెప్పాలో, ఏ అవధులు

★ Republic, Chap 3

మించిపోగూడదో తత్త్వవేత్తలు తెలిసికోవాలి. వారి అనుశాసనాలను కవులు శిరసా వహించాలి.

నిజస్వరూపానుగుణంగా ఈశ్వరుని వర్ణించాలి. కాని అసభ్యకృత్యాలను అతనికి ఆపాదించరాదు. ఈశ్వరుడు మంచినే సృష్టించాడు కాని చెడ్డను సృష్టించలేదు. సర్వశక్తి సంపన్నుడైన ఈశ్వరుడు అవతారాలు తాల్చడు. యుద్ధాలు తెచ్చిపెట్టడు. ఒకదానిని నాశనం చేయదలచుకొన్నప్పుడు ఈశ్వరుడు అక్కడ పాపబీజాలు నాటుతాడని చెప్పగూడదు. ఈశ్వరుని దుఃఖ కారకునిగా చిత్రించరాదు. దేవతలు మారురూపాలుదాల్చి తిరుగుతారని చెప్పరాదు భిక్షాటనం చేస్తారనీ వర్ణించగూడదు. ఈ విధంగా పురాణాలన్నీ దాదాపు అసాధువులు అవుతున్నవి.

పిరికితనం బోధించే భాగాలను, అసభ్యవర్ణనలను తొలగించివేయాలి. బీభత్సరస నిష్యంది భాగాలను, భారతంలోని స్త్రీపర్వంలాంటివి కొట్టివేయాలి. సుప్రసిద్ధవీరుల విలాపప్రలాపాలు, అజవిలాపం లాంటివి, వికటహాసాలు నిషేధించాలి.

దుష్టులు సుఖపడ్డారనీ, సత్పురుషులు నానావస్థలు పడ్డారనీ, అజ్ఞాతంగా ఉంటే అన్యాయమంత సుఖమిచ్చేది మరొకటిలేదనీ, ఒకనికిష్టం కలిగించి మరొకనికి న్యాయం కలిగించేదే న్యాయమనీ వివరించే వర్ణనలను పూర్తిగా బహిష్కరించాలి. ఉత్తముల చరిత్రలే కావ్యవస్తువులు కావాలి. ''స్వాధికారాత్ప్రమత్తుడు'' ఉత్తముడు కాడు.

''కావ్యేషు నాటకం రమ్యమ్,'' అన్న వాక్యాన్ని ప్లేటో అంగీకరించడు. శ్రవ్యకావ్యమే ఉత్తమమంటాడు. అతని మతంప్రకారం పరిపాలకులు నటించగూడదు. ముఖ్యంగా స్త్రీని, ★ అందులో మగనితో పోట్లాడేదానిని కాని, తన సుఖంకోసమని దేవతలపై తిరుగబడేదానిని కాని, దుఃఖప్రణయ ప్రసవాది పీడితనుకాని అనుకరించరాదు. సేవకులనుకాని, దుష్టులనుకాని, ఉన్మత్తులనుకాని, నీచవృత్తులవారిని కాని అనుకరించరాదు.

### కళాసృష్టి లక్షణాలు

ఇంతవరకు రామణీయకస్వభావం, సృష్టి, అనుభూతి, రామణీయక ధర్మాల సంబంధం చెప్పుకొన్నాము. కళా సృష్టి, అంటే ఒక రచనకాని, చిత్రంకాని, పాటకాని ఎలా నిర్ణయించటం అనే ప్రశ్న అలాగే ఉంది. కళాసృష్టి రమణీయంగా ఉండాలంటే అది కొన్ని సూత్రాలకు కట్టుబడి ఉండాలి వస్తువునకు చిత్రణకు సామరస్యం ఉండాలి. వస్తువుమించి చిత్రణకాని, చిత్రణనుమించి వస్తువుగాని గోచరించగూడదు. ఆ సృష్టి

★ ప్రాచీన గ్రీక్‌నాటకాలలో స్త్రీపాత్రలను పురుషులే నిర్వహించేవారు.

స్వయంసంపూర్ణమై ఉండాలి "ప్రతి సృష్టి జీవివలె శరీరము, శీర్షము, పాదములు కలిగి ఉండాలి. అంటే ఆదిమధ్యాంతాలుండాలి. ఇవి అన్యోన్య సంబంధం కలిగి అవయవికి అనుగుణంగా ఉండాలి." అంటే భిన్నత్వంలో ఏకత్వం ఉండాలి. భిన్నభిన్న అవయవాలు ఉన్నా జీవి ఒకటిగా ఉన్నట్లుగా కృతిలోని వివిధాంశాలు ఏకత్వ ప్రతిపాదకాలు కావాలి. ఈ భిన్నత్వంలోని ఏకత్వం రామణీయకానికి ప్రధానలక్షణం. అంటే ఈభిన్నత్వం భావాభివ్యంజకం కావాలి.

కళాస్రష్టకు వ్యుత్పన్నత, అభ్యాసము అవసరం. ఇందులో అతడు ఏమాత్రం పాలుమాలరాదు. వ్యుత్పన్నత, అభ్యాసం ఉన్నంతమాత్రాన రమణీయకృతి నిర్మాపకుడు కాలేడు. వ్యుత్పత్తి, అభ్యాసము, నైపుణి ప్రధానాలే అయినా వీటికంటె అత్యంత ముఖ్యమైనది మరొకటి ఉంది. శ్రుతి లగించగలిగినంత మాత్రాన వైణికుడు కాడు. కావ్యాలు, కోశాలు, ఛందోలంకారశాస్త్రాలు చదువుకొన్నంతమాత్రాన కవికాడు. ప్రతిభ అనేది ఒకటి అవసరం. ప్రతిభాసముపపన్నమైనప్పుడే అది సృష్టి అవుతుంది.

### అలౌకిక రామణీయకం - లౌకిక రామణీయకం

ఈ పర్యవలోకనంతో అలౌకిక రామణీయకస్వరూపం, లౌకిక రామణీయకస్వభావం తేలిపోయింది. అయితే ఈ రెంటికీవున్న సంబంధమేమిటి? ఈ ప్రశ్నకు ఒకవిధంగా ఇదివరకే సమాధానం చెప్పుకొన్నాం. తిరిగి చెప్పటం పునరుక్తే అయినా స్పష్టతకోసం గతార్థస్మరణం అనవసరంకాదు.



లౌకిక రమణీయార్థాలు తమకుతాము ప్రయోజనకారులు కావు. ఈ అర్థాలు అలౌకిక రామణీయకానికి ప్రతిబింబాలై ఆ పరమరామణీయకాభి వ్యంజకము లైనప్పుడే అవి సార్థక్యము పొందుతున్నవి. పారమార్థికరామణీయ కాభివ్యంజనమే వాటి ప్రయోజనం. "మానవుడు ఈ భౌతికరమణీయార్థాలతో ఆరంభించి పారమార్థిక రామణీయకాభి ముఖగమనానికి వీనిని సోపానాలుగా వాడుకొంటూ, ఒకటినుంచి రెండికి, రెంటినుంచి అన్నిటికీ, అక్కడనుంచి రమణీయ జీవులదగ్గరకు, వాటినుంచి రమణీయజీవితాలకు, వాటినుంచి రమణీయసత్యాలకు, వాటినుంచి తుదకు రామణీయకం యొక్క యథార్థజ్ఞానానికి పురోగమిస్తాడు. ఈ విధంగా చిట్టచివరకురామణీయక మేమిటో తెలుసుకొంటాడు. ఈ రామణీయకమే యథార్థమైన ఆలయం. ఇక్కడ పారమార్థిక రామణీయక దర్శనం లభిస్తుంది. తన జీవితంలో మానవునికి ఆలయమనేది ఒకటి ఉంటే ఇదే అతని ఆలయం!"*

---

* Symposium

లౌకిక రామణీయార్థాలు పుడుతుంటాయి; గిడుతుంటాయి; పరిణామం పొందు తుంటాయి. ఇవి ఒకనికి, ఒకదేశానికి, ఒక కాలానికి రమణీయాలై మరొకనికి, మరొకదేశానికి, మరొకకాలానికి రమణీయాలుకావు. అయితే ఇవి పరమ రామణీయ కాభివ్యంజకములైతే, తాను చెప్పే నైతిక వ్యవస్థ, సామాజిక వ్యవస్థ అభివ్యక్తంచేస్తే ప్లేటోకు ఎలాంటి ఆక్షేపణలేదు. అలాగాక కేవలం భౌతిక విషయాభివ్యంజకము లైతేమాత్రం అతడు సహించడు. అలాంటివాటిని బహిష్కరించటానికి, అణచివేయటానికి ఏమాత్రం సంకోచించడు. రిపబ్లిక్‌లో అంతతీవ్రనిరాసానికి పాల్పడింది. ఇలాంటి రమణీయా ర్థాలేగాని పారమార్థిక రామణీయకం కాదు. తదభివ్యంజక రమణీయార్థాలు గావు. ఈ లెక్కలో మహాకవుల కృతులలో ముప్పాతిక మువ్వీసం పరిహరణీయమౌతుంది. అయినా అలా వర్జించటానికి ప్లేటో ఏ మాత్రం సంకోచించడు. అతనికి ప్రజాసామాన్యంయొక్క ఇష్టానిష్టాలతోను, అభిరుచులతోను సంబంధంలేదు. తనశాస్త్రం చెప్పినట్లు లోకం ఉండాలి. ఉండకపోతే ఉండేటట్లు చేయాలి.

కళాసృష్టులు రమణీయాలయినా భౌతికాలు. అందులో ఆభాసమైన భౌతికార్థానికి ఆభాసాలు. అందువల్ల వృత్తికారులకన్నా కళాస్రష్టలు క్రిందివెంట్టు లోనివాళ్ళు. కళాస్రష్టకన్నా సహృదయుడు ఉత్తముడు. సహృదయునికంటె రామణీయకతత్త్వ విచారపరుడు ఉత్తమోత్తముడు. ఇది ప్లేటోమతం. ఈమతం కేవలం దురభిమానం పురస్కరించుకొని వెలువడినది కాదు. అతడు సిద్ధాంతీకరించిన జ్ఞాన రూపాన్ని బట్టి నిష్పన్న మౌతున్నది. అతడు ప్రతిపాదించిన జ్ఞానస్వరూప మంగీకరిస్తే ప్రతి కళాస్రష్ట అనుకారి. అతనిసృష్టి అనుకృతి. అలాకాక జ్ఞానస్వరూపంవరకు అంగీకరించి కళాస్రష్టను అనుకారి అంటే నొచ్చుకోవలసిన అవసరంలేదు. ప్లేటో ఇక్కడ తికమకపడ్డాడు. స్వవచనవ్యాఘాతం చేసుకొంటున్నాడు అంటే ప్రయోజనం లేదు. ★

ఏది ఎలా ఉన్నా ప్లేటో కళా సిద్ధాంతం ముఖ్యంగా మూడుసూత్రాల మీద ఆధార పడివుంది.

---

★ కీర్తిశేషులైన ఏ.కె. కుమారస్వామిగారు Figures of speech of Figures of Thought అన్నవ్యాసంలో ప్లేటో అనుకరణవాదాన్ని అత్యంత రమణీయంగా అనువదించారు. ఈ అనుకరణవాదం దార్శనిక సిద్ధాంతమని గుర్తించికూడా దానివల్ల జీవితంలో కళకు ఎలాంటి స్థానం లభిస్తున్నదో, పురాణాలు, ఇతిహాసాల కాళిదాసాది మహాకవుల కొన్ని కృతుల్ను, లేక అందలి కొన్ని భాగాలు ఎలా కళాఖండాలు కాకుండా పోతున్నవో, ధర్మమనేది ఎలా ప్రయోజనాపేక్షమై ఘోరంగా తయారవుతుందో చెప్పకుండా చక్కగా జారవిడిచారు.

---

జి.వి.కృష్ణరావు

1 అనుకరణవాదం. ఈవాదంకేవలం దార్శనికం (Metaphysical) ఇది బోశాంకో చెప్పినట్లు కళయొక్క యాథార్థ్యాన్ని, విలువను ఏమాత్రం అంగీకరించదు.

2. కళ ధర్మప్రతిపాదకం కావాలి. ఇలా అనటంలో రెండు విశేషార్థాలున్నాయి. ఒకటి - జగద్వ్యవస్థలో స్వయంప్రకాశమానములైన శక్తుల ధార్మిక వ్యవస్థనుకూడా చిత్రిస్తూ కళ గంభీరము, పూర్ణము కావాలి. రెండు - యథార్థరామణీయకం, అయథార్థ రామణీయకం ఉన్నవని ఈ సిద్ధాంతంలో అంతర్యూతమై ఉంది. అయథార్థరమణీయ వస్తువులు కేవలం భౌతిక ప్రయోజనమే పరమార్థంగా బయలుదేరేవే కాబట్టి గర్హణీయాలని యీ వాదం భావిస్తుంది. ఈ సందర్భంలో ప్లేటోమతం ప్రకారం పారమార్థికం, ప్రయోజనసహితం అయినదే ధర్మమనిమాత్రం మరచి పోగూడదు.

3. భిన్నత్వంలో ఏకతను ఇంద్రియగోచరం కావించటంలోనే రామణీయకముంది. పై రెండు సూత్రాలకంటె ఇది అత్యంత ముఖ్యం, యథార్థం. దీనివల్లనే కళాసృష్టికి సంపూర్ణత్వం, ఏకత్వం, అనన్యత్వం, నిత్యత్వం సిద్ధిస్తున్నాయి.

### ఉపసంహారం

ఇంతవరకు ప్లేటో కళాసిద్ధాంతం పరిశీలించాము. అతని మతం క్లుప్తంగా చెప్పుకోవాలంటే ఇలా ఉంటుంది.



మానవజీవితమంటే తనలో లేని ఒకానొక దివ్యపదార్థంకోసం సాగించే నిరంతర అన్వేషణ. ఈదివ్యపదార్థం జన్మపరంపరకు ఆవల దేశకాలాతీతమై, అనన్యమై ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ దివ్యపదార్థ సాక్షాత్కారసిద్ధే మానవజీవితానికి పరమార్థం. ఈ దివ్యపదార్థాన్ని బట్టిచూస్తే యీ చరా చరప్రపంచమంతా మిధ్య జీవికి ముక్తి జీవయాత్రాంతర్గత అన్వేషణద్వారానే లభిస్తుంది. అంతేకాని మానవజీవితం స్వతః ప్రయోజనకారికాదు. పరమార్థానికి సాధనంగామాత్రమే దీనికి ప్రయోజనం ఉంది. అందువల్ల తత్త్వాన్వేషణం ఉత్తమం. ఇలాంటి తత్త్వాన్వేషణకు సోపానమైనదే కళ. అందువల్ల కళ తత్త్వశాస్త్రంకంటె న్యూనం. జిజ్ఞాసకు, పర్యుత్సుకతకు తోడ్పడనిది కళ కాదు. అలా తోడ్పడని కళ నీచాతినీచము.

అయితే ప్లేటోవాదాన్ని పరిశీలించినవారికి ఈక్రింది ప్రశ్నలు కలుగుతాయి. 1. ప్రత్యక్షం ప్రమకాదా? పర్వతం భిన్నభిన్నదూరాలలో నుంచి చూచినప్పుడు భిన్నభిన్న పరిణామకృతులు గోచరిస్తున్నంత మాత్రాన ఆ భిన్నభిన్న జ్ఞానాలు అయథార్థాలా? ఏనుగు పర్వతంకంటె చిన్నదై లేడికంటే పెద్దదైనంతమాత్రాన అంతర్వైరుధ్యముందా? 2. ప్లేటో ప్రతిపాదించిన పరిణామనిరాసం సమంజసంగా ఉన్నదా? అతడు గోరంతలు కొండం తలుచేసి ఆ వాదాన్ని హాస్యాస్పదం చేయలేదా? 3. ప్లేటో భావవాదం అతడు పేర్కొన్న

సాపేక్షతాపరిణామిత్వవాదాలను అతిక్రమిస్తున్నదా? ఈ భావవాదం ఎంతవర తర్కసమ్మతం? సామాన్యాలను అంగీకరించినంత మాత్రాన అటువంటి భావవాదం సిద్ధిస్తున్నద

ఈ ప్రశ్నలను దృష్టిలో ఉంచుకొని ప్లేటో ప్రతిపాదించిన దర్శనార్థాల బాగోగు పరికిస్తే ఎవరికి వారు నిర్ణయించుకొంటారని ఆశిస్తున్నాను.

"తద్వి జిజ్ఞాసస్వ"

## ప్లేటో రచనలు

| | |
|---|---|
| Hippias Major | Phaedo |
| Hippias Minor | Symposium |
| Ion | Protagoras |
| Menexenus | Republic |
| Charmides | Phaedrus |
| Laches | Theaetetus |
| Lysis | Parmenides |
| Cratylus | Sophistes |
| Euthydemus | Politicus |
| Gorgias | Philebus |
| Meno | Timaeus |
| Euthyphro | Critias |
| Apology | Laws |
| Crito | Epinomis |

# ఈ రచనకు ఉపకరించిన గ్రంథాలు


| | |
|---|---|
| The Dialogues of Plato | - Jowett, B. |
| Plato's Theory of Knowledge | - Cornford, F M. |
| Plato's Cosmology | - Cornford, F M |
| Plato and Parmenides | - Cornford, F M |
| The Republic | - Cornford, F M. |
| Plato's Examination of Pleasure | - Hackforth, R. |
| Greek Political Theory | - Barker, E. |
| Plato's Thought | - Grube, G M.A |
| Plato's Theory of Ethics | - Lodge, R C |
| Platon 2 vols | - Ritter, C |
| Essence of Plato's Philosophy | Ritter, C |
| Plato the Man and his Work | - Taylor, A E |
| Platonism | - Taylor, A E |
| Plato | - Taylor, A E |
| History of European philosophy | - Russel B |
| History of Political Thought | Sabine, G H |
| The Socialist Tradition | - Gray, A |
| History of Aesthetic | - Bosanquet, B |

# GLOSSARY

అంగము part, organ

అంగాంగి భావము relation of the part and the whole

అంగి organic whole

అంతఃకరణ ప్రామాణ్యవాదము intuitional ethics

అంశము part

అఖండము that which has no part

అచేతనము that which is not animate

అతివ్యాప్తి too wide application

అతిలోకము supernatural

అతివాస్తవికవాదము sur-realism

అతీంద్రియము supersensuous

అద్వైతము non-dualism

అనంతము endless



అనంత శక్తిమత్త్వము having limitless power

అనవచ్ఛిన్నము indetermined

అనవచ్ఛేదము indeterminateness

అనవస్థ regressus in infinitum

అనుకరణము imitation

అనుకారి that which imitates

అనుకార్యము imitable

అనుకృతి act of imitation

అనుభవము experience

అనుమానము inference

అనువాదము translation, restatement

అనిర్వచనీయము indefinable

అన్యోన్యాశ్రితాలు mutually dependent

అపవర్గము release

అపౌరుషేయము the revealed

అభావము non-existence

అభిప్రాయము openion

అభివ్యక్తము manifested

అభివ్యక్తి manifestation, expression

అభివ్యజ్యమానము that which is being manifested

అభ్యాసము constant practice

అభ్యుదయము progress

అభ్యుదయకవి progressive writer

అమూర్తము infinite

అయథార్థము unreal

అరిస్టోక్రసీ aristocracy

అరిషడ్వర్గము six-fold passion

అర్థజ్ఞానము learning

అర్థము object, meaning, value

అలంకార శాస్త్రము aesthetics

అవచ్ఛిన్నము determined

అవచ్ఛేదము determinateness

అవచ్ఛేదకము determinant

అవయవము part, member of a syllogism organ

అవయవి organic whole, syllogism

అవిభాజ్యము indivisible

అవివేకము irrationality

అవ్యవస్థ crisis

అవ్యాప్తి too narrow application

అసత్ non-being

అసాపేక్షము non-relative

అసాపేక్షవాదము non-relativisiom

ఆకర్షణ attraction

ఆకారము form shape

ఆచారము custom

ఆత్మ soul

ఆత్మసిద్ధి self-realisation

ఆదర్శము ideal

ఆదర్శరాజ్యము Plato's Republic, ideal state

ఆధ్యాత్మిక దృగ్వాదము, విజ్ఞానవాదము subjective idealism

ఆధ్యాత్మిక దృశ్యవాదము objective idealism

ఆధ్యాత్మికము spiritual

ఆనందము bliss

ఆనుషంగికము incidental

ఆభాసము appearance

అభ్యుదయకము progressive

ఆముష్మికము belonging to the other world

ఆలంకారికము relating to aesthetics

ఆవిర్భూతి genesis

ఆశ్రయము substratum

ఇంద్రియజన్య జ్ఞానము perceptible knowledge

ఇంద్రియము sense

ఇతివృత్తము theme, plot

ఉత్పత్తి production

ఉద్బుద్ధము inspired

ఉద్బోధము inspiration

ఉద్యమము movement

ఉపదేశకము instructive

ఉపపత్తి proof

ఉపాధి hypothesis, limiting condition

ఏకతానత intuition

ఏకత్వము unity

ఏకాత్మవాదము monistm

ఏకాత్మ విశిష్ట బహుత్వవాదము monistic pluralism

ఏకదేశము part

ఏకదేశి whole

ఇంద్రియకము sensual

ఇంద్రియశక్తి faculty of perception

ఐక్యము unity, self-identity

ఐహికము worldly

ఔచితి propriety

కర్ణము diagonal

కర్మ action

కళ art

కళాకారుడు artist

కళాసృష్టి work of art

కామము desire

కారణత causality

కారణము cause

కార్యము effect

కాలము time

కృతి work of art, effort

కేవలకళ pure art

క్రమము order

క్రమిక ప్రవర్ధమానత gradual progress

క్రీడ play

క్షీణత depletion

గణితశాస్త్రము mathematics

గతి motion

గతితార్కిక భౌతికవాదము dialectical materialism

గాంధర్వగానము pure music

గుణము quality merit

గోచరత perceptibility
గోళము sphere
గ్రహణము cognition
చతురస్రము square
చరిత్ర history
చరిత్రాత్మకములు historical
చితి knowledge
చిత్రణము presentation
చిత్రము picture, composite
చిత్రలేఖనము painting
చేతనము animate
జగత్తు universe
జడము inanimate
జన్యుశాస్త్రము science of genetics
జాగృతి wakefulness
జాగ్రదవస్థ state of wakefulness
జాడ్యము characteristic of the inanimate



జ్ఞాత knower, subject
జ్ఞానము knowledge
జ్ఞానస్వరూపము epistemology
జ్ఞేయము knowable
తత్త్వము philosophy
తత్త్వవిచారము philosophical enquiry
తర్కము logic
తాత్పర్యము intention
తాదాత్మ్యము identity
తారతమ్యము gradation,
తార్కికము logical
త్రికరణములు thought, word and action
త్రిభుజము triangle
దర్శనము metaphysics
దార్శనికుడు metaphysician

దీర్ఘ చతురస్రము rectangle
[illegible] pair
దృక్కు which perceives, subject
దృశ్యము perceivable, object
దృష్టాంతము simile
దృష్టి out-lock, sight
దేశము space, country, place
దోషము defect
ద్రవత్వము fluidity
ద్రవము fluid
ద్రవ్యము substance
ద్వంద్వము mutual opposite
ద్వైతము dualism
ధనికవర్గరాజ్యము oligarchic state
ధర్మము property, The good
ధర్మశాస్త్రము ethics
ధార series
నటన mimicry
నాటకము a form of drama
నిత్యము eternal
నియంతృత్వము dictatorship
నిరుపాధికము non-hypothetical
నిర్లిప్తత detachedness
నిర్వచనము definition
నిష్పత్తి ratio, proportion
నీతి morality
నైపుణి skill
న్యాయము justice
పదార్థము category, matter
పదార్థ విజ్ఞానశాస్త్రము physics
పరంపరాగతము traditional
పరమము ultimate
పరమార్థము ultimate goal

---

[illegible] కృష్ణారావు

పరమాణువు atom
పరామర్శము reflection, consideration
పరిణామము evolution
పరిణామిత్వbecoming
పరిపాలన administration
పారమార్థికము absolute
పారమ్యము absoluteness
పారలౌకికము relating to the spiritual world
పారలౌకికత్వము other, world, liness
పాలకులు rulers
పాలితులు the ruled
పురుషార్థము human value
పూరణము repletion
పౌరుడు citizen
ప్రకృతి nature
ప్రకృతిసిద్ధ సౌందర్యము natural beauty
ప్రచారము propaganda
ప్రజాస్వామికము democratic
ప్రజాస్వామ్యము democracy
ప్రతి copy
ప్రతిబింబము reflection
ప్రతిభ genius
ప్రతిభాసము illusion
ప్రతీతి knowledge
ప్రత్యక్షము perception, perceptual knowledge
ప్రత్యభిజ్ఞ recognition
ప్రభావము influence
ప్రభుత్వము government
ప్రమ valid knowledge
ప్రమాణము instrument of measurement, criterion
ప్రమాత One that measures subiect
ప్రమాతృకము subjective
ప్రమేయము object of valid knowledge
ప్రయోజనము utility
ప్రవృత్తి activity
ప్రాతిభాసికము illusory
బహుత్వవాదము pluralism
బాధ contradiction, pain
భక్తి participation, devotion
భావన imagination
భావము idea, form, existence, purport, concept,
భుజము side
భూతము element, physical substance
భౌతికము physicial
భౌతికవాదము materialism
భ్రమ error
భ్రమణము rotation
మనస్సు mind
మనోనిశ్చయము judgement
మనోవ్యాపారము activity of the mind
మాతృప్రతికా భావం relation of the original and the copy
మారకము exchange
ముద్రాముద్రితభావము relation of the mould and the cast
మూర్తము finite
యథార్థము real
యదృచ్ఛ accident
యాథార్థ్యము reality
యాదృచ్ఛికము accidental
యుక్తి argument, reason
యోగిజన్య జ్ఞానము mystic insight
రమణీయము beautiful
రాజ్యము state

రాజ్యాంగము constitution
రామణీయకము beauty
రూపకము drama
రూపము colour
రేఖాగణితము geometry
లక్షణము characteristic
వంచకము counterfeit
వక్తవ్యము expressible
వర్గకలహము class-conflict
వర్గము class
వస్తువు thing, content of a work of art
వాసన instinct
వాస్తవము fact, factual, real, actual
వాస్తవికతావాదము realism
వాస్తువు architecture
వికల్ప imagination, ideation
వికల్పనాశక్తి faculty of imagination or ideation
వికారము change, ugliness
వికృతి act of change, ugliness
విచారము enquiry
విజ్ఞానశాస్త్రము natural science
విప్లవము revolution
వివేకము rationality
విశిష్టము qualified
విశ్వాసశక్తి faculty of faith
విషయము object
విస్తీర్ణత area
వృత్తి function, profession, existence, glossary
వృత్తికారులు artizans
వైవిధ్యము diversity
వ్యంజకము that which manifests or reveals
వ్యంజన function of manifestation
వ్యక్తము manifested
వ్యక్తి individual particular manifestation

జి.వి.కృష్ణరావు

వ్యజ్యమానము which is being manifested
వ్యతిరేకి negative
వ్యత్యయము discrepancy, displacement
వ్యాపారము activity
వ్యాప్తి invariable concomitance
వ్యాయామము gymnastics
వ్యావహారికము phenominal
వ్యుత్పన్నత scholarship
శక్తి power, significance, faculty
శబ్దము sound word
శరీరము body
శాస్త్రకారులు scientists, philosophers
శాస్త్రము science
శిక్షణము instruction
శ్రవణము faculty of hearing
శ్రవ్యత audibility
శ్రవ్యము audible
శ్రావ్యము musical
సంకల్పము will
సంఖ్య number
సంఘటన event, arrangement
సంబంధము relation
సంభావనీయత probability
సంవేదనము feeling
సంవేదము affliction
సంసారము mundane world
సంస్కారము tendency, reform, latent impression
సంస్కృతి culture
సంస్థ Institution
సత్ being
సత్తా beingness
సత్తావాదము existentialism
సత్యము truth

సమన్వయము co-ordination

సమము uniform

సమాజము society

సమానత్వము equality

సమానాధికరణము co-existence

సమాహారము totality

సమీక్ష review

సమ్మిశ్రితము mixed

సమ్యగ్దర్శనము vision of truth

సరకు commodity

సరళరేఖ straight line

సహకారము co-operation

సాదృశ్యము likeness

సాధనము means

సాధర్మ్యము similarity

సాధారణము general

సాధారణీకృతి universality

సాధ్యము end

సాపేక్షము relative

సాపేక్షవాదము theory of relativity

సామరస్యము harmony

సామాన్యము general

సాహచర్యము concomitance, association

సిద్ధాంతము theory, established conclusion

సుఖము pleasure

సృజనము creativity

సృష్టి creation

సృష్టిక్రమము cosmology

సేవక సేవ్యభావము the relation of the servant and the master

సొంత ఆస్తి private property

సోపాధికము hypothetical

స్పర్శవిషయము object of touch

స్మరణము reminiscence

స్మర్తవ్యము reminiscent

స్మృతి memory

స్వతంత్రసత్తా independent existence

స్వతంత్ర సిద్ధాంత ప్రవర్తకులు profounders of independent theories

స్వయంగతికము self-mover

స్వయంభువు self-existent

స్వయమవచ్ఛిన్నత self-determinedness

స్వయంసంపూర్ణత self-sufficiency

స్వయంసంపూర్ణము self-sufficient

హేతువు reason

హ్రాసము devolution

దేశంలో తెలుగు పత్రికలు చాల ఉన్నాయి. అన్నీ తెలుగువారి మానసిక వికాసానికి తోడ్పడుతున్న వనటంలో ఏమాత్రం సందేహం లేదు. అయితే యింతవరకు వచ్చిన జేగంటలు రెండు భాగాలు 'భారతి' లేకుంటే ఎంతవరకు ఆంధ్రలోకాన్ని సందర్శించి ఉండేవో చెప్పటం చాల కష్టం. ఈ రెండు భాగాల్లో ఏవైనా మంచి ఉంటే, ఆ మంచికి దోహద మిచ్చింది 'భారతి' సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాదుగారు. వారికి రచయిత కృతజ్ఞుడు.

# కాంట్ పరతత్త్వ వాదం

భావాల చరిత్ర చాల విచిత్రం. కొన్ని భావాలు మానవులను కీలుబొమ్మలుచేసి మారణహోమాలు రేకెత్తిస్తాయి; వాటిని అభ్యుదయ విప్లవాలంటాయి. అవి చండ శాసనాలై అవకాశం ఉన్నంతవరకూ ఏలుతూనే ఉంటాయి. మరొక రకమైన భావాలు ఈ గడబిడ లేమీ చేయవు. అసలు ఉన్నట్లే కనిపించనంత సౌమ్యంగా ఉంటాయి. అయితే యివి వివేచనాశీలునికి గిలిగింతలు పెడతాయి. నూతన భావాలు రేకెత్తిస్తుంటాయి. అంతేగాని కత్తిపుచ్చుకొని శాసించవు. వీటి ఉపదేశాలు హృదయకుహరంలో అనురణనంపొందే ఆత్మ ప్రబోధాలవలె ఉంటాయి. ఇవి విశ్వమానవ సౌభ్రాతృత్వానికి, స్వాతంత్ర్య వికాసానికీ, తత్త్వాన్వేషణకూ ప్రాతిపదికలు. ఈ తరగతికి చెందినవే ఇమాన్యుయల్ కాంట్ సిద్ధాంతాలు.

ఆధునిక పాశ్చాత్య దార్శనికులలో కాంట్ అగ్రేసరుడుగా పరిగణింపబడుతున్నాడు. అతడు 1724 ఏప్రిల్ 22న తూర్పు ప్రష్యాలోని కోనిగ్స్‌బర్గ్ నగరంలో జన్మించాడు. అతని తలిదండ్రులు పేదలు. అతనితో బుట్టువులు పెండ్లి అయ్యేటంతవరకు ఇతరులకు పనిపాటలు చేసిపెట్టి పొట్టపోసుకొనేవారు. కాంట్ సోదరుడు విశ్వవిద్యాయంలో చదివి ఉత్తీర్ణుడై మత గురువయ్యాడు. కాంటుకు పన్నెండవ ఏట తల్లి, 21వ ఏట తండ్రి గతించారు.

పదమూడవ ఏట కాంట్ విశ్వవిద్యాలయ కళాశాలలో ప్రవేశించాడు. మొత్తంమీద ఏకొలది సంవత్సరాలో తప్ప అతని జీవితమంతా కోనిగ్స్‌బర్గులోనే గడిచింది. ఆకాలంలో యం. ఏ. డిగ్రీకి, డాక్టరేట్‌కీ విద్యావిషయంలో పెద్ద వ్యత్యాసం లేదు. కాని డాక్టరేట్ పుచ్చుకోవాలంటే ఎక్కువ డబ్బు చెల్లించవలసి ఉండేది. ధనాభావంవల్ల కాంటు యం. ఏ. పరీక్షకే కూర్చుని డిగ్రీ సంపాదించాడు. తరువాత భుక్తికోసమని కోనిగ్స్‌బర్గు పరిసరాలలోని శ్రీమంతుల బిడ్డలకు విద్య బోధిస్తూ వచ్చాడు. 1746 నుంచి 1755వరకు జీవయాత్ర ఇలాగే గడిచింది. 1770లో అతనికి కోనిగ్స్‌బర్గ్ విశ్వవిద్యాల యంలో తత్త్వశాస్త్రాచార్య పదవి లభించింది.

కాంట్ నాటి జర్మన్ తత్త్వశాస్త్రవేత్తల సిద్ధాంతాలను ఆకళించుకొన్నాడు; డెస్కార్టిస్, లెబనిజ్, లాకీ, బర్క్లీ మొదలైన పాశ్చాత్య దార్శనికుల సిద్ధాంతాలను జీర్ణించుకొన్నాడు.

న్యూటన్ గణితశాస్త్రం, రూసో సిద్ధాంతాలు మననం చేశాడు. నాటి ఫ్రెంచి విప్లవ సిద్ధాంతాలకు స్వాగతమిచ్చాడు. అతడు మహాదుమహార్తులా ప్రజాస్వామ్యవాది స్వాతంత్ర్యం అతనికి ప్రాణప్రదం. ఈ లక్షణాలే అతని తత్త్వవిచారాన్ని చాలవరకు దిద్దితీర్చాయి. ముఖ్యంగా స్వాతంత్ర్యాభిలాష లేకపోయినట్లయితే అతని సిద్ధాంతాలు మరొక విధంగా ఉండేవి.

అతని దినచర్య అత్యంత క్రమబద్ధంగా నడిచేది. రోజూ ఏ గడియన ఏ పనిచేసేవాడో ఎన్ని అవాంతరాలు వచ్చినా ఆ పని ఆ గడియన విధిగా నిర్వర్తించేవాడు. అందువల్ల అతని దినచర్యనుబట్టి కోనిగ్స్‌బర్గు ప్రజలు తమ గడియారాలను సరిదిద్దికొంటూ ఉండేవారట.

కాంట్ ఆజన్మ బ్రహ్మచారి. క్రమబద్ధం కావటంవల్ల అతని జీవితం ఎగుడు దిగుళ్ళు ఎరుగదు. అంత జ్ఞానవంతుడైనా అతనికి అహంకారం ఏ కోశానాలేదు. జ్ఞానవంతుడు కాబట్టి తన జీవితమే సార్థకం, సామాన్యప్రజల జీవితాలు నిరర్థకాలన్న దురభిమానం అతనికి లేదు. తత్త్వశాస్త్రానికి ఇతర శాస్త్రాలు లోకువ అని కాని, రామణీయకం నిరర్థకమని కాని అతడు ఒప్పుకోడు. ఆయా రంగాలలో ఆయాశాస్త్రాలే ప్రమాణాలని అంగీకరించి వాటికి స్వాతంత్ర్యం ప్రతిపాదించాడు. ''నాది అన్వేషక బుద్ధి. జ్ఞానం పొందాలనీ, క్రొత్త క్రొత్త విషయాలు తెలుసుకోవాలనీ నాకు ఉత్సాహం. మానవజీవితానికి ఉదాత్తతను ప్రసాదించేవి ఇవేనని ఒకప్పుడు విశ్వసించేవాణ్ణి. మూఢజనులను ద్వేషించేవాణ్ణి. కాని రూసో నన్ను చక్కదిద్దాడు. ఈ కల్పితాధిక్యం అదృశ్యమై పోయింది. సామాన్య ప్రజలను గౌరవించటం నేర్చుకొన్నాను. మానవసహజాలైన స్వత్వాలను మానవులందరికి నా సిద్ధాంతాలు ప్రతిపాదించగలవన్న నమ్మకం నాకు లేకపోతే, సామాన్య కార్మికుని జీవితంకంటే కూడ నా జీవితం నిరర్థకమని భావిస్తాను.'' ఈ వాక్యాన్నిబట్టి అతని స్వభావం అర్థం చేసుకోవచ్చును.



కాంట్‌సిద్ధాంతం ఒక్కసారిగా ఊడిపడ్డదికాదు. హ్యూమ్ రచన అతనిని 'మూఢనిద్ర' నుంచి మేలుకొలిపింది. దానితో విచారం రేకెత్తి, క్రమక్రమంగావికాసంపొంది జ్ఞాన స్వరూప విచారం Eritique of Pure Reason), ధర్మ స్వరూప విచారం (Critique of Practical Reason) రామణీయక స్వరూప విచారం (Critique of Judgment) అన్న మూడు ఉద్గ్రంథాలతో పూర్ణస్వరూపం సంతరించింది. మొదటి గ్రంథం 1781లోను, రెండవది 1788లోను, మూడవది 1790లోను వెలువడ్డాయి. ఈ మూటిని ప్రస్థానత్రయమని చెప్పవచ్చును. ఈవాదాన్ని పరతత్త్వ వాదమనీ (Transcendental Philosophy), విమర్శక వాదమనీ (Critical Philosophy) అంటారు ఇవికాక 1783లో

జి.వి.కృష్ణరావు

దిగ్రోలిగామినా, 1785లో ధర్మదర్శన మూలసూత్రాలు అన్న రెండు గ్రంథాలు అతడు వ్రాశాడు. ''నిత్యశాంతి'' అన్న అతని రచన 1795లో వెలువడింది. అతని రచనలలో సామాన్యులకు కొంతవరకు అందుబాటులో ఉన్నది ఈ పుస్తకమే. ఇవికాక ప్రస్థానత్రయానికి పూర్వం ఎన్నో వ్యాసాలు, పుస్తకాలు వ్రాశాడు. ఈ విధంగా తన సిద్ధాంతాలను సమగ్రంగా వివరించిన తరువాత 1804 ఫిబ్రవరి 12న కాంట్ మరణించాడు. విశ్వవిద్యాలయం, కోనిగ్స్‌బర్గ్ నగరం అశ్రుతర్పణాలు విడిచి తమ యోగ్యతను చాటుకొన్నవి.

## జ్ఞానస్వరూప విచారం

'జ్ఞానస్వరూప విచారం'లో ప్రమాణస్వరూపాన్ని పరామర్శించి, జ్ఞానతత్త్వాన్ని చర్చించి, మేరలను నిర్దేశించి ఆ విద్యను కాంట్ వివరించాడు. దానితో ఏర్పడుతున్న దార్శనిక అర్థాలను అతడు సిద్ధాంతీకరించాడు. అందువల్ల తత్త్వజిజ్ఞాసువులకు ఈ గ్రంథపరిశీలనం అవసరం. కాని ఇది అంత తేలికగా అర్థంకాదు. ప్రతివాక్యం తర్కకర్కశం. పరిభాషాక్లేశం, సర్వతోవ్యాప్తం. వాక్యాల అన్వయాలు సుబోధకాలు కావు. పైగా ప్రతిపాదించే అర్థాలు విచిత్రమైనవి. దానితో అర్థం చేసుకోవటం మరీ కష్టం అందువల్లనే కాబోలు ఎన్నో వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. ఇంకా వెలువడటానికి అవకాశం ఉన్నది. మరీ చిత్రం ఏమంటే ఈ వ్యాఖ్యాతల భాష్యాలలో ఒండొంటికి పొత్తులేదు. షోపనార్ కాంట్ సిద్ధాంతంపై సాగించిన విమర్శతో మనం ఏకీభవించక పోవచ్చును. కాని కాంట్ శైలిని గూర్చి వ్రాసిన వాక్యాలు గమనింప దగ్గవి:-

''రచనలో అపూర్వనీరసత్వం ఉన్నది. ఇలాంటిది మళ్ళీ అరిస్టాటిల్ శైలిలోనే నాకు గోచరించింది. అయితే అద్ది సులభతరం. కాంట్ భాష తరచు అస్పష్టంగా అనిర్దిష్టంగా ఉంటుంది; భావాన్ని పూర్తిగా వెల్లడించజాలదు. దీనికితోడు కొన్ని పట్ల అయోమయం. ఈ అయోమయతకు విషయక్లిష్టత, భావగంభీరత కొంతవరకు కారణాలు. అయినా యీ అయోమయత్వం, అయోమయత్వమే.''

జీవితాలు వెచ్చించి వ్యాఖ్యానాలు వ్రాసినవారే భిన్నార్థాలు చెబుతున్నారంటే, ఈగ్రంథ క్లిష్టతనుగూర్చి వేరే వివరించవలసిన అవసరం లేదు. దాదాపు ప్రతివిమర్శకుడూ కాంటు రచనలో స్వవచన వ్యాఘాతాలున్నవన్నవాడే. కాంట్ సిద్ధాంతాలను విమర్శిస్తూ, ''భావాలలో ఒండొంటికి పొందిక లేదు. ఇలాంటి బాధ ఏర్పడుతున్నదన్న విషయం గమనించను కూడా గమనించడు,'' అని హెన్రీసిడ్విక్ వ్రాశాడు. అతడు విమర్శకుడు

కాబట్టి ఒరస వగాటకు అంత పట్టింపు లేదు. విమర్శనంలో ఎప్పుడూ తారతమ్యాలు ఉండనే ఉంటాయి. కాని 'నేను వ్యాఖ్యానం వ్రాస్తా'నంటూ, "వాదావు ప్రతి అధ్యాయంలోను కాంట్ తన్ను తాను అన్యధాకరించుకొన్నాడు. కేవలం పరస్పర విరుద్ధార్థాలతో వాడని పారిభాషికపదం దాదాపు లేదనే చెప్పవచ్చును," అని అనటం వ్యాఖ్యాతకు లక్షణం కాదు. అర్థం కానప్పుడు పుస్తకంజోలికి పోకపోవటం ఉత్తమం. అంతేకాని వ్యాఖ్యానిస్తానంటు ఇలాంటి విమర్శకు పూనుకోవటం వ్యాఖ్యాతకే గౌరవహాని. నిజంగా ఒక రచయితను అర్థం చేసుకోవాలంటే విరుద్ధంగా భాసించే అర్థాలకు సమన్వయం ఏర్పరుచుకోవాలి. అలా ఏర్పరచుకొన్నప్పుడు రచయిత అభిమతం తెలుసుకోవటానికి వీలవుతుంది. అలా సమన్వయించుకొన్న అర్థాలతో ఏకీభవించినా ఏకీభవించకపోయినా అది వేరే సంగతి. వ్యాఖ్యాత అయినవాడు విరుద్ధంగా కనిపించే అర్థాలను సమన్వయించి చూపుతాడు. సద్విమర్శకుడు అలా అన్వయించుకొని అర్థం చేసుకొని గుణావగుణాలను వివరిస్తాడు. ఇంతకూ కాంట్ రచనలోని అయోమయత్వం ప్రొఫెసర్ పాటన్ పేర్కొన్నట్లు విమర్శకులు సృష్టించిందే తప్ప నిజంగా లేదు. "ఎక్కడన్నా నిజంగా అయోమయత్వం ఉంటే దానికి రెండు కారణాలున్నవి. (1) ఆ గ్రంధాన్ని ఆదరాబాదరా వ్రాయటం, (2) ప్రతిపాద్య విషయాలు క్లిష్టాలూ, నవ్యాలూ, కావటం." అంతకు తప్ప మరేమీ లేదు.

256

ఈ ఉపక్రమణికను ఇంతతో ముగించి కాంట్ సూచిస్తున్న సమస్యను, పరిష్కార మార్గాన్ని చూదాము.

## లౌకిక అలౌకిక జ్ఞానాలు

మనకున్న జ్ఞానం రెండువిధాలు:– (1) అనుభవంవల్ల కలుగుతున్న లౌకిక జ్ఞానం. (2) అనుభవంతో నిమిత్తం లేకుండా కలుగుతున్న అలౌకిక జ్ఞానం. అనుభవంవల్ల కలుగుతున్న జ్ఞానం ఇంద్రియాలవల్ల, బుద్ధివల్ల కలుగుతున్నది. మొత్తంమీద ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలవల్ల కలుగుతున్నదంతా మొదటిదాని క్రిందికి వస్తుంది. ఈ జ్ఞానం వ్యక్తికం. పైగా అనుభవంమీద ఆధారపడుతున్నది. అందువల్ల దీనికి క్షతి తప్పదు; స్వయం ప్రకాశత్వం ఉండదు. ఈ జ్ఞానం ఎలా కలుగుతున్నదో, మరొకవిధంగా ఉండటానికి ఎందుకు వీలులేదో తెలియదు. దృష్టాంతం కాకుల నలుపుదనం. కాకి నల్లగా ఉంటుందని అనుభవంవల్ల తెలుస్తున్నది. అనుభవం లేక యీ జ్ఞానమే లేదు. అయితే యీ జ్ఞానానికి ఇకముందు బాధ కలగదని చెప్పలేము. ఇంతవరకూ మనకు కనిపించినకాకులన్నీ నల్లగానే ఉన్నవి. కాని రేపు తెల్లనికాకులు కనిపించరాదన్న నియమమేమున్నది? పైగా కాకికీ, నల్లదనానికీ సంబంధమేమిటి? ఎందువల్ల అది తెల్లగా ఉండటానికి వీలులేదు? కాబట్టి

ఈ జ్ఞానం అబాధితం కాదు. అనుభవంమీద ఆధారపడుతున్నది. కాబట్టి నిరుపాధికం కాదు. స్వయంప్రకాశమానము కాదుగనుక సంభావ్యము (apodictic) కాదు. ఇలాంటి జ్ఞానాన్ని వ్యావహారిక జ్ఞానమనీ, లేక లౌకిక జ్ఞానమనీ, లేదా అపరావిద్య అనీ అనవచ్చును.

రెండవ రకమైన జ్ఞానం అలాకాదు. అది అనుభవం వల్ల కలగటంలేదు. ఏకాలంలోను దానికి క్షతి లేదు. పైగా అది స్వయం ప్రకాశమానమూ, సంభావ్యమూను.

ఇందుకు రెండురెళ్ళు నాలుగు అన్నదే దృష్టాంతం. ఈ జ్ఞానం అనుభవజన్యం కాదంటే ఆశ్చర్యం కలగక మానదు. అసలు అనుభవజన్యం కాదని ఎలా అంటున్నాము? ప్రపంచంలోని రెండు రెండ్ల వస్తువులన్నిటినీ మనం లెక్కపెట్టలేదు. అయినప్పటికీ రెండు రెళ్ళు నాలుగే అవుతవి కాని అయిదు ఎన్నటికీ కావు. ఇవాళ మనదేశంలో కాంగ్రెసుపార్టీ అధికారంలో ఉన్నది. నాలుగువందల సంవత్సరాల తరువాత ఎవరు ఈ అధికారం చేపడతారో చెప్పలేము. కాని అప్పుడు కూడా ఇద్దరు మంత్రులు, ఇద్దరు మంత్రులూ కలిసి నలుగురు అవుతారు కాని ఐదుగురు మంత్రులు కారు. ముందు జరగబోయే దాని ప్రత్యక్షంద్వారా చూస్తున్నామనటానికి కాని, అనుమానం ద్వారా ఊహిస్తున్నా మనటానికి కానీ వీలులేదు. అయినా రెండురెళ్ళు నాలుగు అన్న దానికి క్షతి ఏర్పడదు. మరొక విధంగా అది ఉండటానికి వీలులేదు. ఈ రకమైన జ్ఞానం అలౌకికజ్ఞానం, లేదా పరావిద్య అనవచ్చును.

ఈ పరావిద్య, అంటే అబాధితమూ, నిరుపాధికమూ, సంభావ్యమూ అయిన జ్ఞానం మనకు ఎలా లభ్యమౌతున్నది? అనుభవం పొందకుండానే ముందుగా కొన్ని కొన్ని విషయాలను ఎలా తెలుసుకోగలుగుతున్నాము? రస్సెల్ పేర్కొన్నట్లు శూన్యవాది అయితేతప్ప తత్త్వవేత్త అయిన ప్రతివాడూ దీనికి సమాధానం చెప్పాలి. ఈ సమస్యను సవ్యంగా పరిష్కరించటమంటే, ప్రకృతి సమాజ శాస్త్రాల సమస్యలను, తత్త్వశాస్త్ర సమస్యలను పరిష్కరించటమే అవుతుంది.

ఈ విద్య ఎలా ప్రాప్తిస్తున్నదో శ్రీమతి అనుభూతిని ప్రశ్నిస్తే ప్రయోజనం ఉంటుందా? రాజకీయ నాయకులకు రహస్యాలుంటవి. పార్టీనియమావళి ఉంటుంది. ఇది అనుమతించినా, ప్రజల ప్రాపకం సంపాదించవలసి ఉంటుంది. నిజం చెప్పటానికి ఇవన్నీ ఒకవేళ ప్రతిబంధకాలు కాకపోయినా, అసలు రహస్యం నాయకులకే తెలియక పోవచ్చును. ఇలాంటి బాధలే శ్రీమతి అనుభూతికి ఉండవని నమ్మకమేమిటి? కాబట్టి శిష్యమాత్రులమై అనుభూతికి సేవచేసినా ప్రయోజనంలేదు. భౌతికశాస్త్రకారుడు ప్రకృతి ఏమి చెబుతుందా అని ఎదురుచూడడు. ప్రకృతి విలాసాలను ఇది హావం, ఇది భావం

లవి వర్ణిస్తూ కూర్చోడు. దానికి దినచర్య వ్రాస్తూ ఉండడు. న్యాయాధికారి కోర్టులో సాక్షిని తనకు కావలసిన ప్రశ్నలడిగి సమాధానాలు పొందుతాడు. వాటినిబట్టి సత్యం తెలుసుకోటానికి యత్నిస్తాడు. అలాగే శాస్త్రకారుడుకూడా ప్రశ్నావలి తయారుచేసి, "దీనికి ఏమి చెబుతావు? మరి దీని కేమిటి?" అని గుచ్చి గుచ్చి ప్రశ్నిస్తాడు. అంటే ప్రమాణశాస్త్ర (Pure Logic) విహితమైన తన సిద్ధాంతాలకు అనుగుణంగా పరిశోధనలు సాగించి ఆ పరిశోధన సఫలమైతే అది యథార్థమని తెలుసుకొంటాడు. ఏ శాస్త్రానికైనా ఇదే మార్గం. కేవలం శుశ్రూషవల్ల ప్రయోజనం లేదు. శుశ్రూషచేస్తూ కూర్చుంటే గురువు తనకు ఇష్టమైన అర్థాలను మాత్రమే శిష్యులకు బోధించినట్లుగా ప్రకృతి తన కిష్టమైన విషయాలను మాత్రమే వెల్లడిస్తుంది

"ఇంతవరకూ మనం జ్ఞానం, విషయప్రకారకమని భావించటం జరిగింది. ఈ భావాన్ని అనుసరించి అనుభవప్రాప్తికి ముందుగా విషయజ్ఞానం సంపాదించటానికి యత్నాలు జరిగి విఫలమైపోయాయి. ఈ పద్ధతి వదలి విషయం, జ్ఞానప్రకారకమని భావించి పరిశీలనసాగిస్తే దార్శనిక కృషి సఫలమౌతుందో లేదో ప్రయత్నించి చూడాలి. ఇది పరావిద్యాప్రాప్తికి ఎక్కువ అనుకూలిస్తుంది."

258 కాబట్టి ఈ పద్ధతినే అవలంబించి పరావిద్య తత్త్వం పరిశీలించటం అవసరం. ఈ మే జ్ఞాన స్వరూప విచారంలో పరామృష్టమైంది. ఈ గ్రంథం మొదటి భాగంలో మన ఐంద్రియకత (Sensibility or Intuition) వల్ల లభిస్తున్న పరతత్త్వ సూత్రాలు విశదదృష్టితో నిర్ధారించటం జరిగింది. "ఈ భాగం అపూర్వం, అత్యంత విశిష్టం. ఇది ఒక్కటే కాంట్ ప్రతిష్ఠకు అమరత్వం ప్రసాదించి ఉండేది. ఇందు ప్రతిపాదించిన ఉపపత్తులు సంపూర్ణ విశ్వాసజనకాలు. ఇందు ఉపపాదించిన అంశాలు అప్రతిహత సత్యాలని భావిస్తున్నాను. ప్రపంచంలో అత్యంత ఫలప్రదమైన వాక్యాలలో ఇవి కొన్ని. ఇవి మహత్తర నవ్యదార్శనికార్థ సమున్మీలనాలు," అని సోపనార్ ఈ భాగాన్ని ప్రశంసించాడు. తన భావాలను కాంటుకు ఆపాదించి అతడు ఈ వాక్యాలు వ్రాసినా, వీటిలో సత్యం లేకపోలేదు.

ఇక అసలు విషయానికి వద్దాము. కాంటు మతం ప్రకారం ఆత్మకు మూడు శక్తులున్నవి:- (1) ఐంద్రియకశక్తి (Intuition or Sensibility) (2) చింతనాశక్తి లేక బుద్ధి (understanding) (3) వివేచనాశక్తి (Reason) ఐంద్రియక శక్తి ఇంద్రియాలద్వారా అర్థాలతో ప్రత్యక్ష సంబంధం కలిగి ఉంటుంది. ప్రత్యక్షజ్ఞానం కేవలం ఐంద్రియకమే కాని ఇందులో ఆలోచన ఉండదు. రెండవదైన బుద్ధి ఐంద్రియక శక్తిపంచిన కాదు

ఇది సవ్యాపార. ప్రత్యయాల (concepts) ద్వారా ఐంద్రియకతా లబ్ధవిషయాలను ఆలోచిస్తుంది. వివేచనాశక్తి ఐంద్రియకతా లబ్ధాలు కాని విషయాలను ఆలోచిస్తుంది.

## దేశ కాలాలు

ముందు ఐంద్రియకతా స్వభావాన్ని పరిశీలింతాము. ఒకటి మనకు కనిపించాలి అంటే అది ఉండాలి. అదే వస్తువు. ఆ వస్తువు నుంచి వచ్చే వేదనలను (Sensations) మన ఇంద్రియాలు, బుద్ధి ఆదేశానుసారంగా స్వీకరిస్తాయి. ఇలా స్వీకరించిన వాటిని దేశకాలాలలో వ్యవస్థీకరిస్తాయి. బట్వాడా కావలసిన ఉత్తరాలను తపాలాఫీసులో, ఉద్యోగులు ఆయాప్రాంతాలవారీగా విభజించి క్రమత్వం ఏర్పరుస్తున్నట్లే, ఇంద్రియాలు వేదనలకు దేశకాల వ్యవస్థ కల్పిస్తాయి. అంటే వేదనలపై దేశకాలాలు అధ్యస్తాలవుతాయి.

దీనినిబట్టి దేశకాలాలు లేవనికానీ, ప్రాతిభాసికాలు అని కానీ అర్థంచేసుకోరాదు. ఇవి రెండూ ఉన్నవి. విడిగా మాత్రం లేవు. ఇంద్రియాల వృత్తులుగా (functions) లేక ఐంద్రియకతా రూపాలుగా (forms) ఉన్నవి. దేశం బాహ్యేంద్రియవృత్తి. కాలం అంతరింద్రియం, లేక అంతఃకరణం వృత్తి, అంతేకాని దేశకాలాలు అవేవి నైయాయిక వైశేషికులు భావిస్తున్నట్లు ద్రవ్యాలు కావు. సాంఖ్యులు, సాపేక్షతావాదులు విపరిస్తున్నట్లు ద్రవ్యవృత్తులు కావు. లాకీ, ఆధునిక వాస్తవికతావాదులు ఊహిస్తున్నట్లు ద్రవ్యగుణాలు కావని కాంట్ వాదన. ఇది పరతత్త్వవాదానికి ఆయువుపట్టు. దేశకాలాలు ఐంద్రియకతా వృత్తులు కావంటే కాంట్ సిద్ధాంతానికి గుడుసు చుట్టటమే.

దేశకాలాలు ఐంద్రియకతా రూపాలా? నాకు కనిపిస్తున్న యీపుట నా నేత్రాలు ఆరోపిస్తున్నదే తప్ప నిజంగా లేదా? నా గదిలో ఈ సమయాన ఈపుట చూస్తున్నానంటే, ఈ కాలాన్ని నా అంతఃకరణం అధ్యస్తం చేసిందే తప్ప నిజంగా లేదా? ఈ పుటలు, ఈ సమయాలు ఏమిటి? నిజంగా దేశకాలాలు మీకాంట్ మహాశయుని ఐంద్రియకతా వృత్తులే అయితే, ఆయన ఎప్పుడో అస్తమించాడు కాబట్టి నేను దేశ కాలాలలో లేకపోవాలి. నేను లేను అనటం ఎంత సబబుగా ఉన్నది? నా యింద్రియాలు నా శరీరానికి దేశకాలలు ఆరోపిస్తున్నవి కాబట్టి నేను దేశకాలాలలో ఉన్నానుకొన్నా, ఇతరుల కళ్ళు వారి కనుబొమలకు క్రిందుగా కనిపిస్తవేకాని చెవుల వెనుకాల ఎందుకు కనపించవు? మన చెవులు మన నెత్తిమీద ఎందుకుండవు? ఎప్పుడూ ముందు మెరుపు, ఆ తరువాతనే ఉరుము ఎందుకు గోచరిస్తున్నవి? ఇంద్రియాలకూ, అంతఃకరణకూ ఇంత పక్షపాతం, ఇంత దీక్ష దేనికి? పొరపాటునైనా ఎందుకు వ్యత్యయం జరగదు?

ఇలాంటి ప్రశ్నలు పరిశ్మితంగా బయలుదేరక తప్పదు. అయితే యీమాత్రం కాంట్ ఆలోచించకుండా ఉంటాడా? ఏ దృష్టితో ఇలా అన్నాడు? ఎందుకన్నాడు? ఉన్మత్తుని ప్రలాపాలకుకూడా ఒక అన్వయం, ఒకక్రమం, అర్థం ఉన్నవి. కాగా, కాంట్ లాంటి తత్త్వవేత్త వాక్యాలు అర్థరహితంగా ఉంటవా? కొంచెం ప్రశాంతంగా ఆలోచింతాము. పచ్చద్దాలజోడు పెట్టుకొన్నప్పుడు వస్తువులన్నీ పచ్చగా కనిపిస్తాయి. అలాగే మన మనస్సుకు దేశకాలాల జోడు తగిలించి ఉందనుకోండి. ఈజోడు తీసివేయటానికి వీలులేక, మనస్సు చూడటం మానుకోలేక పోయినప్పుడు ఏమౌతుంది? ఈ స్థితి ఊహించటం కూడా కష్టమే. కాబట్టి ఈ ఉపమానం కాసేపు అవల ఉంచుదాము.

మనం సాధారణంగా అనంతమైన దేశం మనచుట్టూ ఉన్నదని అనుకొంటాము. ఇది నిజంగా పరమంగా వేరుగా ఉన్నట్లయితే కెమేరాలు, దూరదర్శినీ యంత్రాలు, సూక్ష్మదర్శినీ యంత్రాలు నిరర్థకాలు కావాలి. ఎందుకంటెచిన్న ఫోటోలు తీయటానికి, తారాపథాన్ని దూరదర్శినులతో సన్నిహితం చేయటానికి, సూక్ష్మజీవులను పెద్దవిచేసి చూడటానికి ఎలా సాధ్యపడుతుంది? మన కళ్ళజోడు సంగతి ఏమిటి? మన దృష్టికి అనుగుణంగా త్రిపరిమాణాత్మకమైన దేశాన్ని మార్చుకోవటం లేదా? ఇదే నిజమైతే మనస్సుకు ప్రత్యేక దేశకాల రూపాత్మకమైన ఐంద్రియకశక్తి ఉన్నదన్నప్పుడు వైపరీత్యమేమున్నది? అయితే కాంటు మరొక అడుగు ముందుకువేసి అసలు దేశకాలాలు అనేవి ఐంద్రియకతా రూపాలు అంటాడు. దీనికి అతడు ఈ క్రింది ఉపపత్తులను చూపుతున్నాడు.



1. ఈ వస్తువు ఇక్కడ, ఆ వస్తువుఅక్కడ, ముందు టేబిలు, ప్రక్కన గోడ, పైన కప్పు ఉన్నదన్న జ్ఞానం కలుగుతున్నది. ఇక్కడ, అక్కడ, ముందు, ప్రక్క, పైన అంటున్నాము అంటే, ఈ అనుభవాలకు ముందే మనకు దేశజ్ఞానం ఉండాలి. లేనిపక్షంలో ఇక్కడ, అక్కడ అన్నజ్ఞానం కలగటానికి వీలులేదు. కాబట్టి దేశం అనుభవంతో కాని, అనుభవం అనంతరం కాని ఏర్పడటం లేదు. అనుభవానికి పరమందే, అంటే పూర్వమే దేశం ఉండాలి.

ఇలాగే ఆపని ముందుజరిగింది. వాడు తరువాతవచ్చాడు. ఈ పనులు ఒకేసారి జరుగుతున్నవి అన్న జ్ఞానం కలుగుతున్నది. ఈ జ్ఞానం అనుభవానికి పరమైనది కాకపోతే ముందు, తరువాత, ఏకకాలం మొదలైన జ్ఞానాలు సిద్ధించటానికి వీలులేదు. కాబట్టి దేశకాలాలు అనుభవంకంటె పరమైనవికాని అపరమైనవి కావు.

2. విషయాలనుంచి వేరుగా దేశకాలాలను ఎరుగవచ్చును. కాని, దేశకాలవిరహితంగా విషయాలను తెలిసికోలేము. కాబట్టి విషయాలకంటె దేశకాలాలు పరమైనవి.

( ఇక్కడ కాంట్ అభిప్రాయం నిజంగా విషయాలను విడిచి కేవల దేశకాలాలను గ్రహించగలమని కాదు విషయశూన్యమైన దేశంకాని, కాలంకాని గోచరించదు, ఈ అంశం జ్ఞానస్వరూప విచారంలోని మరొక ప్రకరణంలో అతడు స్పష్టంగా పేర్కొన్నాడు. శూన్యదేశం గోచరించదని మరొక రచనలో కూడా వివరించాడు. నిజానికి దేశకాలాలు గోచరించాలంటే దేశకాలగత విషయాలు గోచరించాలి. అయితే దేశకాల భావాలు మనకు కలగాలంటే దేశకాల గతములైన విషయాలు విగలితాలు కావాలని కాంటు అభిప్రాయమని ప్రొఫెసర్ పాటన్ వివరించాడు.)

3. దేశకాలాలు గోత్వాదులవలె జాతులు కావు. సమానప్రసవాత్మికమైన అనేక వ్యక్తులు ఉంటే, వాటిని ఒకే జాతిగా పరిగణిస్తాము. దేశమనేది ఒకటేకాని, అనేకాలు కావు. విభిన్నదేశాలు దేశంలోని భాగాలు మాత్రమే కాని వేరుకావు. అలాగే కాలంకూడా ఏకమే. కాబట్టి దేశకాలాలు ఇంద్రియవృత్తులే కాని చిత్తవృత్తులు కావు

4. దేశకాలాలు అనంతాలు, విభిన్నదేశాలు వాటి అంతర్భాగాలు. కాబట్టి జాతికీ వ్యక్తికీ ఉన్న సంబంధం, దేశానికి తదంతర్భాగాలకు కాని, కాలానికీ తందంతర్భాగాలకు కాని లేదు. కాగా దేశకాలాలు ఇంద్రియ వృత్తులే కాని చిత్త వృత్తులు కావు.



5. దేశం బంద్రియకతారూపం కాకపోతే, రేఖాగణితసూత్రాలు బాధితాలు కావాలి. ఉదాహరణకు ''త్రిభుజం యొక్క ఆంతరిక కోణాల మొత్తం రెండు సమకోణాలకు సమం,'' అన్న సూత్రం తీసుకొందాము. మనం ప్రపంచంలో ఇప్పుడున్న త్రిభుజ ఆంతరిక కోణత్రయాలన్నీ కొలవలేదు. ఇకముందు వచ్చే వాటినన్నిటినీ మనం కొలవలేదన్న సంగతి వేరే పేర్కొన నవసరంలేదు. అయినా ఏ త్రిభుజంలోనైనా ఆంతరికకోణాల మొత్తం రెండు సమకోణాలకు సమానంగానే ఉంటుంది. ఈ జ్ఞానం ఎలా కలుగుతున్నది? దేశం ద్రవ్యం కాని, తద్ధర్మం కాని కాక కేవలం బంద్రియకతారూపం కాబట్టి, రేఖాగణితసూత్రాలు అబాధితాలు, సంభావ్యమానాలు అవుతున్నవి. అంటే కాలం అంతఃకరణవృత్తే కాకపోతే, గతి, పరిణామం మనకు బోధపడటానికే అవకాశంలేదు. వాటిని అర్థం చేసుకోవటమంటే ఒకేవస్తువునకు విరుద్ధగుణాలను భిన్నకాలంలో ఆపాదించటమే. గతి పరిణామాల గ్రహణానికి కాలం సామాన్యోపాధి. ఈ ఉపాధి బుద్ధివల్ల ఏర్పడటంలేదు. కాబట్టి ఇది అంతఃకరణవృత్తి కావాలి.

కాగా, దేశకాలాలు ఇంద్రియ అంతఃకరణాల వృత్తులు. లేదా బంద్రియకతారూపాలు. అంతే కాని చిత్తవృత్తులు కావు. ఇది సిద్ధాంతమైతే బుద్ధీంద్రియ జన్యమైన అనుభవానికి

సంబంధించినంతవరకు ఇవి యధార్థాలు. ఈ అనుభవాన్ని అధిగమించినప్పుడు ఇవి కేవలం మానసిక భావాలు మాత్రమేకాని యధార్థాలుకావు. దీనినిబట్టి మనం వస్తువులను యథాతథంగా చూడటంలేదు.

మన ఇంద్రియాలు, అంతఃకరణం వస్తువులకు దేశకాలాలు ఆరోపించి చూపుతున్నవి. దేశకాలాధ్యస్తాలై వస్తువులు, విషయాలు అవుతున్నవి. అందువల్ల వస్తువులు వేరు, విషయాలు వేరు. యధాస్వరూపంతో ఉన్నవి వస్తువులు. బుద్ధీంద్రియవృత్తి సమవచ్చిన్న వస్తువులు విషయాలు. మనకు గోచరిస్తున్నవి విషయాలే కాని యధాస్వరూపంలో ఉన్న వస్తువులు కావు. మరి వస్తువులకు, విషయాలకూ సంబంధమేమిటి? వస్తువులు యధార్థాలు. విషయాలు ఆభాసాలు. (Appearances) అంత మాత్రాన ఆభాసాలకు వస్తువులు కారణాలనటానికి వీలులేదు. కారణ కార్యభావం కాలాన్ని అపేక్షిస్తుంది. కాలం అంతఃకరణ వృత్తేకాని వస్తువు కాదు. వస్తుగుణమూ కాదు. అందువల్ల విషయాలకు వస్తువులు కారణమని చెప్పలేము.

ఈవిధంగా రెండు ప్రపంచాలేర్పడుతున్నవి. ఒకటి, యధార్థ వస్తుప్రపంచం. రెండు అభాసికమైన విషయ ప్రపంచం. ఈ వాక్యానికీ ముక్కకి ముక్కగా అర్థం చెప్పుకొని విభిన్నమైన రెండు ప్రపంచాలు వేరు వేరుచోట్ల వేరు వేరుగా ఉన్నవని భావించరాదు. ఉన్నది ఒకటే ప్రపంచం. అది వస్తుప్రపంచం. ఆ ప్రపంచమే మనకు అనుభవ గోచరమైనప్పుడు విషయ ప్రపంచం, లేదా ఆభాసిక ప్రపంచం అవుతున్నది ఇలా అన్నంతమాత్రాన మనకు గోచరిస్తున్న ప్రపంచం రజ్జుసర్పం, స్వప్నతురంగం లాంటి ప్రాతిభాసికమని భావించరాదు. భ్రాంతి తొలగితే సర్పం అంతరించి రజ్జువేకనిపిస్తుంది. జాగృతి ఏర్పడగానే స్వప్నతురంగం మటుమాయమౌతుంది. ఈ విషయప్రపంచం అలాకాదు. జీవకోటి ఉన్నంతవరకు, బుద్ధి ఇంద్రియాలు ఉన్నంతవరకూ ఇది ఉంటూనే ఉంటుంది. వస్తుప్రపంచం వేరు, విషయ ప్రపంచం వేరు అన్నజ్ఞానం కలిగి, మననం చేసి తపించినా విషయ ప్రపంచంమాత్రమే గోచరిస్తుంది తప్ప, వస్తుప్రపంచం గోచరించదు.

ఈ సంగతి అలా ఉంచి మరొక విశేషం గమనించవలసి ఉంది. దేశకాలాలను విడదీసి దేశం బహిరింద్రియ వృత్తి అనీ, కాలం అంతరింద్రియవృత్తి అనీ, కాంటు పేర్కొన్నాడు. ఇది విమర్శకులలో వివాదాలకు దారితీసింది. కాలం అంతఃకరణ వృత్తి అవటంలో అర్థం లేకపోలేదు. మన మనోభావాలు కాలగతాలేకాని దేశగతాలు కావు. మన మనస్సు కాలంలో ఉన్నట్లు తెలుస్తున్నదే గాని, దైశికవిస్తృతి ఉన్నట్లు ప్రత్యక్షంగా తెలియటంలేదు. మాపాదులు దేశగతాలని ప్రత్యక్షంగా తెలుస్తున్నది. మనస్సు దేశగతమని పరోక్షంగానైనా

తెలియటానికి కారణం, శరీరాకాశాన్ని (Space) మనస్సుకు ఆరోపించటమే.

ఇంతవరకూ బాగానే ఉన్నది. దేశం బాహ్యేంద్రియ వృత్తేకదా? వేదనలను దేశంలో వ్యవస్థీకరించేది బాహ్యేంద్రియమేకదా? అయినప్పుడు కొన్ని విషయాలు గుండ్రంగాను, మరికొన్ని నలుచదరంగాను, ఎందుకు కనిపిస్తున్నవి? ఈ విషయమై నిర్దిష్టంగా కాంటు ఏమీ చెప్పలేదు. కాని కొంతమంది వ్యాఖ్యాతలు మాత్రం మనస్స్వభావంవల్ల గుండ్రంగా నలుచదరంగా ఇలా నానాకారాలతో విషయాలు కనిపిస్తున్నవని అంటున్నారు.

''ఇది బాధ్యత గమనించని వాదం. ఇదే నిజమైతే వేదనలు దేశకాలాతీతాలని, కాంటు తాత్పర్యమైనట్లు చెప్పవలసి వస్తుంది. వేదనలు దేశకాలాతీతాలు కానప్పుడు పై వాదన నిలవదు. విషయ ఆకారాలలోని భేదం, ఇతర వ్యావహారిక గుణాల వలెనే విషయభిన్నమైన వస్తుస్వరూప ప్రభావంవల్ల బాహ్యేంద్రియం ఆయా ఆకారాలను ఆపాదిస్తున్నది.''

అయితే మరొక సందేహం:– దేశకాలాలు మనః కల్పితాలు కదా? నామనస్సు కల్పించే దేశకాలాలు, ఇతరుల మనస్సులు కల్పించే దేశకాలాలు ఒకటేనా? నామనస్సు దేశకాలాలను కల్పిస్తున్నప్పుడు నాకు గోచరించే ఇతర మానవులు, వారిభావాలు ఆభాసాలు కావా? నాస్నేహితుడు నాతో మాట్లాడుతున్నాడంటే ఈ సిద్ధాంతంప్రకారం నాదేశకాలాలు ఒకవిధంగా ఉండి, నా మిత్రుని దేశకాలాలు మరొకవిధంగా ఉండి, అతడు చెప్పినదానిని నేను వినటానికి, నేను అడిగినదానికి అతడు సమాధానం చెప్పటానికి ఎలా అవకాశమేర్పడు తున్నది?

ఇతరుల అనుభవాలకు దేశకాలాలు ఉపాధులన్న జ్ఞానం మనకు ఎలా కలుగుతున్నదో, అసలు అనుభవాలు పొందుతన్న ఇతర మానవులున్నారని మనకు ఎలా తెలుస్తున్నదో కాంటు వివరించలేదు. కాని ఆ రెండూ ఉన్నవని మనం నిస్సందేహంగా భావించవచ్చును. ఇతరమానవులున్నారన్న దృష్టితోనే మన కార్యకలాపాలు, భావాలు కొనసాగుతున్నవి. అందరికీ సామాన్యమైన విషయప్రపంచం ఒకటి ఉన్నదన్న బుద్ధితోనే మన ఆలోచనలు, శాస్త్రార్థవిచారం సాగుతున్నవి. కాంట్ సిద్ధాంతం ప్రకారం మనస్స్వరూపం మనకు తెలియదు. మన ఆభాసమాత్రమే మనకు తెలుసు. అలాగే ఇతరులను ఆభాసాలుగా మాత్రమే మనం తెలుసుకోగలము. ఇతర మానవులను గూర్చి, వారి అనుభవాలను గూర్చి మనకు కలుగుతున్న జ్ఞానవిషయమై కాంట్ ప్రత్యేక చర్చ జరిపి వుండవలసినది. కాని అతడు ఆ పని చేయలేదు.

''విభిన్న మనస్సులకు ఒకే దేశకాలాలు ఉన్నవని మనకు ఎలా తెలుస్తున్నవని

ప్రశ్నించవచ్చును... నాకు తెలిసినంతలో ఈ విషయాన్ని కాంటు ప్రస్తావించలేదు. కాని ఒకటిమాత్రం నాకు బోధపడటం లేదు. ఇద్దరు మనుష్యులలో ప్రతి ఒక్కడూ సాధర్మ్యమూ, అనంతర్వమూ కలిగిన దేశకాలాలను చూస్తున్నాడంటూనే వారి దేశకాలాలు విభిన్నాలంటే బోధపడటం లేదు. వివేచించటానికి వీలులేని వాటికి తాదాత్మ్యం చెప్పుకోవాలన్న సూత్రం ఇక్కడ వర్తిస్తుందనుకొంటాను.

## చిత్తవృత్తులు

ఇంతవరకూ బహిరంతరింద్రియ వ్యాపారం పరిశీలించాము. బుద్ధి ఆదేశాన్ని శిరసావహించి ఈ వ్యాపారం వేదనలను (Sensations) స్వీకరించి దేశకాలాలతో వ్యవస్థీకరిస్తుంది. దీనితో శబ్ద స్పర్శ రూప రస గంధాలు గోచరిస్తాయి. కాని ఇవి సమన్వయ రహితంగా జ్ఞానం కాజాలవు. జ్ఞానం కలగాలంటే ఐంద్రియకవేదనలకు పరస్పర సంబంధం ఏర్పడాలి. గోళాకృతి, పసుపురంగు, కాఠిన్యం, ఒక విధమైన వాసన గోచరించాయను కోండి. అంతమాత్రాన మనకు జ్ఞానం కలగటంలేదు. ఆ విషయాలేమిటో తెలియటం లేదు. గోచరిస్తున్న యీ అర్థాలకు ఐక్యం ఏర్పాడాలి. ఈ ఐక్యమే బుద్ధివల్ల లభిస్తుంది. అయితే ఇది ఎలా సంభావ్యమౌతున్నదో చూదాము.



బుద్ధికి కంట్ మతం ప్రకారం ప్రధానంగా నాలుగు వృత్తులున్నవి. ఒకటి పరిణామం, రెండు గుణం, మూడు సంబంధం, నాలుగు సంభావ్యత, (Modality) ఈ నాలిగింటిలో ప్రతి ఒకటీ త్రివిధ భేదాత్మకం. ఈ విధంగా ఏర్పడుతున్న పన్నెండు వృత్తులు వికల్పన శక్తిచే అన్వయింపబడి పన్నెండు పదార్థాలు అవుతున్నవి. నైయాయిక వైశేషికులకు పదార్థాలు ఏడైతే, కాంట్ సిద్ధాంతం ప్రకారం ఇవి పన్నెండు. ఏకత్వము, బహుత్వము, సమాహారము అన్నవి పరిమాణ గతభేదాలు. యధార్థ్యము (Reality), ప్రతియోగిత్వము (Negation), నియతత్త్వము (Limitation). అన్నవి గుణగతభేదాలు. ద్రవ్యము కారణము, పారస్పర్యము (Reciprocity). అన్నవి సంబంధగత భేదాలు. సాధ్యతాసాధ్యతలు, భావాభావాలు (Existence and non - existence) నిరుపాధికత్వ సోపాధికత్వాలు (Necessity and Contingency) అన్నవి సంభావ్యతా గతభేదాలు.

ఈ ద్వాదశ పదార్థాన్వయంతో మనకు విషయజ్ఞానం ఎలా కలుగుతున్నదో చూదాము. ఇంద్రియాలద్వారా గోచరించే వేదనలు అర్థం కావాలంటే స్మృతి, ప్రత్యభిజ్ఞ, పునఃకల్పన ఉండాలి. అలాకాక ఎప్పుడు గోచరించిన వేదనలు అప్పుడే మరచిపోయినా, కలిగిన వేదనలను గుర్తించ లేకపోయినా, గత వేదనలకు పునఃకల్పన జరగకపోయినా ప్రయోజనం లేదు. ఈ పనులను బుద్ధి ఆదేశానికి లోబడి అంతఃకరణం నిర్వరిస్తుంది. బాహ్యేంద్రి

యాలు ప్రతిపాదించే దేశగత వేష్టనము అంతఃకరణం కాలగతాలను పొందించి ఇదివరకే చెప్పుకొన్నాము. అంతేకాదు. అంతఃకరణం స్మృతి ప్రత్యభిజ్ఞాశక్తులతో వాటిని తిరిగి ఉత్పాదించి ఏకోన్ముఖం చేస్తుంది. ఇలా ఏకోన్ముఖాలై దేశ కాల గత సంవేదనలు చిత్తవృత్తి సమవచ్ఛిన్నాలై విషయజ్ఞానం ఏర్పడుతుంది.

ఉదాహరణ తీసుకొంటే కాంట్ ఏమి చెబుతున్నాడో తేలికగా బోధపడుతుంది. పైని చెప్పుకొన్న గోళాకృతి, పసుపురంగు, కాఠిన్యం, ప్రత్యేక వాసన, రుచి, అంతఃకరణంవల్ల ఏకోన్ముఖాలవుతవి. అప్పుడు బుద్ధి తన వృత్తిద్వారా అది నారింజపండని గ్రహిస్తుంది. ఈవిధంగా కాలగతమై మార్పుపొందనిది ద్రవ్యమనీ, కాలగతాలై మార్పు పొందుతున్నవి గుణాలనీ బుద్ధి భావిస్తుంది. అనన్యథాసిద్ధ నియతపూర్వభావి అయినది కారణమనీ, అనన్యథాసిద్ధనియత అపరభావి అయినది కార్యమనీ బుద్ధి వ్యవస్థ ఏర్పరుస్తుంది. అయితే యీ వివిధజ్ఞానాలను పొందటానికి సామాన్య చైతన్యం ఒకటి ఉండాలి. ఇది లేకపోతే ' ఇది ద్రవ్యమని నేను తెలుసుకొంటున్నాను. ఈ వాక్యాల్ని నేను చదువుతున్నాని తెలుసుకొంటున్నాను' అన్న అనువ్యవసాయం ఏర్పడటానికి వీలులేదు.

ఈవిధంగా దేశం ఇంద్రియవృత్తిజన్యము, కాలము, స్మృతి, ప్రత్యభిజ్ఞ, కల్పన (Reproduction) అంతఃకరణవృత్తి జన్యాలు, ఏకత్వాది ద్వాదశ పదార్థాలు చిత్తవృత్తి జన్యాలు అవుతున్నవి. మనకు కలుగుతున్న విషయజ్ఞానంలో నుంచి వీటి నన్నిటినీ తీసివేస్తే మిగిలినవి ఏమిటి? కాబట్టి విషయాలన్నీ మనఃకల్పితాలే. దీనినిబట్టి కాంట్ కేవలం విజ్ఞానవాది (Idealist) అనీ, మనః కల్పిత విషయప్రపంచం తప్ప మరేమీ లేదని అంటున్నాడనీ భావించరాదు. జ్ఞానస్వరూప విచారమన్న గ్రంథం వెలువడిన క్రొత్తలో, విమర్శకులు ఇలాంటి భ్రాంతికే పాలుపడ్డారు. కేవలం విజ్ఞానవాది అని కాంట్‌ను విమర్శించారు. ఆ అపోహను ఖండిస్తూ 'ప్రోలిగామినా'లో కాంట్ ఇలా అన్నాడు:

" ఆలోచించే మనస్సులు, ఆత్మలు తప్ప అన్యవస్తువులు లేవు. మనస్సుకు గోచరిస్తున్న వస్తువులు మన మనస్సులు కల్పిస్తున్నవే. ఈ భావ్యమానార్థాలకు భిన్నమై మనస్సుకు వెలుపల విషయాలు లేవని విజ్ఞానవాద సిద్ధాంతం. నేను అలా చెప్పటం లేదు. మనస్సుకు గోచరిస్తున్న విషయాలు మనస్సుకు వెలుపల ఉన్నవి. అవి స్వతః ఎలా ఉంటవో మనకు తెలియదు. మనకు తెలిసినదల్లా భౌతికతత్త్వమే. అంటే వేదనాసంసర్గంతో మనకు మనస్సులో గోచరిస్తున్న భావాలే మనకు తెలుసు. అందువల్ల మనకు వెలుపల వస్తువులున్నవని అంగీకరిస్తాను. ఆ వస్తువుల యథార్థస్వరూపమేమిటో మనకు తెలియదు.

ఇంద్రియాలపై ఆ వస్తు ప్రభావం ఉండటంవల్ల భావాలు ఏర్పడుతున్నవి. ఈ భావాలనుబట్టి బాహ్యవస్తువులను శరీరాలుగా భావిస్తున్నాము. అంటే వస్తువుల ఆభాసాలు మాత్రమే మనకు తెలుస్తున్నవి. ఇవి ఆభాసాలు అయినంతమాత్రాన వాస్తవికతా మ్యావాలు కావు. ఇలాంటి వాదం విజ్ఞానవాదం అనవచ్చునా? లేదు, ఇది విజ్ఞానవాదానికి కేవలం వ్యతిరేకం.''

కాగా కాంట్ సిద్ధాంతం విజ్ఞానవాదం కాదు. మన అద్వైతవాదానికీ, ఈ వాదానికీ, సామ్యమున్నది. ఇంద్రియాలకు, బుద్ధికి గోచరిస్తున్న అర్థాలు ఆభాసాలని రెండు పక్షాలు అంగీకరిస్తవి. ఈ ఆభాసాలకు మూలమైన వస్తువులు ఏవో ఉన్నవి, వాని యథార్థతత్త్వం మన బుద్ధికికాని, వివేచనకు కాని అందదు. అది ''అచింత్యం, అతర్క్యం, అప్రమేయం,'' అని కాంట్ అంటాడు. ఉన్నది సచ్చిదానందస్వరూపమైన బ్రహ్మం ఒక్కటేననీ, మాయవల్ల, ఈ వ్యావహారిక ప్రపంచం గోచరిస్తున్నదనీ, అద్వైతి అంటాడు. ఈ రెండు వాదాలకు మరికొన్ని సాధర్మ్య వైధర్మ్యాలున్నవి. వాటిని తరువాత పరిశీలింతాము.

ఇంద్రియాలు, బుద్ధి, వీటి వృత్తులద్వారానే మనకు జ్ఞానం కలుగుతున్నది. ఈ జ్ఞానమంతా ఆభాసమే. వృత్తి అవచ్ఛిన్నత లేక మనకు జ్ఞానం లేదు. వృత్త్యవచ్ఛిన్నమైనదంతా ఆభాసమే. అంటే వ్యావహారిక జ్ఞానం. ఇది వస్తువుల యథార్థ స్వరూపం తెలుపదు. గణితశాస్త్రమైనా భౌతిక శాస్త్రమైనా, మరే ఇతర సామాజిక శాస్త్రమైనా వ్యావహారిక జ్ఞానం మాత్రమే ప్రసాదిస్తుంది. అంటే వీటికి విషయం భౌతిక ప్రపంచమే కాని యథార్థ వస్తుప్రపంచం కాదు. అసలు దానిని గూర్చి ఇవి చెప్పలేవు.

266

## వివేకం

ఇంతవరకూ ఇంద్రియాలు, బుద్ధి, వాటి వృత్తి, వానివల్ల ఏమి జరుగుతున్నది చూచాము. ఇంద్రియాల సహాయంతో బుద్ధి విషయాల జ్ఞానం కలిగిస్తున్నది. ఈ వివిధ విషయ జ్ఞానాలతో మానవుడు సంతృప్తి పడడు. ఈ వివిధ జ్ఞానాలు సమన్వితం కావాలి. ఈ పని బుద్ధివల్ల కాదు. మన వివేచనాశక్తి ఒక్కటే యీ పని నిర్వహిస్తుంది. ఇంద్రియ జన్యమైన ప్రత్యక్ష అనుభవాలను బుద్ధి సమన్వయిస్తున్నట్లే, బుద్ధిజన్యమైన అనుభవాలను వివేకం సమన్వయిస్తుంది. కాని సాధ్య అనుభవ సమాహారమంతా అనుభవానికి రాజాలదు. అందువల్ల ఈ అనుభవ సమాహారం పొందటానికి వివేకం ప్రయత్నించక తప్పదు. అలా ప్రయత్నించినప్పుడు వివేకం అనుభవాన్ని అధిగమించాలని చూస్తుంది. అంటే సోపాధిక

విషయాలనుండి (Conditioned objects) నిరుపాధిక వస్తువులను తెలుసుకోవటానికి వివేకం ప్రయత్నిస్తుంది. వివేకం ఈ పనిని మూడు భావాల (Ideas) ద్వారా సాగిస్తుంది. మొదటిభావం జ్ఞానమూలకారణాన్ని అన్వేషిస్తుంది. అంటే ఆత్మతత్త్వాన్ని తెలుసు కోటానికి యత్నిస్తుంది. రెండవది జగతత్త్వం పరిశీలిస్తుంది. మూడవభావం ఆత్మ జగత్తుల పరమోపాధిని, అంటే ఈశ్వరుని అన్వేషిస్తుంది. ఈ విధంగా ఈ భావత్రయంవల్ల ఆత్మదర్శనం, జగద్దర్శనం, ఈశ్వరదర్శనం ఏర్పడుతున్నవి.

## ఆత్మస్వరూపం - అపోహలు

నిరుపాధిక వస్తువులు తెలుసుకోటానికి యత్నించటంలో భావాలు అనుభవాన్ని అధిగమిస్తవి. ఇలా అధిగమించి అనుభవానికి వర్తించే పదార్థబుద్ధిని అనుభవాతీత వస్తువులకు ఆపాదించి, ప్రాతిభాసిక విషయాలను సృష్టిస్తవి. ఆత్మస్వరూప నిర్ణయంలో ఇలాంటి అపోహ ఏర్పడుతున్నది.

''నేను తెలుసుకొంటున్నాను అంటే తెలుసుకొనే కర్త ఉండాలి. విభిన్న కాలాలలో కలుగుతున్న జ్ఞానాలను తెలుసుకొంటున్నాను కాబట్టి నేను మారకుండా ఉండాలి. మారుతున్న పక్షంలో నాకు విభిన్న జ్ఞానాలు కలగటానికి వీలు లేదు. ఈ జ్ఞానాలన్నిటికీ ఈ మారని కర్త ఉపాధి కావాలి. ఈ కర్తే ఆత్మ. ఈ ఆత్మ మారని ద్రవ్యం కావాలి. మారనిది కాబట్టి నిత్యం కావాలి. నిత్యం కాబట్టి నిరవయవం కావాలి. విభిన్న కాలాలలో ఉంటున్నదన్నా, బాహ్యవిషయాలను పెక్కు గ్రహిస్తున్నదన్నా, ఈ ఆత్మ ఏకమైనది కావాలి.'' ఇది ఇతర దార్శనికుల వాదం.

ఈ వాదానికి కాంట్ ఇలా అంటాడు:- అనుభవానికి ఆత్మ విషయమౌతున్నదంటే, అనుభూతమైన ఇతర బాహ్య విషయాలు ఎలాంటివో, అనుభూయమానమైన ఆత్మ కూడా అలాంటి విషయమే. కాకపోతే బాహ్య విషయాలు బహిరింద్రియాల ద్వారా గ్రహింపబడుతుంటే, ఈ ఆత్మాభాసం అంతరింద్రియం ద్వారా గ్రహింప బడుతున్నది. అంతేకాని కేవల చైతన్యం విషయం కావటానిక వీలు లేదు. అయినా ఈ ఆత్మాభాసాన్ని కేవల చైతన్యంగా భావించి, ఆత్మాభాస లక్షణాలను ఆత్మకు ఆపాదించటం జరుగుతు న్నది. ఇలాంటిభ్రమకు లోనై ఆత్మాభాస లక్షణాలైన ఏకత్వ, తాదాత్మ్య, నిత్యత్వ, అభౌతికత్వాలను ఆత్మకు ఆపాదించి అది ద్రవ్యమనీ, నిరవయవమనీ, ఏకమనీ, అభౌతికమనీ అంటాము. అనుభవ గోచరమౌతున్న ఆత్మజ్ఞానంలో ఈ విశేషణాలలో ఏ ఒకటి భాసం కావటానికి అవకాశం లేదు. అంతఃకరణకు సాక్షాత్కరిస్తున్న విషయమేదీ

భావం ముఖ్యం; ఉత్పత్తి విధానం అముఖ్యం. (2) భావం ముఖ్యం; ఉత్పత్తి విధానం పరిగణ్యం కాదు. (3) భావం ఉత్పత్తి విధానం తుల్యప్రాధాన్యాలు. (4) ఉత్పత్తి విధానం ముఖ్యం; భావం అముఖ్యం. (5) ఉత్పత్తి విధానం ముఖ్యం; భావం అపరిగణ్యం. గతితర్కానికి అనుకూలమైనవి రెండవది, అయిదవది మాత్రమే.

రెండవదానిని ఒవరించటమంటే హెగిలీయ గతితర్కాన్ని స్వీకరించటమౌతుంది. ఐదవ దానిని అంగీకరించటమంటే భౌతిక గతితర్కాన్ని ఆమోదించటమౌతుంది. మిగిలిన మూడూ ఏ గతితర్కానికైనా విరుద్ధాలు. ఎందుకంటే త్రికం లేని ప్రతి అంగమూ ద్వంద్వ సంపుటికాని, చతుష్పుటి కాదు. కాబట్టి గతితర్కాన్ని సంరక్షించుకోవాలంటే మార్క్సీయులు భావాదికం అపరిగణ్యంగానే భావించాలి. భావాదికం అపరిగణ్యమంటే సామాజిక పరిణామం వివరింపజాలదు. సామాజికపరిణామాన్ని వివరించాలంటే గతితర్కాన్ని పరిత్యజించాలి.

అంతేకాని మార్క్సు, ఏంగెల్సు వాక్యాలను వల్లించి నంతమాత్రాన ఉన్న బాధ పోదు. అందుకనే ''ఎలుకతోలు దెచ్చి ఏడాది యుతికినా నలుపు నలుపేగాని తెలుపు గాదు'' అన్న ఉక్తి వచ్చింది.

324 భౌతిక గతితర్కం ప్రతిపాదించే సామాజిక పరిణామంలో మరొక ముఖ్యాంశం వ్యక్తికీ, సమాజానికీ ఉన్న సంబంధం. ఇది కేవలం అంగాంగిభావమే నంటున్నది. ఈ ప్రతిపాదన క్రొత్తది కాదు. పురుషసూక్తం, ప్లేటో సిద్ధాంతం, హెగిల్ సిద్ధాంతం, ఫాసిస్టు సిద్ధాంతం జాతీయవాదం మొదలైన ప్రజాస్వామ్య విరుద్ధవాదాలెన్నో దీనినే సమర్థిస్తున్నవి. ఈ అంగాంగిభావాన్ని చక్కగా అర్థం చేసుకోవాలంటే కార్యకారణభావం, అవినాభావం, గమక గమ్యభావం అర్థం చేసుకోవాలి.

ముందు కార్యకారణభావం పరిశీలింతాము. జగత్తులో ఏది జరిగినా కారణం లేకుండా జరుగదు. ఈ కారణం తార్కికుల మతం ప్రకారం మూడు విధాలు:

1) సమవాయి కారణం. ఘటమన్న కార్యానికి మృత్తికే సమవాయి కారణమౌతుంది. 2) అసమవాయి కారణం. వస్త్రమన్న కార్యానికి దారం అసమవాయి కారణం. 3) నిమిత్త కారణం. చెంపపెట్టుతో దెబ్బ తగులుతున్నది. దెబ్బకు చెంపపెట్టు నిమిత్తకారణం. కార్యకారణ భావం. ఈ పేర్కొన్న సంబంధాలలో దేనినైనా ఒకదానిని సూచిస్తుంది.

అవినాభావసంబంధం కేవలం ఎడబాటులేని ఉనికి తెలుపుతుంది. ఇది ఉంటే అది ఉంటుందని సూచిస్తుంది. దృష్టాంతం ధూమాగ్ని సంబంధం. ఎక్కడెక్కడ ధూమం

---

ఉంటుందో అక్కడక్కడ అగ్ని ఉండి తీరుతుంది. అగ్ని ఉన్నప్పుడు ధూమం విధిగా ఉండాలన్న నియమంలేదు. కాబట్టి ఇది ఆంతరిక సంబంధం కాదు.

గమకగమ్యభావమంటే సాధనకూ; లక్ష్యానికీ ఉన్న సంబంధం. నది దాటుట లక్ష్యమైనప్పుడు దానికి వంతెన కాని, పడవ కాని సాధన మౌతుంది. అంటే నదీతరణం గమ్యమూ, వంతెన లేక పడవ గమకమూ. ఇతరభావాల కంటె దీనికి విలక్షణత చెప్పుకోవలసి వచ్చినప్పుడు, ఇది కూడా అనాంతరికసంబంధమే.

ఇక అంగాంగి సంబంధమంటే అంగాలకూ, ప్రాణికీ ఉన్న సంబంధం. ఏ అంగం దెబ్బ తిన్నా, లేక దీనిలో ఏమార్పు జరిగినా ప్రాణిలో మార్పు కనిపిస్తుంది. కాలిలో ముల్లు గుచ్చుకున్నప్పుడు ప్రాణి బాధపడుతుంది. చేతిని కోల్పోతే ప్రాణికి కూడా అంతమేర నష్టం కలుగుతుంది. పైగా అంగి నుంచి వేరైపోయిన అంగం కేవలం నిరర్థకం.

ఈ తుదిసంబంధమే వ్యక్తి, సమాజాలమధ్య ఉన్నదని మార్క్సిజం ప్రతిపాదిస్తున్నది. గతితర్కాన్ని ఆశ్రయించిన మార్క్సుకు ఇంతకంటే గత్యంతరం లేదు. కారణం త్రికంలోని ప్రతి అంగమూ పరస్పర ద్వంద్వసంపుటి. ఈ సంపుటిలోని ద్వంద్వాల పరస్పర సంబంధం అంతరికమే కాని, బాహ్యమైనదికాదు. అందువల్ల త్రికాంగం విధిగా అనాంతరిక సంబంధాలను అంటే అవినాభావసంబంధాన్ని గమ్య గమక సంబంధాన్ని, కార్యకారణ భావంలోని నైమిత్తిక సంబంధాన్ని పరిహరించాలి. అప్పుడు అంగాంగిభావం లేదా నిమిత్తంతో సంబంధం లేని కార్యకారణభావం శరణ్యమౌతున్నది.

కాగా వ్యక్తికీ సమాజానికీ ఉన్న పరస్పర సంబంధం అంగాంగిసంబంధమే. ఇది యధార్థమా? యధార్థమైతే ప్రతి నిరుపేద పొందుతున్న కష్టాలు సమాజం గ్రహిస్తూ ఉండాలి. సుబ్బమ్మ వడ్లుదంపితే సమాజం చేతులు బొబ్బలెత్తటం లేదు. నాకు జలుబు చేస్తే సమాజానికి తుమ్ములు రావటం లేదు. నాకు ఆనందం కలిగితే సమాజముఖం వికసించటంలేదు.

ఈసందర్భంలో వర్ధమానులు ఇలా ఆక్షేపించవచ్చును.

"ఈ విధమగు వితండవాదనలోని కరుడుగట్టిన, అధమాధమ బూర్జువా మనస్తత్వం, పచ్చి స్వార్థపరత్వం మనకు సులభంగా గోచరిస్తుంది. వ్యక్తికీ, సమాజానికీ కచ్చితమైన అవినాభావసంబంధం ఉంది. సమాజం లేకుండా వ్యక్తి లేడు. వ్యక్తులులేని సమాజాన్ని ఊహించటం అసంభవం : అవివేకం.

"అధిక లాభాల స్వార్థకాంక్షతో ఉత్పత్తి అయిన సరకు మార్కెట్‌లో అమ్మకంకావటం లేదనే కుంటి సాకును చూపించి రేషనలైజేషన్ ప్రవేశపెట్టుటకో, ఫ్యాక్టరీ మూసివేయుటకో

ఒక పెట్టుబడిదారు నిర్ణయించుకున్నాడనుకోండి ఈ పెట్టుబడిదారు నిర్ణయానికీ, వేలాది కార్మికుల జీవితభవిష్యత్తులకీ సంబంధం లేదా? లేదని అనటానికెవరికైనా నమ్మేలున్నవా? పెట్టుబడిదారు మిల్లు మూసేస్తే అశేషకార్మికులు నిరుద్యోగరాక్షసి వాతబడి, దారుణ దారిద్ర్యంలో శలభాల్లాగా మాడిపోరా?

''ఎల్లమ్మ దంపితే, సమాజానికి బొబ్బ లెత్తటం లేదనే శ్రీరంగ నీతులు వంగనాచి వేదాంతం ఎలాగుందంటే ''నా కొంపకి నేను నిప్పెట్టుకుంటే లోకుల కేమన్నట్లు'' వుంది. తన కొంపకి నిప్పెట్టుకుంటే తనకే గాక యిరుగుపొరుగు వారల కొంపలు గూడ తగలడి పోతవని గుర్తించని మూర్ఖుడు చేసే వాదనలాంటి వాదనే రావుగారు చేస్తున్నారు. కాబట్టి సమాజంలోని ప్రతి వ్యక్తి యొక్క జీవితానికి ఇరుగు పొరుగువారల జీవితాలతో అవినాభావమూ, అవిచ్ఛిన్నమైన సంబంధం ఉంది.

కార్యకారణభావము, అవినాభావము, గమకగమ్యభావము, అంగాంగి భావము, త్రికాంగతత్త్వము, వివరించిన తరువాత ఈ ప్రతిపక్షానికి ఎంత అర్థముందో వేరే చెప్పనక్కరలేదు, కాని, అంగాంగిభావముతో మిగిలిన భావాలకు ఐక్యం చెప్పుకోంటామనవచ్చును. అప్పుడు ప్రతి పక్షికి చెప్పగలిగిన సమాధానం లేదు కాని, భాషను మాత్రం ''తాడిచెట్టా పెరిగింది, నువ్వూ పెరిగావు'' అనవలసి వస్తుంది.

కాగా, గతితర్కం ప్రకారం వ్యక్తికీ. సమాజానికీ కార్యకారణభావం కంటె, అవినాభావం కంటె, గమ్యగమకభావం కంటె విలక్షణమైన అంగాంగి భావం చెప్పుకోవాలి. మార్క్సు కూడ దీనినే చెప్పాడు. కాని దీనిని నిత్యానుభవం త్రోసిరాజంటున్నది. అసలు చారిత్రక సంఘటనలతోనే ఇది విరోధిస్తున్నది. నిజంగా మార్క్సు చెప్పినట్లు మానవసమాజం అంగి అయితే కేవలం ఒక రష్యాలోనే శ్రామికవిప్లవం రావటానికి వీలులేదు. కాని, అక్కడ ఆ విప్లవం రానూ వచ్చింది. శ్రామిక నియంతృత్వం ఏర్పడి తన అధికారాన్ని అప్రతిహతంగా చెలాయించనూ చెలాయిస్తున్నది. మార్క్సు చెప్పినట్లు మానవసమాజం అంగి అయితే రష్యా విప్లవంతో ప్రపంచమంతా సోషలిస్టు రాజ్యంగా మారిపోయి ఉండవలసింది. నిజానికి రష్యా విప్లవం బయలుదేరిన క్రొత్తలలో విప్లవాధినేతలు అలాగే భావించారు. కాని పొరుగు రాజ్యాలలో విప్లవవిజయసూచనలు కనిపించనప్పుడు ప్రతిభావంతుడైన లెనిన్ ఏకదేశంలో సోషలిస్టు ప్రభుత్వ స్థాపన సాధ్యమేనని గ్రహించి పార్టీవిధానం తదనుగుణంగా దిద్దితీర్చాడు. ఇప్పుడు సోవియట్ నాయకులు సహజీవనసూత్రాన్ని పైకయినా ఆమోదిస్తున్నారు. అంటే మానవసమాజం అంగి అన్న సూత్రాన్ని త్రోసివేస్తున్నారన్నమాట. టెక్స్టు బుక్ ఆఫ్ మార్క్సిస్టు ఫిలాసఫీలో ''రష్యా అభివృద్ధి ప్రధానంగా స్వకీయ అంతర్గత పరిస్థితుల మీదనే ఆధారపడి ఉంద''ని ప్రస్తావిస్తూ

---

ఎ.వి.కృష్ణారావు

''ప్రపంచమంతటా వచ్చిన పెట్టుబడిదారీ విధానపు విషమస్థితి ప్రధానంగా రష్యాను బంధించలేదు'' అని పేర్కొన్నది. ఇలా బాధ లేకపోవటమంటే మానవ సమాజానికి 'ప్రధానంగా' అంగిత్వం లేదన్నమాట. దీనిని బట్టి గతితర్కం 'ప్రధానంగా' మానవసమాజానికి వర్తించదన్నమాట. వర్తిస్తుంది అన్న పక్షంలో రష్యాలోనిది శ్రామిక నియంతృత్వం కాదనీ చెప్పుకోవాలి. ఈ రెంటికంటె భిన్నమైన మార్గం ఉన్నదన్న పక్షంలో, అలాచెప్పేవారు తృతీయమార్గం తెలుపవలసి ఉంటుంది.

సామాజిక పరిణామంలో గ్రహింపవలసిన విషయం మరొకటి ఉంది. మార్క్స్ స్వకీయమైన ''అదనపు విలువ'' అన్న సిద్ధాంతాన్ని గతితర్కంలో జోడించి ''పెట్టుబడిదారులు స్వలాభ పరాయణులై శ్రామికవర్గాన్ని దోచుకుంటారు. దీనివలన కొంతకాలానికి ఉత్పత్తి సాధనాలు, యంత్రాగారాలు సిరిసంపదలూ కేవలం అత్యల్పసంఖ్యాకుల హస్తగతం అవుతాయి. దారిద్ర్యం దుర్భరపీడనం శ్రామికవర్గంవంతు అవుతాయి. తుదకు పెట్టుబడిదారుల వర్గం కంటె ఇతరమైన వర్గాలన్నీ శ్రామికవర్గమై అది పాలక యంత్రం స్వాధీనం చేసుకొంటుంది''. అని అతడు ప్రతిపాదించాడు. శ్రామికనియంతృత్వం వర్గరహిత సమాజాన్ని నెలకొల్పుతుందనీ, తరువాత బలప్రయోగావశ్యకత ఉండకపోవటం వల్ల పాలకయంత్రం క్రమంగా నశిస్తుందని సిద్ధాంతీకరించాడు. ఆ తరువాత నుంచి సిసలైన మానవచరిత్ర ప్రారంభమౌతుందన్నాడు.



కాని, తరువాత జరిగిన చరిత్ర భిన్నంగా ఉంది. అతడూహించినట్లు మధ్యతరగతి నశించలేదు. జాయింట్‌స్టాక్ కంపెనీల పెరుగుదల ఏర్పడింది. కార్మికసంఘాల ఆందోళన వల్లనేమి, మరే యితర కారణాల వల్లనైతేనేమి 19వ శతాబ్ద ఉత్తరార్ధంలో వలె కార్మికులు స్థితిగతులు ఆ తరువాత లేవు. కోరదగినదిగా కాకపోయినా కొంతవరకైనా మేలుగానే ఉన్నవనక తప్పదు. పైగా మార్క్స్ కలలో కూడా ఊహించనట్లు పారిశ్రామికంగా వెనుకబడ్డ దేశాలలో అంటే రష్యా, చైనాలలో కమ్యూనిస్టు పార్టీలు అధికారం చేపట్టాయి. ఇదివరకు సాయుధ విప్లవాలకు అవకాశం ఉండేది. నేడు అణ్వస్త్రాలు వచ్చాయి. ఈ యుగంలో అన్యాయపరిహారణకు యుద్ధమే సాధనం అనటంలో అర్థం లేదు. అసలు అలాంటి యుద్ధానికి దిగటమంటె మానవ నాగరికతాసంస్కృతుల విధ్వంసానికి సన్నిద్ధపడటమే. వీనికి తోడు 19వ శతాబ్దిలో వలె పారిశ్రామికాభివృద్ధి కేంద్రీకరణం ద్వారానే సాధ్య మనటానికి వీలులేదు. కేవలం కొలది పరిశ్రామికాభివృద్ధి కేంద్రీకరించటానికి అవకాశాలు ఏర్పడ్డాయి. ఇంకా ఇది అధికం కావటానికి వీలున్నది. పరిశ్రమల వలెనే అధికారాన్ని కూడ వికేంద్రీకృతం కావాలన్న ఆందోళన సాగుతున్నది. ఈ పరిణామాలన్నిటినీ మార్క్స్ సిద్ధాంతంలో సరిపెట్టుకొనటానికి సాధ్యపడదు.

శ్రామికనియంతృత్వం ఏర్పడగానే సమాజంలో ఏ ఒక వర్గం మరొక వర్గానికి దోచుకోబడం జరుగదని మార్క్స్ అంటాడు. అదనపు విలువ అపహృతం కానప్పుడే ఈ పని జరుగుతుందన్నమాట. పెట్టుబడివారీ విధానంలో పెట్టుబడిదారులు ఈ అదనపు విలువను భుక్తపరుచుకుంటారు. కాబట్టే కార్మికులు దోచుకోబడినవారవుతారు. సోషలిస్టు వ్యవస్థలో ఈ దోపిడి అంతరిస్తుందా? ఈ అదనపు విలువను కార్మికులకే దక్కనిస్తారా? దక్కి నిచ్చేపక్షంలో అభివృద్ధి లేక పోవాలి. కారణం పారిశ్రామికాభివృద్ధి కొత్త పెట్టుబడులను అపేక్షిస్తుంది. అదనపు విలువ విభక్తమైతే కొత్త పెట్టుబడులు ఎక్కడనుంచి వస్తాయి? కాబట్టే అదనపు విలువను స్వీకరించటంలో తప్పులేదు. అది సద్వినియోగం పొందుతున్నప్పుడు దానిని దోపిడి అనటానికి వీలులేదు. దుర్వినియోగ మయినప్పుడే అది దోపిడి అవుతుంది. కాగా పెట్టుబడిదారులు అదనపు విలువను సామాజిక క్షేమం కొఱకు వినియోగించక దుర్వినియోగం చేయటం వల్ల దోపిడిదారు లవుతున్నారు. ఆ లెక్కలో శ్రామికనియంతలు మాత్రం ఆ అదనపు విలువను దుర్వినియోగం చెయ్యరు. చేయటానికి వీలులేదు. అని రాయిగుద్ది చెప్పటానికి ఎలా వీలుపడుతుంది? అసలు అదనపు విలువ దుర్వినియోగ మవుతుందో లేదో చెప్పవలసినది ఎవరు? ఈ ప్రశ్నలకు గతితర్కం మిచ్చే సమాధానమేమిటి?

గతితర్కంలో అంతగా పరిచయం లేని వారు కొందరు ఈ సందర్భంలో ఇలా శంకిస్తున్నారు "కమ్యూనిస్టు సమాజం ఏర్పడిన తరువాత పాలక యంత్రం అంతరిస్తుందని మార్క్స్ చెప్పాడు. రష్యాలో కమ్యూనిస్టు ప్రభుత్వం సుస్థిరంగా నెలకొని 35 ఏండ్లకు పైగా కాలం గడిచింది. పాలకయంత్రం పూర్తిగా అంతరించక పోతే పోయింది. కనీసం పన్నగిల్లుతున్న సూచన మచ్చుకైనా కానరావడం లేదు.

ఈ సందర్భంలో గతితర్కం జన్మరహస్యాన్ని వెల్లడించే సమస్య ఒకటి ఉంది. కమ్యూనిస్టు సామాజికవ్యవస్థ యేర్పడిన సమాజాంతర్గతవైరుధ్యం అంతరిస్తుందని మార్క్స్ సుస్పష్టంగా చెప్పాడు. అతడే అభ్యుదయానికి అంతర్గతవైరుధ్యం కారణమన్నాడు. వర్గవైరుధ్యం అంతరించినప్పుడు అభ్యుదయం లేక, సమాజం స్తంభించిపోదా?

ఈ ప్రశ్నకు ఒక వ్యుత్పన్నుడు ఇలా ప్రత్యుత్తరిస్తున్నాడు.

"ప్రపంచ మంతటా కమ్యూనిస్టు సమాజం స్థాపించబడినప్పుడు, వర్గాలు అంతరించి పోయినప్పుడు పీడకులు పీడితుల వర్గరహిత సమాజంలో ఉండరు. ఇంతదాకా దోపిడి

వర్గాలకి వ్యతిరేకంగా పోరాటం సాగించిన మానవుడు ఆ వర్గాలను నాశనం చేసిన పిదప ప్రకృతికీ, ప్రకృతిలో వచ్చే ప్రళయాలకీ, ప్రకృతి శక్తులకు వ్యతిరేకంగా నిరంతరమైన పోరాటం ప్రారంభిస్తాడు. కమ్యూనిస్టు సమాజంలో మానవునికి ప్రకృతిశక్తులకు మధ్య వైరుధ్యం ఉంటుంది. ఆవిధంగా ఆ సమాజం పురోగమిస్తుంది''.

ఆ వ్యుత్పన్నుడు సర్వదా శిరోధార్యమైన స్వకీయ వేదం ఏమి చెబుతున్నదో గ్రహించినట్లులేదు, కాకగ్రహిస్తే విస్తృతి కటాహంలో ఎక్కడో సూచి లాగుడి వుంటుంది. ఎందుకంటె ''మార్క్సు లెనిన్ ప్రోక్తమైన గతితర్కం సమాజానికి, ప్రకృతికి ఉన్న వైరుధ్యం త్రోసివేయదు కాని సామాజికాభివృద్ధికి అది ప్రధానం కాదు. అది అభ్యుదయనిర్ణాయక వైరుధ్యం కాదు.'' అని ఆ వేదం చెబుతున్నది.

ఈ పక్షంలో మరి దేనివల్ల సమాజాభివృద్ధి కొనసాగుతుంది? ఈ ప్రశ్నకు ఆ వేదంలోనే సమాధానాన్ని వెదకవలసి వుంది. ''అవకాశవాదులు ఎన్ని చెబుతున్నా వర్గ నిర్మూలనానంతరం కూడా సామాజిక స్వయంగతికి అంతరిక వైరుధ్యాలు మూలమవుతాయి'' అని ఒకచోట అది ................................ చెప్పినట్లు మానవ సమాజ చరిత్ర పూర్వరంగం సమాప్త మవుతుంది. ఈ భవిష్యచ్చరిత్ర పరిణతి గుణాన్ని బట్టి ఎలాంటి అనన్య దశలు పొందుతుందో మనకింకా తెలియదు. కాని కమ్యూనిజం ఏ విధంగాను ఎన్నడు నిర్జీవ, సంస్తంభిత సిద్ధాంతంకాదని మా ఉద్బోధిత విశ్వాసం.''

ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క తెగకు ఒక్కొక్క విశ్వాసం ఉండవచ్చును. అలా విశ్వసించటానికి అధికారం ఉంది. దీనిని అతడు ప్రచారం చేసికోవచ్చును. ఆచరించటానికి ప్రయత్నించవచ్చును. కాని భావప్రచారానికి, కర్మాచరణకు కొన్ని నియమాలున్నాయి. భావప్రచారం సత్యాన్ని ఉల్లంఘించరాదు. కర్మాచరణం ధర్మాన్ని అతిక్రమించరాదు.

అంతర్వైరుధ్యం ద్వారానే అభ్యుదయసిద్ధి కలుగుతుందన్న ఉక్తి సత్యదూరమని పిస్తున్నది. ఎందుకంటె కమ్యూనిస్టు సామాజిక వ్యవస్థ ఏర్పడినప్పుడు వర్గవైరుధ్యం నశిస్తుందని మార్క్సు చెప్పాడు. అతని సూత్రం ప్రకారం సామాజికాభివృద్ధికి అంతరిక వైరుధ్యం విధిగా కావాలి. అయితే అతడు చెప్పినట్లు ప్రకృతి ఇంతవరకూ పొందిన ఉన్నతదశ కంటే మానవుడు భిన్నుడు కాడు. మనస్సు అన్నది భౌతికద్రవ్యం పొందిన వికారమైనట్లే మానవుడు కూడా ప్రకృతి పొందిన ఉత్తమ వికారం ఫలవృక్షమునకు బీజంవలె ఉత్తరదశలో పూర్వదశ వ్యక్తంగా ఉంటుందని గతితర్కసిద్ధాంతం. వర్గకలహపూరిత

మానవ చరిత్రలోని కలహంలో పై సూత్రం ప్రకారం ప్రకృతి అంతర్భూతమై ఉంటుంది. అలాకాక, ప్రకృతితో మానవుడు సాగించవలసిన పోరాటం వేరన్న పక్షంలో ద్వంద్వ సంప్రతి మాత్రమే అయిన గతితర్కాంగాన్ని పరిణామంతో అన్వయించటం దుశ్శకమౌతుంది. కాబట్టి వర్గకలహం జరుగుతుందన్నప్పుడు గర్భితంగా ప్రకృతితోటి పోరాటం సాగుతున్నదనే అర్థం చేసుకోవాలి.

కాగా కమ్యూనిస్టు సమాజంలో వర్గవైరుధ్యం నశించినప్పుడు మానవునకు ప్రకృతికి వైరుధ్యం ఏర్పడి అభివృద్ధి కొనసాగుతుంది. అని వ్యుత్పన్నులు వ్యాఖ్యానిస్తున్నట్లు చెప్ప వీలులేదు. కారణం త్రికగతి ఆంతరికవైరుధ్యం ద్వారానే కొనసాగుతుంది. వేరిమి తెచ్చిపెట్టినప్పుడు ప్రకృతికి మానవునకూ మధ్య ఉండే వైరుధ్యం బాహ్యమైనదే కాని అంతరికమైనది కాదు. బీజం అంకురమై ఆ అంకురం వృక్షమౌతున్నది కదా. అలాగే ప్రకృతి సందర్భంలో కూడా ప్రకృతో, మానవుడో అభివృద్ధి పొందాలి కాని రెండూ, రెండు రాసులుగా ఉండి అభివృద్ధి పొందటానికి వీలులేదు. ఇదే గతితర్కం ప్రకారం సిద్ధించే వివరణం. అందువల్ల మానవసమాజమే వర్గకలహాతిరిక్తమైన ఆంతరికవైరుధ్యం ద్వారా అభివృద్ధి పొందుతున్న మార్క్సీయ వేద భాషోక్తి యధార్థం. కాని యీ ఆంతరిక వైరుధ్య స్వభావం ఎలాంటిది అన్న విషయంలోనే అది మౌనముద్ర వహిస్తున్నది.



నిజానికి ఉత్పత్తి విధానాన్ని పురస్కరించుకొని కొనసాగే వర్గవైరుధ్యం అంతరించిన తరువాత కూడా అభివృద్ధి కొనసాగాలంటే, సమాజంలో భావవైరుధ్యం బయలుదేరకతప్పదు. సమాజంలో బయలుదేరే ఈ భావవైరుధ్యం ఆంతరికమే కాని బాహ్యం కాదు. దీనికి రష్యా అధినేతలలోని భావవైరుధ్యమే నిదర్శనం. ఆంతరికమైన భావ వైరుధ్యాన్ని పురస్కరించుకొని అభివృద్ధి కొనసాగే పక్షంలో హెగిలీయ గతితర్కం భౌతికగతితర్కాన్ని ఆవేశిస్తుంది. ఆ పక్షంలో హెగిల్ చెప్పినట్లుగా భావం ఎప్పుడూ అంతర్వైరుధ్యం పరిహరింప ప్రయత్నిస్తుంది. అప్పుడు అతడన్నట్లే పూర్ణబ్రహ్మను ప్రతిపాదించి "కథ కంచికి వెళ్ళింది, మనం ఇంటికి వచ్చాము" అని చెప్పక తప్పదు. అంటే జర్మన్ ఫిలిస్టిన్ చెప్పినదే శరణ్యమౌతున్నది.

రోటిలో తలదూర్చి రోకటి పోటుకు వెరిస్తే ప్రయోజనమేమిటి? సత్తులో ప్రారంభించినప్పుడు పూర్ణసత్తుతో ఆగక తప్పదు. ఆ గతి గతితర్క స్వభావంలోనే ఉన్నది. హెగిల్ ఇంతమేరా ఆలోచించే గతితర్కాన్ని ప్రతిపాదించి మహాకవి అయ్యాడు. ఆ చిత్రణవైచిత్రిలో పడి మార్క్సు కూడా మరొక కట్టుకథను ప్రారంభించి సగంలోనే విడిచి సత్యాన్ని సాధించాననుకున్నాడు. అందుకనే కాబోలు ఒక తెలుగుకవి "చాలుంజాలు

కవిత్వముల్ వడువువో సత్యమ్ము సాధింతురా''? అన్నాడు. ఇంతటిహా నడిచే వారికే కదా ఎదురు దెబ్బలు!

ఇప్పుడు గతితర్కం కళాస్వరూపాన్ని, భేదాలను, విలువలను కళల పరిణామాన్ని ఎంతవరకు వివరించగలుగుతున్నదో పరిశీలించవలసి ఉంది. ఈ విషయంలో హెగిలీయ గతితర్కం ఎన్ని లోపాలు కలదిగా ఉన్నా మేలుగా కనబడుతున్నది. ఎందుకంటే ఇది కళాస్వరూపాదులను నిర్దిష్టంగా చెబుతున్నది. హెగిల్ సిద్ధాంతం ప్రకారం ఐంద్రియక బ్రహ్మయే కళ. కృతి, అనుకృతికాదు. ఇది స్వయంసంపూర్ణం. స్వయంభాసమానం. వస్తుస్వరూపాల (matter and form) ఆంతరిక వైరుధ్యంవల్ల కళాభేదాలు పరిణామాలు ఏర్పడుచున్నవి. తార్కికంగా మొదట వస్తుప్రాముఖ్యమున్న కళ ఏర్పడుతుంది. ఇందులో భావం లేక ఆత్మ దాదాపు మాటువడుతుందని చెప్పవచ్చును. ఇది ప్రతీక పూర్వక కళ (symbolic art) ఇందులో ప్రాధాన్యం వహించేది వాస్తుకళ. వస్తురూపాల తుల్య ప్రాధాన్యం కలది ''క్లాసికల్ ఆర్టు'' ఇందులో అగ్రేసరం శిల్పం. వస్తుస్వరూపాలలో స్వరూపప్రాధాన్యం కలది ''రొమాంటిక్ ఆర్టు'' దీనిలో అవశ్య పరిగణ్యాలు చిత్రలేఖన సంగీత సాహిత్యాలు. లలితకళ లన్నిటిలో సాహిత్యానికి హెగిల్ పట్టం కట్టాడు. ప్రకృతి సౌందర్యం, కళాసౌందర్యాని కంటె హీనమైనదని వ్యక్తం చేశాడు. వీటన్నిటి కంటె ముఖ్యమైనది మరొకటి ఉన్నది. కళ మతంగాను, ఆ మతం తత్త్వశాస్త్రంగాను మారిపోతుందని అతడన్నాడు. అంటే కళలు నామరూపాలు లేకుండాపోయి కేవలం తత్త్వశాస్త్రార్థాలు మాత్రమే మిగులుతవన్న మాట. దీనిని అనుభవం ఎంతవరకు సమర్థిస్తున్నది?

మార్క్సీయమైన భౌతిక గతితర్కం ఈ విషయంలో ఏమంటున్నది? లలితకళ ఏదైనా ఏదశలో ఉన్నా, భావనప్రధానం. కేవలవైరుధ్యమన్నది ఉంటుందన్న పక్షంలో భౌతికద్రవ్యానికి భావనా అన్నది కేవలం విరుద్ధకోటిలోనిదే అవుతుంది. కాబట్టి భౌతిక గతితర్క మన్నది స్వయంబాధిత మైనట్లే. భౌతిక లలితకళ కూడ స్వయంబాధితమే. పేరు సంగతి ఎట్లున్నా లలితకళా స్వరూపాన్ని ఈ భౌతిక గతితర్కం ఏమని నిర్వచిస్తున్నాది? స్వయంసంపూర్ణత్వం, స్వయంభాసమానత్వం, అనంతత్వం మొదలైనవాటికి స్థానమున్నదా? లేనిపక్షంలో శాస్త్రాదులనుంచి కళలను వేరుపరిచే ధర్మాలెవ్వి? వివిధ లలితకళలలో శతాబ్దులనుండి పరశ్శంకంగా కృతులు వచ్చాయి; వస్తున్నాయి. వీని విలువలను నిర్ణయించే కొలతబద్ద ఏమిటి?

లలితకళల పరిణామమైనా మార్క్సీయ గతితర్కం వివరించటం లేదనే భావించటానికి హేతువులు కనిపిస్తున్నవి. దృష్టాంతంగా మన తెలుగు సాహిత్య వికాసాన్నే తీసికొంచాము.

త్రికానికి అనుగుణంగా ఆంధ్రీకరణ యుగమనీ, ప్రబంధయుగమనీ, ఆధునిక యుగమనీ విభజించవచ్చును. మొదటి యుగంలో దేశికవిత, మార్గకవిత అన్న ఆంతరిక వైరుధ్యం వున్నదని కూడా అంగీకరించవచ్చును. ఆవైరుధ్యం వల్లనే ప్రబంధయుగం అవతరించిందని వ్యాఖ్యానించవచ్చును. అయితే ప్రబంధయుగంలోని అంతర్వైరుధ్యం ఏమిటి? ఆధునిక యుగావతరణకు ఆంతరికమైన వైరుధ్యం కంటె అనాంతరికమైన పాశ్చాత్యసంపర్కమే కారణంగా కనబడుతున్నది. ఇక్కడి మొదటి రెండు దశలలోను విశేషం నవ్యత అన్నది కావ్యభేదాలలో కాని, శిల్పంలో కాని లేకపోవటమే. ఇతిహాసాలు, పురాణాలు అంతకుముందు ఏనాటినుంచో సంస్కృతంలో ఉంటున్నాయి. మహాప్రబంధమన్నది ఏనాడో సంస్కృతంలో బయలుదేరింది. భామహుడు, దండి ఎప్పుడో దాని లక్షణాలను గూడ నిర్వచించారు. కాబట్టి మహాప్రబంధం కూడ కొత్తది కాదు. ఆధునికయుగంలోని నవల, కథానిక, రూపకం, ఏకాంకిక మున్నగునవి 19వ శతాబ్దం మధ్యనాటికే వృద్ధిపొందివున్నాయి. కాగా ఇందులో కూడా తెలుగు సాహిత్యం విశేషంగా సాధించిన క్రొత్తదనం లేదు.

కాని గతితర్కాక పరిణామమే దాదాపు తెలుగులో సాహిత్యచరిత్రలో వ్యగ్యమవుతున్నది. కాకపోతే కొన్ని కొన్ని కావ్యభేదాలు, కొన్ని కొన్ని ఇతివృత్తాలు, కొన్ని కొన్ని యుగాలలో ఎలా విశేషప్రాచుర్యం పొందుతున్నవో వివరిస్తున్నది. పోతే ఒక సామాజికదశలో బయలుదేరినకృతులు ఉత్తర సామాజికదశలో ఎలా ఆదృతాలవుతున్నవో చెప్పటం లేదు. ఈ విషయాన్ని మార్క్సు కూడ ''క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ'' అన్న గ్రంథంలో ఒప్పుకొన్నాడు. మొత్తంమీద కళారంగంతో గతితర్కానికి ప్రసక్తిచాల తక్కువ అనే చెప్పవలసి వస్తుంది.

ఈ సందర్భంలో ఇలా అనవచ్చును:- ''భౌతిక గతితర్కంలో భావాదికానికి స్వతంత్రసత్తాలేదన తెలిసి విషయమే. ఉత్పత్తి విధానాన్నిబట్టి భావాదికం ఉంటుందని భౌతిక గతితర్కం ప్రతిపాదిస్తున్నదని ఇంతకుముందు నిర్ధారించటం జరిగింది. కాబట్టి పైన పేర్కొన్న వివరణ స్వవచనవ్యాఘాతమే''.

ఈ ఆక్షేపణ సమంజసమై ఆంధ్ర సాహిత్యవికాస వివరణం పైన పేర్కొన్నది. హెగిల్ సిద్ధాంతానికి అనుగుణంగా ఉన్నది. కాబట్టే ఉత్పత్తివిధానాన్ని బట్టి సాహిత్య చరిత్రను వివరించవలసి ఉంటుంది. అయితే ఆంధ్ర సాహిత్య చరిత్రలో ప్రారంభంనుంచి ఆధునికయుగం సగం వరకూ పూర్తిగా భూస్వామిక ఆర్థికవిధానమే అమలులో ఉంది. అప్పుడు సాహిత్యపరిణామంలోని వైవిధ్యాన్ని ఎలా వివరించాలి? ఈ వైవిధ్యం కూడ

పూర్వం ఉన్నదే కాని కొత్తగా వచ్చినది కాదు. కేవలం ఆర్థిక చరిత్రనుబట్టి దానిని వివరించటం దుష్కరం.

ఇది యిలా ఉండగా ప్రపంచచరిత్రలో ఏ దేశచరిత్ర విప్పినా విప్లవవ్యతిరేకశక్తులు సాధించిన ఘట్టాలు. శతాబ్దులు పర్యంతం అభివృద్ధి స్తంభించిపోయిన పట్టులు కనబడుతున్నవి. ముఖ్యంగా మనదేశంలో 8వ శతాబ్దినుంచి మహమ్మదీయ యుగాంతం వరకు సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా విప్లవ వ్యతిరేక బలాలు జయం పొందినట్లు గోచరిస్తున్నదే కాని ఒకసారికూడా విశేషకాలం విప్లవబలాలు నెగ్గినట్లు కనబడదు. ఈ కాలంలో భారతీయ చరిత్ర దాదాపు స్తంభించిపోయిందనే చెప్పవచ్చును. (మతవాదులు ఈ వాక్యంతో ఏకీభవించక పోవచ్చును. వారి మతదృష్టి ఇక్కడ చర్చనీయం కాదు.) అలాగే చైనాలో కూడా స్తబ్దత అన్నది సుదీర్ఘకాలం ఉండిపోయింది. కాని గతితర్క శాస్త్రం ప్రకారం పూర్వపూర్వదశలకంటె ఉత్తరోత్తర దశలు అభ్యుదయక బలీయాలు కావలసివున్నది. కాని పైని పేర్కొనిన స్థితిగతులన్నీ దీనికి విరుద్ధాలు. కాబట్టి గతితర్కం సామాజిక అధఃపతనాన్ని, స్తబ్దతను వివరించటం లేదు.

పైగా జడజగద్వికాసాలకీ, సజీవమైన ఉద్భిజలోక సమున్మీలనానికి, సజీవాసనయైన పశుప్రపంచ ప్రపంచనానికీ, సజ్ఞానమైన మానవసమాజ సమున్మేషణానికీ ఒకే త్రికధారకారణమన్నప్పుడు, ఆ కారణమెంత మహత్తరమైనదైనా, అనేకార్థాపాదకమైనదైనా అంధవిశ్వాసం కంటె అతిరిక్తమైనది కాదు. చారిత్రక సంఘటనలు, సామాజికపరిణతులు అనేక విధాలైన కారణాలవల్ల కలుగుతాయి. అలా కాదని గతితర్కాన్ని ఆశ్రయించటం శాస్త్రీయ మార్గానికి తిలోదకాలు వదలటమే. నేడు శాస్త్రగతిని నిరోధిస్తున్న వాటిలో గతితర్కం ఒకటి అంటే అంతగా అతిశయోక్తి లేదేమో!

ఇంతకూ తేలిన అంశాలు:– గతితర్కం ప్రమాణశాస్త్రం కాదు. అది జ్ఞానసిద్ధాంత మంటే అంతకన్న అర్థంలేదు. కాక ప్రకృతి సమాజాలపరిణతిని అది వివరిస్తున్నదా అంటే, అప్పుడు అందులో అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలు బహుళం. అందుకనే ఒక మాజీ కమ్యూనిస్టు గతితర్కార్థాన్ని ఒక్క వాక్యంతో తేల్చివేశాడు. ''అది ఉద్బోధక మిథ్య. శాస్త్రంగా మాత్రం అది నిరర్థకం''.

మార్క్సీయ గతితర్కం నిరర్థక మన్నంతమాత్రాన మార్క్సిజమంతా నిరర్థక మని భావించరాదు. ఆ పక్షంలో ఈ వ్యాసం కూడ ఒక విధంగా నిరర్థకమే. కథానాయకుని వర్ణించి వర్ణించి ఒక కవి చివరి కతడు పుట్టినట్లే లేదు, గిట్టినట్లే లేదు అన్నాడట. హాస్యానికైతే అది పరాకాష్ఠ. కాని ఇది బ్రతుకుతెరువుకు సంబంధించిన విషయం హెగిలీయ

గతితర్కప్రయుక్తుడైన మార్క్సు ఎన్ని పొరపాట్లుపడినా అతని సిద్ధాంతంలో విశిష్టత ఉన్నది. ఈనాటి సమస్యలను సాకల్యంగా అర్థం చేసికొని పరిష్కరించాలంటే అతని వాదం చదువకతప్పదు. రస్సెల్ అన్నట్లు హెగీలీయ సిద్ధాంతసంపర్కంవల్ల సంప్రాప్తమైన అంశాలన్నీ అశాస్త్రీయాలు, సత్యదూరాలు కావచ్చును. కాని సామాజిక పరిణామ ముఖ్యకారణాలలో ఆర్థిక విధానం ఒకటి కాదనటానికి వీలులేదు. తత్త్వాదికం కేవలం నిర్లిప్తంగా ఉండదనటం సత్యదూరం కాదు. ఇందుకు నేడు మనదేశంలో శిరోధార్యంగా విశేషప్రచారితంగా ఉంటున్న తత్త్వాదికం కంటె వేరు నిదర్శనం అక్కరలేదు. ''సామాజిక ఆభ్యుదయానికి వివిధ విజ్ఞాన శాస్త్రవిషయ సమన్వయంతో గూడిన తత్త్వదృష్టి ఆవశ్యకం. దారిద్ర్యం, అన్యాయం ఉన్నంతవరకూ సమాజం శాంతి అనుభవించటం కల్ల. మానవచరిత్రను మానవుడే సృష్టించుకొంటున్నాడు'' అన్న మార్క్సీయ సత్యాన్ని శాస్త్రీయంగా త్రోసివేయటానికి వీలులేదు. సామాజిక పరిణితికి దైవానికి వదలక మానవుడే కృతసంకల్పంతో కొనసాగించాలని కూడా అతడే తొలిసారిగా తెలిపి, అందులకు యత్నించిన వ్యక్తి. అందువల్ల మార్క్సు సామాజిక అభ్యుదయ కాముకులకు స్మరణీయుడే అవుతున్నాడు.

''న సత్య మన్విష్యతి మృగ్యతే హి తత్''



– ఆంధ్రప్రభ (దినపత్రిక) సౌజన్యంతో
(1955 మే 1,8,15,22 ఆదివారాలు)

(నాటి ఆంధ్రప్రభ ప్రతులను భద్రంగా దాచి ప్రకృత ముద్రణకు దోహదంచేసిన సూర్యదేవర హనుమంతరావుగారికి కృతజ్ఞతలు)

జి.వి.కృష్ణరావు

# నిర్వాణ పరీక్ష

(ఆర్య నాగార్జునుని నామము జగత్ప్రసిద్ధము, ప్రపంచతాత్త్వికులలో అతఁ డద్వితీయుఁడు, అతని అద్వయవాదము నాఁటివిద్వల్లోకము నుఱ్ఱూఁతలూఁచి నేఁటివిప్రాశ్నిక విమర్శకుల నీరాజనములందుకొనుచున్నది.

అద్వయవాద ప్రతిపాదక గ్రంథకోటిలో మూలమాధ్యమిక కారికలు మకుటాయమానములు. ఈ కారికలకు వ్యాఖ్యలు పెక్కులు వెలువడినవి. వీనిలో చంద్రకీర్తి, ప్రణీతమైన 'ప్రసన్నపద' ఒకటి.

ప్రకృత గ్రంథభాగము ప్రసన్న పదసహితమూలమాధ్యమిక కారికలయందలి యిరువదియైదవ ప్రకరణమున కనువాదము.)

''ఈసమస్తమ్ము శూన్యమై యేర్పునేని వెలయఁబోదు ప్రభవమైన విభవమైన; ఏప్రహాణమ్మనుజేసి, ఏ నిరోధ ముననుజేసి నిర్వాణమ్ము పొసఁగఁ గలదు?''



ప్రకృతమున, పవిత్రజీవనము గడపినవారు[1], తథాగత శాసన ప్రతిపన్నులు, ధర్మముల ధర్మము యథాశాస్త్రముగ నెఱింగినవారు[2] నగుజీవులు[3] ద్వివిధమగు నిర్వాణము పొందుదురు[4], అని బుద్ధభగవానులు బోధించియున్నారు. ఆ రెండు తెఱంగుల నిర్వాణమునందు మొదటిది సోపధి శేషము; రెండవది నిరుపధిశేషము.

అవిద్యా రాగాదికమగు క్లేశసమూహము నిరవశేషముగా ప్రహాణము పొందుటవలన మొదటిది సోపధి శేష నిర్వాణమని చెప్పఁబడుచున్నది. ప్రాణప్రీతికి ఉనికియైనది ఉపధి. ఈ యుపధిశబ్దముచే పంచోపాదానస్కంధములు (సాస్రవ ధర్మములు) గ్రాహ్యములు. మిగులునది శేష మగును. ఉపధిమాత్రమే మిగులును కావున ఉపధిశేష మగును. ఉపధి శేషముతో నుండునది సోపధిశేషము.

ఆనిర్వాణ మెట్టిది? అది కేవలము స్కంధమాత్రకము (అనాస్రవధర్మము); ఆత్మ నిత్యతాదృష్ట్యాది[5] క్లేశతస్కర రహితమై నిహతాశేష చేరగణ మైన గ్రామమాత్రావ స్థానమును పోలియుండును. అదియే సోపధిశేష మగు నిర్వాణము.

---

1. ఉషితబ్రహ్మచార్యులు, 2. ధర్మానుధర్మప్రతిపత్తియుక్తులు, 3. పుద్గలులు, 4. ఆత్మస్నేహము, 5. సత్కాయదృష్టి

ఎందు స్కంధమాత్రకమునేని మిపులతో యది నిరుపధి శేషనిర్వాణ మనఁబడును ఏలయన నెందు ఉపధిశేషము గూడ నంతరించును. నిహతాశేషచోరగణమై యాత్మ నాశముపొందిన గ్రామమునుపోలి తః నిర్వాణ ముండును. ఇదియే యిట్లు వర్ణ్యమాన మగుచున్నది.

''అస్తమించెను భౌతికంబైన తనువు అంతరించె సంజ్ఞ, లదృశ్యమయ్యె సర్వ వేదన లుడిగె సంస్కారవితతి, యారి పోయె విజ్ఞానము (ప్రదీప్తిపుంజమట్లు).

కాయ మదియ సంలీనమై క్రాలుచుండ ఆర్యుఁ డగువాఁడు వేదన ననుభవించు నల్ల నిర్వాణమున విమోక్షమందుఁ గాదె చేతః* మస్తంగత మగు ప్రద్యోగతమట్లు''.

ఇట్లా నిరుపధిశేష మగు నిర్వాణ ముస్కంధ నిరోధము వలన లభ్యమగుచున్నది.

మహాయానవాది: ద్వివిధ మగు ఈ నిర్వాణ మెట్లు పొసగుచున్నది.

హీనయానవాది: క్లేశస్కంధముల నిరోధమునఁగదా నిర్వాణములభించుట! ఈ సర్వము శూన్యమైనప్పుడు ఏదియు పుట్టుటలేదు; ఏవియు గిట్టుటలేదు. అప్పుడు క్లేశములేవి స్కంధములేవి యుండవు. క్లేశస్కంధముల నిరోధము లేక నిర్వాణము లభ్యము కాదు. కావున భావములకు స్వభావమున్నదని

336

ప్రత్యుక్తి: నిజముగా మీరు చెప్పినట్లు భావములు సస్వభావములని యంగీకరించినను

''ఈసమస్తమ్ము శూన్యమై యేర్పనేని
వెలయఁబోదు ప్రభవమైన విభవమైన;
ఏ ప్రహాణమ్మునుజేసి, యేనిరోధ
మునను జేసి నిర్వాణమ్ము పొసఁగఁ గలదు?''

క్లేశములు, స్కంధములు స్వభావముచే వ్యవస్థితము లగునేని, స్వభావమున కెన్నఁడు భంగము వాటిల్లదు కావున యవి యెట్లు నివృత్తిపొందును? వాని నివృత్తివలననేకదా నిర్వాణప్రాప్తి. కావున స్వభావాదులకు నిర్వాణమేమాత్రము ఉపపన్నము కాదు. ఇక శూన్యతావాదులన్ననో నిర్వాణము క్లేశనివృత్తిలక్షణమని కాని, స్కంధనివృత్తి లక్షణమని కాని చెప్పుటలేదు. కావున వారికి ఈ పేర్కొన్న దోషము వాటిల్లుట లేదు. ఇట్లు శూన్యతావాదులకిది యదోషమే యగుచున్నది.

నిర్వాణము క్లేశనివృత్తి లక్షణమని కాని, స్కంధనివృత్తి లక్షణమనికాని 'శూన్యతా

---

* 6 చేతము = విజ్ఞానస్కంధము

వాచులు చెప్పలేరనుచున్నారు. సరే, వారు నిర్వాణమునకు చెప్పు లక్షణము లెవ్వి? అట్లయిన వినుఁడు:

"అప్రహీణమై యప్రాప్తమై యనష్ట
మై యనిత్యమై యవిలీనమై యజాత
మైన దాని నిర్వాణ మటంద్రు మునులు
(సర్వధర్మస్వరూప విజ్ఞాననిధులు)"

నిర్వాణము రాగాదికమువలె నంతరింపదు; శ్రామణ్య ఫలమువలె పొందరాదు; స్కంధాదికమువలె ఉత్పత్తి పొందదు; అశూన్యమువలె నిత్యముకాదు. అది స్వభావముచే అనిరుద్ధము, అనుత్పన్నము, సర్వప్రపంచోపశమలక్షణమని చెప్పఁబడినది. నిర్వాణమిట్లు నిష్ప్రపంచమగుచుండఁగా క్లేశకల్పనముగాని, స్కంధకల్పనముగాని యెట్లు పొసఁగును? క్లేశస్కంధనిరోధమువలనఁ గదా నిర్వాణము లభించుట. ఈ కల్పనలు ప్రవర్తిల్లుచుండఁగా నిర్వాణాధిగమము కలుగదు.

హీనయానవాది. అవును. నిర్వాణమందు క్లేశములు గాని, స్కంధములుగాని యుండవు. కాని నిర్వాణమునకు మున్నవి యున్నవి. ఆవెనుక నవి పరీక్షయము పొందఁగలవు. ఆపరిక్షయము వలన నిర్వాణము లభ్యమగును.



మహాయానవాది: ఈ భ్రాంతినే[7] వదలుకోవలె. నిర్వాణమునకు మున్ను స్వభావముచే వర్తిల్లు వానిని వెనుక నిఃస్వభావములను గావింప శక్యముగాదు. కావున నిర్వాణాభిలాషులీ కల్పనను త్యజింపవలెను.

ఆచార్యులే ముందు చెప్పుచున్నారు:

"ఏది నిర్వాణకోటియై యేర్పుచుండు
నది యసంసారకోటియై యవతరించు
ఆద్వయమ్మునకు నడుమ నంతరమ్ము
చెప్పడఁగఁబోదు సూక్ష్మాతిసూక్ష్మమైన."

కావున నిర్వాణమునందు నేదియు ప్రహీణముపొందదు. ఏదియు నిరోధ మందదు. కావున నిరవశేషకల్పనాక్షయ రూపమే నిర్వాణము.

భగవానుఁడు,

---

7. గ్రాహము

"ఏ నివృత్తిధర్మములు వర్తించుచుండఁ
బోవు, ఒకప్పుడు లేని ధర్మములు కలుగఁ
బోవు, కలదు లేదను తలపోఁతలందు
మెదుగువారికి వంత శమింపఁబోదు."

అని వచించెను.

ఈగాథ కర్థమిది: నిరుపధిశేష నిర్వాణధాతువునందు క్లేశకర్మజన్మలక్షణమగు ధర్మములేమి, స్కంధధర్మములేమి యెల్లవిధముల నసంగతములై ఉండుటవలన వర్తిల్లవు. ఇట్లగుట సర్వదార్శనికులకు సమ్మతము. నిర్వృతియందు వర్తిల్లని ధర్మము లొకప్పుడు నుండవు. చీకటియందు త్రాటిని జూచి యది సర్పమని భయపడుచున్నాము. ప్రదీపోదయమువలన నాభయము తొలఁగుచున్నది. యథార్థముగా సర్పమెప్పుడు ఉన్నది కాదు. నిర్వృతియందలి ధర్మములు నిట్టివే. క్లేశకర్మజన్మాదిలక్షణములగు నాధర్మములు ఏకాలముననను, సంసారావస్థయందైనను వాస్తవముగా లేవు. చీకటియందును త్రాడు యథార్థసర్పముగాదు. ఏలయన నది యథార్థ సర్పమట్లు చీకటియందేమి వెలుఁగునందేమి కాయచక్షువు రెంటిచే గ్రహింపఁబడుట లేదు.

338 అట్లగుచోనది సంసారమని యెట్లు చెప్పఁబడుచున్నదందురేని వినుఁడు: "తైమిరికులకు లేని కేశమశకాదులు కనఁబడునట్లే నేను నాది యను మోహముచే నుపహితులైన బాలపృథగ్జనులకు సత్స్వరూపములు కానివయ్యు ఆభావములు సత్స్వరూపములట్లు ప్రతిభాసించుచున్నవి. కావుననే,

"కలదు లేదను తలపోఁతలందు
మెదుగువారికి వంత శమింపఁబోదు."

అయినను, ' ఉన్నది' అని జైమినీయ కాణాద కాపిలాదుల నుండి వైభాసికులవఱకు భావసద్భావకల్పన సేయుచున్నారు. భవిష్యము లేదని అపయగతిప్రపాతులగు నాస్తికులు గాలిమేడలు కట్టుచున్నారు. తదన్యులగు సౌత్రాంతికులు భూతభవిష్యములను[8], అవిజ్ఞప్తిని, రూపచిత్తవిప్రయుక్తసంస్కారములను[9] లేనివనుచు తక్కుంగలవి యున్నవని కల్పన గావించుచున్నారు. యోగాచారులు పరికల్పితస్వభావము లేదనుచు పరతంత్ర పరినిష్పన్నభావములు రెండుమాత్ర మున్నవని కల్పన సేయుచున్నారు. ఇట్లు కలదు లేదను తలపోఁతలందు మెదుగువారికి వంత – అనఁగా సంసారము – శమింపదు.

---

8 అతీతానాగతములు, 9. విప్రయుక్త సంస్కారములు

---

''గరళసంసేవనాతిశంకాహతుండు
భగ్నచిత్తుఁడై మూర్ఛలో మునిఁగిపోవు
అట్లె నేను నాది యను మోహమునఁ దవిలి
బాలిశుండు సంభవవిధంబులందు.''

కావున నిర్వాణమునందేదియు ప్రమాణమందుట లేదు; ఏదియు నిరోధముపొందుట లేదు. కావున సర్వకల్పనా క్షయరూపమే నిర్వాణము.

ఇట్లే రత్నావళియు.

''భావమేనియుఁ గాదు నిర్వాణధాతు
వట్టిదానికి భావన యగుట యెట్లు?
కలదు లేదను తలపొంత తొలఁగియుంట
మాత్ర నిర్వాణ మని సమామ్నాతమయ్యె''

అని చెప్పుచున్నది.

నిర్వాణము సర్వకల్పనోపశమ రూపమని, ప్రతిపాదింపక, భావరూపమనియు, అభావరూపమనియు భావా భావరూపమనియు, భావాభావానుభయరూప మనియు బరికల్పించువారినిఁ బ్రత్యుత్తరించుచు నాచార్యపాదులు చెప్పుచున్నారు



''భావ మగునన్న వేళ నిర్వాణమునకు
వార్ధకమరణలక్షణప్రాప్తి యొదవు,
వార్ధకమరణలక్షణప్రాప్తి లేని
భావమన్నది యెందు లేబరము గాదె!''

భావరూప మగు నిర్వాణమునందభినివిష్టులగు కొందఱిట్లు వాదించుచున్నారు. ''జలప్రవాహ నిరోధనమునకు సేతు వావశ్యకము. సేతువు మనికి లేక జలప్రవాహము నిలువదు. క్లేశ కర్మ జన్మ సంతాన మొకప్రవాహము. ఈ ప్రవాహ నిరోధనమునకు సేతుసదృశమైన యొకానొక పదార్థము ఉండవలయును. ఆ సేతుసదృశమై యునికి గలిగినదియే నిర్వాణము. నిజముగా నిర్వాణము భావముగానిచో క్లేశాది సంతాన ప్రవృత్తి నిరోధము కలుగఁజాలదు. ఏలయన స్వభావముచే లేనిధర్మ మేదియు కార్యకారి కాకపోవుట మన కనుభవసిద్ధము.

సౌత్రాంతికుఁడు: ''జీవితానం దానుషంగిక[10] తృష్ణ యొక్క క్షయము, విరాగము, నిరోధము నిర్వాణమని వ్యాఖ్యాతము. కావున కేవలక్షయము భావము కాఁజాలదు.

10. నందీరాగసహగత.

"లక్ష్య నిర్వాణమున విమోక్షమందుం గాదె
చేత మస్తంగత మగు ప్రద్యోతమట్లు"

అని చెప్పఁబడినది. ప్రద్యోతముయొక్క నివృత్తి భావముగా నుపపన్నము కాఁజాలదు.

వైభాషికుఁడు: "మీరు తృష్ణాక్షయమను పదమునకు తృష్ణయొక్క క్షయమని విగ్రహ వాక్యము కల్పించి యర్థము చెప్పుచున్నారు. అర్థము చెప్పుకొనవలసినది యట్లు కాదు. తృష్ణయొక్క క్షయ మెందో యది తృష్ణాక్షయము. నిర్వాణ మనఁబడు ధర్మ మున్నదగు చుండఁగా తృష్ణాక్షయ మగుచున్నదని చెప్పికొనవలయును. ప్రద్యోతమిట దృష్టాంత మాత్రము. ఈ దృష్టాంతమందును ఒకానొకటి యున్నప్పుడే చేతమునకు విమోక్ష మగుచున్నదని యెఱుఁగవలయును.

నిర్వాణమిట్లు భావరూపమని వ్యవస్థాపించువాదము నిష్ప్ర యోజనమని యాచార్యులు పరీక్షించు చున్నారు. నిర్వాణము భావమాత్రము కాఁజాలదు. కారణమేమి? భావమే యగుచో దానికి జరామరణలక్షణములు సంక్రమింపవలసి వచ్చును. ఏలయన భావమునకు జరామరణములు అవ్యభిచారిలక్షణములు. భావమగుచో నిర్వాణము జరామరణములు పొందవలయును. అద్దానివలన విజ్ఞానాదిక మట్లు నిర్వాణమును నశింపవలసియుండునని యభిప్రాయము.



అజరామరణలక్షణముల యవ్యభిచారితనే ఆచార్యులు స్పష్టపఱుచుచు చెప్పుచున్నారు:

"వార్ధకమరణలక్షణప్రాప్తి లేని
భావ మన్నది యెందు లేబరముగాదె!"

జరామరణరహితమైనది భావమే కాఁజాలదు. ఇందులకు హేతువు జరామరణ రాహిత్యము. దృష్టాంతము గగనకుసుమము. (కాశకుసుమము వాడదు. నశింపదు. కావున నది భావము గాదు.)

మఱియు –

"భావ మగునన్న వేళ నిర్వాణధాతు
వప్పుడయ్యది సంస్కృతం బగును విధిగ
తనరఁబోదుగదా సంస్కృతమ్ముగాని
భావ మొకఁడైన గాని యెప్పట్లునందు"

నిర్వాణము భావ మగునేని యది సంస్కృతము (హేతు ప్రత్యయసంజాతము)

గావలయును. భావత్వమే దీనికి హేతువు. విజ్ఞానాదుల దృష్టాంతము. (విజ్ఞానాదికము భావమగుటచే సంస్కృత మగుచున్నది. అట్లే నిర్వాణము భావమగునేని సంస్కృతము గావలయును. అనఁగా హేతుప్రత్యయసంజాతము కావలెను కాని నిర్వాణము హేతుప్రత్యయసంజాత మగుట యిష్టముకాదు). దీనికి వ్యతిరేక వాక్య మిట్లగుచున్నది: నిర్వాణము అసంస్కృతము. ఇందులకు హేతువు అభావత్వము. దృష్టాంతము ఖర విషాణాదికము. ఈ వ్యతిరేక హేతువునే ప్రదర్శించుచు చెప్పుచున్నారు.

తనరఁబోదు గదా సంస్కృతముఁగాని
భావమొకఁడైనగాని యెప్పట్టునందు.

ఎప్పట్టునందు అనఁగా ఏయధికరణమునందుఁగాని, దేశమునందుఁగాని, సిద్ధాంత మందుఁగాని యని యర్థము. భావ మొకఁడైనఁగాని యన ఆధ్యాత్మిక భావమొందె, బాహ్యభావ మొందెనని యర్థము.

మఱియు:-

భావ మగు నన్నవేళ నిర్వాణధాతు
వప్పు డది యనుపాదాన మగుట యెట్లు?
తత్త్వదృష్టి కెందున నుపాదాన మగుచు
తనరుచుండెడి భావమ్ము కనఁగరాదు



వివుతమున నిర్వాణము భావమగునేని అది యుపాదానముకలది కాలయును. అనఁగాసర్వకారణసామగ్రిని పొంది భావము గావలయును. కాని నిర్వాణమునకు కారణ సామగ్రియున్నదనుట యిష్ట కాదు. కావున కారణ సామగ్రి లేకయే నిర్వాణము కలుగవలయును. నిర్వాణము భావమైనప్పుడు స్వకారణసామగ్రిలేక కలుగఁజాలదు. ఏలయన నిర్వాణము విజ్ఞానాదికమట్లు భావ మగుచున్నది. ఆచార్యుఁడు "తత్త్వదృష్టి కెందున నుపాదానమగుచు తనరుచుండెడి భావమ్ము కనఁగరాదు," అని వ్యతిరేక కారణమును ప్రదర్శించుచున్నాఁడు సౌత్రాంతికుని సూచన పైని పేర్కొన్న దోషమునుబట్టి నిర్వాణము భావము కాఁజాలదు. క్లేశజన్మనివృత్తిమాత్ర మగుటవలననది కేవల మభావమే యగును.

సిద్ధాంతి:-

ఇదియు యుక్తము గాదు ఏలయన?
భావ మేని కాకున్న నిర్వాణధాతు

వస్తువది యభావ మేనియు నగుట యెట్లు?
భావ మున్నది యెప్పేటిఁ బరఁగకుండు
వరఁగఁబోవ దప్పేట నభావ మేని.

నిర్వాణము భావముగానప్పుడభావ మగునా? అభావముగూడఁ గాఁజాలదని యాచార్యుల యభిప్రాయము. క్లేశజన్మముల రెంటి యభావమే నిర్వాణ మగునేని, ఆ రెంటియనిత్యత నిర్వాణము గావలయును. ఏలయనక్లేశ జన్మముల రెంటి యనిత్యతకంటె అభావము అన్యముకాదు. ఆ యభావమే నిర్వాణమగును. అప్పుడు నిర్వాణ మనిత్యమగును. నిర్వాణ మనిత్య మనుట సమ్మతము గాదు. ఏలయన ఆపక్షమున యత్నములేకయే మోక్షము సిద్ధింపవలసి వచ్చును. కావున నిర్వాణము అభావము కాఁజాలదు.

మఱియు:-

కేవలమ్ము నిర్వాణ మభావ మైన
నప్పు డదియనుపాదాన మగుట యెట్లు?
తత్త్వదృష్టి కెందు ననుపాదాన మగుచు
తనరుచుండు నభావమ్ము కనఁగరాదు.



అభావమేని యనిత్యతయేని భావము నాశ్రయించి ప్రజ్ఞాయమాన మగుచున్నది. ఆభావము ఖరవిషాణము వంటిది. ఇది యనిత్యమని యనుభవగోచరమగుట లేదు. లక్షణము నాశ్రయించి లక్ష్యము, లక్ష్యము నాశ్రయించి లక్షణము ఊహింపబడుచున్నది. ఇట్లు పరస్పరాపేక్షతో లక్ష్యలక్షణప్రవృత్తి యగుచుండఁగా భావమగు లక్ష్యము నపేక్షింపక అనిత్యత ఎట్లు కలుగఁగలదు? కావున అభావము గూడ ఉపాదానము నపేక్షించి యూహింపఁబడుచున్నది. అట్లగుటఁజేసి నిర్వాణమభావమగునేని, యది యుపాదాన మపేక్షింపక యెట్లు సిద్ధించును?

(ఈ యర్థము నీ వాక్యమునఁ జెప్పవచ్చును.)
ప్రతిజ్ఞ: ఉపాదాన మపేక్షించియే నిర్వాణము కలుగుచున్నది.
హేతువు: అభావ మగుటవలన.
దృష్టాంతము: (ఘటాది) వినాశమువలె.

దీనినే "తత్త్వదృష్టి కెందు ననుపాదానమగుచు తనరుచుండు నభావమ్ము కనఁగరాదు" అని స్పష్టము సేయుచున్నాఁడు. కాగా ఉపాదాన మపేక్షింపని యభావము కలుగుటలేదు.

వి.వి. కృష్ణరావు

1. ప్రజ్ఞాప్యతే.

ఉపాదాన మపేక్షింపక ఆభావము కలుగనిచో వంధ్యాపుత్రాదులు ఉపాదానము పొంది యభావమ్ములు కావలయును.

ఇంతకు వంధ్యాపుత్రాదులు అభావములని యెవరు చెప్పిరి? పూర్వమే చెప్పితిమికదా!

"భావమునకు సిద్ధి ప్రాప్తింపదేని య
భావమునకు సిద్ధి పరగఁబోదు
ప్రజల భావ మన్నచు భాషించునట్టిది
వైపరీత్య మగును భావమునకు"
అట్లగుటచే వంధ్యాపుత్రాదిక మభావము గాదు.
"గొడ్డురాలిబిడ్డ కుందేటికొమ్ములు
గగనకుసుమము లెపుడు కలుగవనుచు
ప్రజలు పలుకుచుంద్రు భావకల్పనములు
కూడ వాని కీడుజోడు లగుమ"

ఇట్లు చెప్పినప్పుడు గూడ భావకల్పనము మాత్రమే నిరాకరింపబడుచున్నది కాని అభావ కల్పనము ప్రతిపాదింపఁ బడుటలేదు. ఏలయన అభావమునకు సిద్ధిలేదు. వంధ్యాపుత్రుఁడనునది కేవలము శబ్దము మాత్రమేకాని అద్దానియర్థము అనుభవగోచరము గాదు. ఆయర్థము భావము కాదు, అభావమును గాదు. అనుపలభ్యమానస్వభావమునకు భావాభావకల్పన యెట్లు పొసగును? కావున వంధ్యాపుత్రుఁడు అభావము కాదని యెఱుఁగవలయును. ఈవిధముగా నుపాదాన మపేక్షింపక విద్యమాన మగు అభావము కలుగదని స్థిత మగుచున్నది:-



శంకః- నిర్వాణము భావము కాదు; అభావమునుగాదు. మతేమగును?
ఇదిగో సమాధానముః-

ప్రత్యయావాప్తి నొందె నుద్భవత నొందె
ఆజవంజవీభావమై యలరు నేది

యది యవిగలితప్రత్యయావాప్తి నొందె సభవతను నొందె నిర్వాణమంద్రు మునులు.

ఆజవంజవీభావ మనఁగా ఆగమన గమనరూప మగుజన్మమరణపరంపర యని యర్థము. దీర్ఘ మునుబట్టి హ్రస్వము ప్రజ్ఞప్యమాన మగుచున్నట్లు ఆజవంజవీభావము

ఒప్పుచు హేతుప్రత్యయముల నాశ్రయించి ప్రవర్తమాన మగుచున్నది. ఇట్లు ఉపాదాన మపేక్షించి కాని హేతు ప్రత్యయము లపేక్షించికాని జన్మ మరణపరంపరా ప్రబంధము వ్యవస్థాపిత మగునేని ఉపాదానమునుగాని హేతుప్రత్యయములనుగాని యపేక్షింపని యప్రవృత్తి నిర్వాణమని వ్యవస్థాపిత మగుచున్నది. అంతియ కాని కేవలాప్రవృత్తిని భావమని కాని, యభావమని కాని పరికల్పింప శక్యము గాదు.

ఈ కారికకు మఱియొకరీతిగా నర్థము చెప్పవచ్చును. ఈ పక్షమున నిర్వాణము హీనయానవాదులు చెప్పుకొన్నట్టిదియే యగును. కాని యిచ్చట నొకవిశేష మున్నది. వారు నిర్వాణము భావమని వాదింతురు. కొందఱు (సర్వాస్తివాదులు) సంస్కార ప్రవాహమే సంసార మనుచున్నారు. ఈ జగత్తున క్షణికములగు ఉత్పాద వినాశములు హేతుప్రత్యయములను మాటిమాటికి పొంది కలుగుచున్నవి. ఈ హేతుప్రత్యయములను మాటిమాటికిపొందుట యుడిగి యప్రవర్తమానమగునదే నిర్వాణమని వారు చెప్పుచున్నారు

మఱికొందఱు (వాత్సీపుత్రీయులు) ఇట్లు చెప్పుదురు. పుద్గలాత్మ యున్నది. అది జననమరణములకుఁ బాల్పడుచున వాచ్యమగుచున్నది. అది క్షణికము గాదు; నిత్యమును గాదు. ఆ యా యుపాదానము నాశ్రయించి ఆపుద్గలాత్మకు ఆజవంజవీభావము కలుగుచున్నది. అది యట్లు ఒక యుపాదానము వెనుక మఱియొక యుపాదానమాశ్రయించి ప్రవర్తిల్లుచు కాలమువచ్చినప్పుడు ఉపాదాన మాశ్రయింపక అప్రవర్తమాన మగుచు నిర్వాణము పొందుచున్నది.



ఎవ్వరెట్లు చెప్పినను సంస్కారముల కేవలాప్రవృత్తిని కాని, పుద్గలాత్మయొక్క కేవలాప్రవృత్తిని కాని భావమని యేని అభావ మనియేని పరికల్పింప శక్యము కాదు.

కావున నిర్వాణము భావము గాదు, అభావమును గాదనుట యుక్తము

మఱియు:

''భవము విభవమ్ముగూడ వివర్జ్య మనుచు<br>
వ్యాహరించినారలు శాస్త్ర లైనమునులు<br>
కాన నిర్వాణ మది భావమేని మఱియ<br>
భావమేని కాకుంట సంభావ్యమగును.'

---

జి.వి.కృష్ణరావు

''భిక్షువులారా! భవమును భవాంతరముచేగాని విభవముచేఁ గాని తరింపఁ గోరువారు పరిజ్ఞానవంతులుగారు'' అని యాగమము చెప్పుచున్నది. భవతృష్ణ, విభవతృష్ణ – ఈ రెండును పరిత్యాజ్యములు. అంతియకాని నిర్వాణము ప్రహాతవ్యమని భగవానుఁడు వచింపలేదు. కావున నది యప్రహాతవ్యమే యగుచున్నది. నిర్వాణము భావరూపమో యభావరూపమో యగునేని యప్పుడది ప్రహాతవ్యమగును. కాని నిర్వాణము ప్రహాతవ్యము గాదు.

''కాన నిర్వాణ మది భావమేని మఱియు
భావమేని కాకుంట సంభావ్యమగును.''

కొందఱు (వైభాసికులు) నిర్వాణమునందు క్లేశజన్మములు రెండు నుండవుగావున నది అభావరూప మగుచు, తనకుఁ దాను భావరూపము కలదగుటవలన భావరూపము గూడనగుననుచున్నారు ఇట్లు నిర్వాణ ముభయరూప మగుట యసంభవమని ప్రతిపాదించుచు వచించుచున్నాడు.

''భావతదభావ యుగళస్వభావ మగుచు
పరమని ర్వాణధాతువు పరగు నేని,
భావతదభావయుగళస్వభావ మగుచు
తనరు మోక్షమల్లగుట యుక్తమ్ముగాదు.''



నిర్వాణము భావాభావముల యుభయరూప మగునేని మోక్షముగూడ భావము నభావము గావలయును. ఈ పక్షమున సంస్కారములయునికియు నశించుటయు కలసియే మోక్షము కావలయును. కాని సంస్కారములయునికియే మోక్షమగుట భావ్యము కాదు. కావుననే యాచార్యులది యయుక్త మనుచున్నారు.

మఱియు:–

భావతదభావయుగళస్వభావ మగుచు
పరమనిర్వాణధాతువు పరఁగునేని
యది యుపాదాననిర పేక్ష మగుట లేదు;
అయ్యుభయ ముపాదానసమాశ్రయమ్ము.

నిర్వాణము భావాభావరూప మగునేని యప్పుడది హేతుప్రత్యయసామగ్రి నాశ్రయించి కలుగవలయునే కాని వాని నాశ్రయింపక కలుగరాదు. కారణమేమి? ''అయ్యుభయ

ముపాదాన సమాశ్రయమ్ము'' భావము నపేక్షించి ( ఉపాదానమునుపొంది) యభావము, నభావము నపేక్షించి భావము కలుగుచున్నవి. ఇట్లు భావాభావములు రెండును ఉపాదానమును పొందియే కలుగుచున్నవి. కాని పొందక కలుగుట లేదు. ఇట్లే భావాభావరూప మగు నిర్వాణము నగును. కాని యిది యిట్లగుట యుక్తము కాదు.

మఱియు:-

భావతదభావయుగళస్స్వభావమన్న
పరగుటెట్లు నిర్వాణ ముభయము నగుచు
శస్యమైన నిర్వాణ మ్మసంస్కృతమ్ము
భావత్తదభావములు సంస్కృతావిలములు.

స్వహేతుప్రత్యయసామగ్రీ సంభూతత్వమువలన భావము సంస్కృతము. భావము నపేక్షించి పుట్టినదగుటవలనను, ఆగమమునందలి జాతిప్రత్యయ జరామరణ వచన మువలనను అభావముగూడ సంస్కృతము. నిర్వాణము భావాభావ స్వభావమగుచో, నది యసంస్కృతము. కాక సంస్కృత ధర్మమే యగుచున్నది. కాని నిర్వాణము సంస్కృతధర్మముగుట యిష్టము కాదు. కావున నది భావాభావసఁరూప మగుట

346 యుక్తముకాదు.

నిర్వాణము భావాభావరూపము కాదు కాని యనిర్వాణమందు భావము నభావము మండవచ్చునవియన్నచో నదియు యుక్తము గాదు. ఏలయన:-

''భావతదభావయుగళస్స్వభావ మన్న
పరఁగు టెట్లు? నిర్వాణమ్ము భయమునగుచు
రెండు నవి యొక్కచో ప్రవర్తిల్లఁబోవు వెలుఁగుచీకటులొక్కచో నిలువనట్లు''

పరస్పర విరుద్ధము లగు భావాభావములు ఒక్కచోట = ననఁగా నిర్వాణమున - మందుట సంభవము గాదు. కావుననే

'భావతదభావయుగళస్స్వభావ మన్న
పరఁగు టెట్లు నిర్వాణ ముభయము నగుచు?'
పరఁగనే పరఁగదని యభిప్రాయము.

ఇప్పుడు నిర్వాణము భావాభావసుభయరూపము కాదని ప్రతిపాదించుచు ఆచార్యులు చెప్పుచున్నారు:

---
జి.వి.కృష్ణరావు

"పరమనిర్వాణధాతు వభావమేని
కాదు భావమ్ముఁ గాదను కల్పనమ్ము
పడయ్యుచుండుఁ బ్రసిద్ధి యభావభావ
యుగ్మకం బాత్మసంసిద్ధి నొందునపుడు"

భావ మనునది యొకటి సిద్ధించునేని, అప్పుడా భావప్రతిషేధముచే నిర్వాణము భావమేకాదను కల్పన సిద్ధించును. అభావ మనునది యొకటి సిద్ధించునేని, అప్పుడాయభావ ప్రతిషేధముచే నిర్వాణము అభావమే కాదను కల్పనము సిద్ధించును. భావాభావములు రెండును లేనప్పుడు, సిద్ధింపనప్పుడు వాని ప్రతిషేధముగూడ లేదు. కావున "నిర్వాణము భావము కానేకాదు, అభావము కానేకాదు" అనుకల్పనకు ఉపపత్తియే కలుగుట లేదు. ఇట్లీకల్పన ఆయుక్త మగుచున్నది.

మఱియు:

"భావతద భావములకన్యభావ మగుచు
పరమ నిర్వాణ ధాతువు పరఁగు నేని,
భావతద భావములకన్య భావమైన
దానిఁ దెలియంగ నెవ్వాఁడు దక్షుఁడగును?"



నిర్వాణము అభావరూపము గాదు, భావరూపమును కాదని కల్పింపఁబడునో, అనుభయరూపముగా దాని నెవ్వడు గ్రహించుచున్నాఁడు? ఎవఁడు ప్రకాశ్యమానము గావించుచున్నాడు.

అట్టివాడక్కడ లేకున్న నిర్వాణమున నుండవచ్చు నందురా? లేక అదియు సంభవ మందురా? అట్టి ప్రతి పత్త యొకఁడున్నాడని యందురేని తావన్మాత్ర మగు నిర్వాణమునమీయాత్మ యుండవలయును. కానినిరుపాదానమగు నాత్మకస్తిత్వము లేదని మీరును అంగీకరింతురు. కావున అట్టి అస్తిత్వము ఇష్టము గాదు.

అట్లుగాక తాదృశుఁడగు ప్రతిపత్తి లేడందురా? అగుచో ఇత్థంవిధ మగు నిర్వాణ మున్నదని యెవఁడు పరిచ్ఛేదము సేయుచున్నాఁడు? సంసారావస్థితుఁడు తత్పరిచ్ఛేదము గావించు చున్నాఁడని యందురేని యతఁడు (సంసారావస్థితుఁడు) ఆ పరిచ్ఛేదము విజ్ఞానముచేఁ జేయుచున్నాఁడా, లేక జ్ఞానముచేఁ జేయుచున్నాఁడా? విజ్ఞానముచే నతఁడు తత్పరిచ్ఛేద మొనరించుచున్నాడనుట యుక్తము గాదు. కారణమేమి? విజ్ఞానము నిమిత్తాలంబనముపొంది ప్రవర్తిల్లును. (వ్యావహారికజ్ఞానము నిమిత్తములగు పదార్థముల

యాలంబనమును పొంది కలుగును) నిర్వాణమును పట్టి నిమిత్తము (వివిక్త పదార్థము) కలుగదు. కావున నది విజ్ఞానము (వ్యావహారిక జ్ఞానముచే) గ్రహింపఁబడుట లేదు.

తాదృకమగు నిర్వాణము జ్ఞానముచే ననుగ్రహింపఁబడుట లేదు. కారణమేమి? జ్ఞానమునకు శూన్యతయే ఆలంబనము. కావున అది యనుత్పాదరూపము. ఇట్లు అవిద్యవానస్వరూపము ప్రపంచాతీత స్వభావము నగుజ్ఞానముచే నిర్వాణము భావాభావముల యనుభయరూపమని ఎట్లు గ్రహింపఁబడును.

కావున నిర్వాణము ''అభావము గాదు, భావమును గాదు,'' అని యెవనిచేతను గ్రహింపఁడుట లేదు; ప్రకాశింపఁజేయఁబడుటయే లేదు.

కావున అనజ్యమానము అప్రకాశ్యమానము, అగృహ్యమాణము నగు నానిర్వాణ మట్లే యున్నదనుట యుక్తము గాదు.

ఎల్లవిధముల నిర్వాణమునందు ఈచతుర్విధకల్పనము (1. భావము 2. అభావము 3. భావాభావము 4. భావా భావానుభయము అనుట) సంభవము కాదు. అట్లే నిర్వాణాధిగంత యగు తథాగతునియందీకల్పనలు ఏవమాత్రము పొసఁగవని ప్రతిపాదించుచు ఆచార్యులు చెప్పుచున్నారు.



'బుద్ధదేవుండు నిర్వాణమునకు వెన్క
పరఁగునో మఱిపరగఁడో పరఁగి పరఁగ
కుండునో పరఁగి పరఁగ కుంట లేదొ
ఎట్టి ధీశాలికైన నూహింప రాదు'

పూర్వమే చెప్పితిమికదా!

'ఘనత రాభిని వేశసంగ్రస్తుఁ డగుచు
పూజనీయుండు బుద్ధదేవుండు కలుగు
విలయమునకంటె మున్నని తలఁచువాఁడు
లయమునకు వెన్క తద్వికల్పనము సేయు.'

ఇట్లు నిరోధమునకు వెన్క తథాగతులు కలుగుదురని కాని కలుగరని కాని యూహింపరాకున్నది ఈయుభయమును లేనిదగుటచే యుభయరూపమని యెఱుంగ వీలుకాదు ఈ యుభయమును లేనిదగుటచే ననుభయరూప మనియు గ్రహింప శయితి గాదు

ఇట్లు తథాగతులు చతుర్విధప్రకారములచే నిరోధమునకు వెనుకమాత్రమే యనూహ్యమాను లగుట లేదు. తిష్ఠ మానులుకూడ అగ్రాహ్యమాణులగుచున్నారని ఆచార్యపాదులు చెప్పుచున్నారు.

'తిష్ఠమానుఁ డైనను బుద్ధదేవుఁడరయ
పరఁగునో మఱి పరఁగఁడో పరఁగి పరఁగ
కుండనో పరఁగి పరఁగ కుంట లేదొ
ఎట్టి ధీశాలికైన నూహింప రాదు'

తథాగతులయునికి ఎట్లు అగ్రాహ్యము, నప్రకాశ్యము, ననూహ్యము నగుచున్నదో తథాగతపరీక్షయందు వివరింపబడినది. కావుననే

'స్వల్ప మగుభేదమేని సంసారమునకు
నల్ల నిర్వాణమునకు వర్తిల్లఁబోదు
స్వల్ప మగు భేదమేని నిర్వాణమునకు
నల్ల సంసారమునకు వర్తిల్లఁబోదు'.

తిష్ఠమానులగు భగవత్పాదులు అస్తిత్వాదికముచే నెఱుఁ గరానివారగుచున్నారు; ఊహింపరాని వారగుచున్నారు. నిర్వృతులగు భగవత్పాదులును అస్తిత్వాదికముచే నూహింపరాకున్నారు. సంసారముగూడ అస్తిత్వాదిచేనూహింపరానిది. కావుననే సంసారనిర్వాణములకు పరస్పరము నెట్టివిశేషము లేదు. విచార్యమాణములగు నీరెండును తుల్యరూపములు. భగవానులును చెప్పియున్నారు: ''భిక్షువులారా! జాతిజరామరణ రూప మగు సంసారము అనవరాగ్రము''. ఈ వచనము సంసారనిర్వాణములకు విశేషము లేమివలన నుపపన్న మగుచున్నది.

అట్లే-

' ఏది నిర్వాణకోటియై యేర్పుమండ
నదియ సంసారకోటియై యవతరించు
ఆ ద్వయమ్మునకు నడుమ నంతరమ్ము
చొప్పడఁగఁబోదు సూక్ష్మాతిసూక్ష్మమైన'

నిర్వాణముచే నవిశిష్టమగుటవలన సంసారమునకు ఆద్యం తముల కల్పనము అసంభవము. ఈ కల్పన యొకటిమాత్రమేకాదు.

అల తథాగతుల నిరోధ మాశ్రయించి
సంసరణపు టాద్యంతముల్ సంశ్రయించి

యనుపపద్యమ్ములైన యంతాదికములు
శాశ్వతాదికములు దృష్టిచయము లేరు''

సంసార నిర్వాణములు రెండును ప్రకృతి శాంతములు. ఏకరసములు కావున ఆకల్పనలు ఉపపద్యమానములగుట లేదు. ''అలా తథాగతుల నిరోధ మాశ్రయించి'' అను నుపలక్షణముచే నాలుగు దృష్టులు గ్రహింపఁబడుచున్నవి. ఆదృష్టులు : 1 మరణమునకు వెనుక తథాగతుఁ డుండును. 2. మరణమునకు వెనుక తథాగతుఁడుండఁడు. 3. మరణమునకు వెనక తథాగతుఁ డుండును ఉండడును. 4. మరణమునకు వెనుక తథాగతుఁడు ఉండనేయుండడు; యుండకపోవుట యుండదు. ఈ దృష్టిచతుష్టయము నిర్వాణపరామర్శముచేఁ బ్రవృత్తమగుచున్నది.

అంతాదాలును దృష్టులే. అవి 1) లోకమునకు అంతమున్నది. 2) అంతములేదు. 3) అంతమున్నది లేదును. 4) అంతములేనేలేదు; లేకపోవుటయు లేదు. ఈ దృష్టి చతుష్టయము అపరాంతము నాశ్రయించి ప్రవృత్తమగుచున్నది. ఆత్మభవిష్యముగాని, లోకభవిష్యముగాని యెఱుఁగఁజాలక లోకమునకంత మున్నదని కల్పించుచు, మానవుఁడు అపరాంతము నాశ్రయించి ప్రవర్తించుచున్నాఁడు ఇట్లే భవిష్యము నూహించుచు లోకమునకంతము లేదని ప్రవర్తించుచున్నాఁడు. భవిష్యమునుగూర్చి యూహాపోహము సేయుచు లోకమునకు అంతానంతత్వమును ప్రతిపాదించుచున్నాఁడు. ఈయుభయప్రతిషేధముచే ''అంతము లేనేలేదు, లేకపోవుటయు లే'' దని ప్రతిపాదించుచున్నాఁడు.



ఇట్లే లోకపూర్వాంతమును సమాశ్రయించి చతుర్విధ దృష్టులు ప్రవర్తిల్లుచున్నవి. అవి 1. లోకము శాశ్వతము 2. అశాశ్వతము 3. శాశ్వతాశాశ్వతము 4. శాశ్వతము కానే కాదు. శాశ్వతము కాకపోవుటయు లేదు. ఆత్మయొక్క అతీతమగు నుత్పాదమునుగాని లోకముయొక్క అతీతోత్పాదమునుగాని యూహించుటచే లోకము శాశ్వతము అను ప్రతిపత్తి యగుచున్నది. అతీతోత్పాదము నూహింపకుండుటచే లోకము శాశ్వత మను ప్రతిపత్తి యగుచున్నది. ఆయుత్పాదమును కాంచీ కాంచక యుండుటచే లోకము శాశ్వతము అశాశ్వతమును నను ప్రతిపత్తి యగుచున్నది. తద్దర్శనానుభయత్వమువలన లోకము శాశ్వతము కానేకాదు. శాశ్వతము కాకపోవుటయు లేదు'' అను ప్రతిపత్తి యగుచున్నది.

ఈ దృష్టు లెట్లు పొసఁగును? ఏ పదార్థమున కేని యొకానొక స్వభావ మున్నయెడల, తద్భావాభావ కల్పనవలన ఈ దృష్టులు కలుగఁగలవు కాని సంసార నిర్వాణములకు విశేషము లేదని ప్రతిపాదిత మైనది.

జి.వి.కృష్ణరావు

అప్పుడు:-

''అఖిలధర్మములే శూన్యమ్ము లగుచునుండ
అంత్యశాశ్వత మేది యనంత మగున దేమి?
అంతవ దనంతముల యుగ్మమగున దేమి?
తదనుభయరూప మగుచును దనరు నేది?
తానెయైనదేది కానిది మఱి యేది

నిత్య మేది మఱి యనిత్యమేది
ఆద్వయమ్ముల రూపమైన దేది మఱి త
దనుభయమ్ము రూపమైన దేది?

భావమునకు స్వభావము లేనప్పుడు అవ్యాకృతములగు నీచతుర్దశవస్తువులు పొసఁగవు. భావస్వరూప మధ్యారోపించి, తద్విగ మావిగమములవలన నీదృష్టుల నుత్పాదించి యభినివిష్టుఁడగువాడు నిర్వాణపురగామి యగు మార్గమును జొరనీక యతని వా యభినివేశము నిరోధించు చున్నది; సాంసారిక దుఃఖములందు బంధించు చున్నదని యెఱుంగవలయును.



ప్రతిపక్షి: ఇట్లే యగుచో నిర్వాణముకూడ భగవానునిచే నిరాకృత మగుచున్నది. అతఁడు అనంతచరితసత్తరాగ్యనువర్తకుఁడు సకలజగదాశయస్వభావమును యథా భూతముగా నెఱింగినవాడు. మహాకరుణాపరతంత్రుఁడు ప్రియైకపుత్ర ప్రేమమానుగత శేష త్రిభువనజనుఁడు. అతనిచే లోకమునకు నిర్వాణాధిగమార్గము నిజముగా బోధింపఁబడిన చరితప్రతిపక్షానురూపధర్మ మగు ధర్మము నిర్వాణమును ప్రతిషేధించుచు వ్యర్థమే యగుచున్నది.

సమాధానము: సస్వభావమగు నొకానొక ధర్మము కాని ఆధర్మము విను శ్రోతలు కాని ఉపదేష్టయగు బుద్ధ భగవానుఁడు భావసభావుండు కలుగునేని మీరు చెప్పినట్లే యగును కాని -

''సర్వసముపలంభశమము ప్రపంచోప
శమము శివము (తత్త్వసార మిదియ)
బుద్ధదేవులెపుడు బోధింప లేదు ను
మ్మెట్టి ధర్మమైన నెవని కైన.''

కప్పుడూ మీ చెప్పినదోషము మాకెట్లు వాటిల్లును. సర్వనిమిత్త ప్రపంచోపశమమే నిర్వాణమని యిచ్చట సిద్ధాంతము ప్రకృతిచే నుపశాంతమగుటవలన నాయుపశమమే శివము. వాచాప్రవృత్తివలన గాని, చిత్తముయొక్క ప్రవృత్తి వలన గాని ప్రపంచోపశమ మగుచున్నది. ఇదియు శివము క్లేశముల యప్రవృత్తిచేఁ గాని జన్మమునక ప్రవృత్తిచేఁ గాని ప్రపంచోపమగుచున్నది. ఇదియు శివము. క్లేశ ప్రహాణముచేఁ గాని నిరవ శేష వాసనా ప్రహాణముచేఁ గాని ప్రపంచోపమగుచున్నది. ఇదియు శివము జ్ఞేయానుపలబ్ధిచేఁగాని, జ్ఞానానుపలబ్ధిచేఁ గాని ప్రపంచోపశమమగుచున్నది. ఇదియు శివము.

బుద్ధభగవానులు సర్వప్రపంచోపశాంతరూపము శివము నగు నిర్వాణమునందుఁ బ్రవేశించినప్పుడు ఆకాశమునందు హంసరాజములట్లు ఆలంబనరహితముగా స్వపుణ్య జ్ఞానసంభారపక్ష పాతవాతము నకించనము నగు గగనమునందు నిలిచిరి. అప్పుడు సర్వానుపలంబమగుటచే దేవలోకములయందుఁగాని, మానవలోకములందుఁగాని దేవ తలకుఁగాని, మానవులకుఁగాని సాంక్లేశికధర్మమునొండె వైయవదానిక ధర్మమునొండె బోధింపలేదని యెఱుంగవలయును.

ఇట్లే తథాగతగుహ్యసూత్రమున చెప్పఁబడినది.

352 ''శాంతిమతీ'' అనుత్తరమ్మైన సంబోధిని దెలిసి నిర్వాణము పొంద నున్నరేయి తథాగతుఁడొక్క యక్కరమేని యుదాహరింప లేదు. వ్యాహరింప లేదు. వ్యాహరించు చుండుట లేదు. వ్యాహరింపఁబోడు. కాని సర్వ సత్వములు (సర్వజీవులు) విశ్వాసాను గుణముగా (యథాధిముక్తమున) నానాలక్షణములు (ధాతువులు) నానాశయమ్ములు పొంది తథాగతు వివిధ భాషణము లాడుదురని యూహించును. ''భగవానుఁడు మనకు ధర్మముపదేశించును. మేమును తథాగతుల ధర్మదేశనము విందుము'' అని తలంచును. తథాగతులు కల్పనసేయరు వికల్పన గావింపరు. సర్వకల్ప వికల్పజాలవాసనా ప్రపంచ విగతుఁడగుటచేఁగదా యతఁడు తథాగతుఁ డగుచున్నాడు.

''ధర్మము లవెల్ల శాంతాదినిర్మలములు
అక్షరమ్ములు సర్వశూన్యములు అనుక్తి
గోచరము లంచు గ్రహియించుకొన్నవాఁడు
బోధిసత్త్వుండు కేవలబుద్ధుఁడనిరి''

ఇట్లు బుద్ధుఁ డెప్పు డెవ్వనికి నెట్టిధర్మము నుపదేశింపఁడేని విచిత్రములైన వ్యవహారములు (ఆగమములు) ఎట్లు తెలియనగుచున్న వందురేని వినుఁడు: ''అవిద్య యను నిద్రయందుండి దేహులు కాంచెడి స్వప్నము(ల) వలె నీ స్వవికిల్పాభ్యుదయ

మగుచున్నది. సకలత్రిభువనములా సురనాథుఁడగు భగవానుఁడు ''నా కీధర్మము నుపదేశించుచున్నాఁ''డని వారు తలంతురు. ఇట్లే భగవానుఁడు వంచించియున్నాడు.

''నిర్మలతరమైన కుశలధర్మమునకు
బుద్ధ దేవుండు ప్రతిబింబభూతుఁ డగును
అట తథత లేదు లేఁడు తథాగతుండు
అఖిలలోకులు ప్రతిబింబ మరయుచుంద్రు''.
ఇదియు తథాగతవాక్ గుహ్యాపరివర్తమందు సవిస్తరముగా వివరింపఁబడినది.

ఇట్లు నిర్వాణార్థము ధర్మదేశనయే లేదు. కావున ధర్మదేశనయుండుటచే నిర్వాణ మున్నదనుట యెట్లు పొసఁగును? కావున నిర్వాణముకూడ లేదని సిద్ధమగుచున్నది. భగవానుఁడు చెప్పెను గదా!

''నిర్వాణ మరయ ననిర్వాణ మనుచు
పరమలోకేశ్వరుల్ భాషించినారు
గగనభాగముచే గ్రథితమ్ము గ్రంథి
గగన భాగమ్ముచే కొంచె మోచనము''



ఇంతియ కాదు. ''భగవానుఁడా కొండొకధర్మము పుట్టుచున్నదని కాని నాశనమగు చున్నదని కాని తలంచువారికి బుద్ధోత్పాదమగుట లేదు. నిర్వాణము భావముగా నెంచి నెమకువారు సంసారమును తరించుట లేదు. కారణమేమి? సర్వనిమిత్తప్రశమము, సర్వేంజితసమింజితములయుపరతి నిర్వాణము. భగవానుఁ డాస్వాఖ్యాతమగు ధర్మమవినయముపేరిట సన్యసించి తీర్థికదృష్టియందు నిపతియలై నిర్వాణము భావముగ నెంచి దాని నన్వేషించువారు మోహపురుషులు (అజ్ఞానులు). నిర్వాణము పొందుటయన తిలలనుండి తైలము, క్షీరమునుండ నవనీతము పొందుటవంటిదనితలఁచివారు దాని నన్వేషించుచున్నారు ధర్మములు అత్యంత పరినిర్వృతము లగుచుండఁగా ఎవరు నిర్వాణ మన్వేషింతురో వారిని నేను అభిమానికులైన తీర్థికులని యందును భగవానుఁడా యోగాచారుఁడు (ఇక్కడయోగియని గ్రహింపవలెనేకాని యోగాచారవాది యని గ్రహింపరాదు) సమ్యక్ప్రతిపన్నుఁడు నగువాఁడు కొండొకధర్మము నుత్పాదింపఁడు; నాశమొందింపఁడు; కొండొక ధర్మము పొందవచ్చునని కాని, ప్రజ్ఞాపారమితను గ్రహింపవచ్చునని కాని తలంపఁడు.